# ఆంధ్రప్రదేశ్‌ను గురించి...

| | |
|---|---|
| విస్తీర్ణం | 1,06,286 చ. మై |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 189 |
| గ్రామాలు | 28,997 |
| పట్టణాలు, నగరాలు | 212 |
| మొత్తం జనసంఖ్య (1961) | 359.83 లక్షలు |
| జన సాంద్రత (1961) | 339 చ మై 15 |
| అక్షరాస్యులు (1961) | 76 27 లక్షలు |
| షెడ్యూల్డు కులాలవారు (1961) | 49.74 లక్షలు |
| షెడ్యూల్డు తెగలవారు (1961) | 13 24 లక్షలు |
| నమోదైన కర్మాగారాలు | 3 928 |
| విశ్వవిద్యాలయాలు | 4 |
| పంచాయతీలు | 15,266 |
| పంచాయతీ సమితులు | 321 |
| ఆంధ్రప్రదేశ్ నుండి పార్లమెంటు సభ్యులు | 61 |
| విధానసభ సభ్యులు | 288 |
| ననమండలి సభ్యులు | 90 |

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి 12 ] డిశంబరు — 1967 [ సంచిక : 2

అగ్రహాయన — పౌష్య — 1889 శా.శ.

ప్రధాన సంపాదకులు

బి. యన్. రామన్, ఐ. ఏ. యస్

సంపాదకులు

ఎస్. వి. గోపాలశా(

*ఈ సంచికలో...*

**మొదటి అట్ట :** లాల్ బహదూర్ స్టేడియంలో ఆంధ్ర ప్రదేశ్ అవతరణ దినోత్సవం

**రెండవ అట్ట :** ఆంధ్ర ప్రదేశ్‌ను గురించి

**మూడవ అట్ట :** మంచు తెరల్లో ప్రకృతి

**నాలుగవ అట్ట :** నవంబరు 1వ తేదీన లాల్‌బహదూర్ స్టేడియంలో జరిగిన సామూహిక విన్యాసం

పేజి



ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు. సం॥

# జన్మభూమి

51159

— రాయప్రోలు

ఏ దేశ మేగినా ఎందు కాలిడిన
ఏ పీఠ మెక్కినా ఎవరెదురయిన
పొగడరా నీ తల్లిభూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గర్వమ్ము
లేదురా యిటువంటి భూదేవి ఎందు
లేరురా మనవంటి ధీరులింకెందు.

ఏ పూర్వ పుణ్యమో, ఏ యోగబలమో
జనియించి నాడ వీ స్వర్గలోకమున
ఏ మంచి పూవులన్ ప్రేమించి నావో
నిను మోచె నీ తల్లి కనకగర్భమున.

సూర్యుని వెలుతురు సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక
నరుడు ప్రాణాలతో నడుచునందాక
అందాక గల యీ యనంత భూతలిని
మన భూమి వంటి కమ్మని భూమి లేదు.

తమ తపస్సులు ఋషుల్ ధారవోయంగ
చండ వీర్యము శూర చంద్రు లర్పింప
రాగ దుగ్ధము భక్త రాజు లీయంగ
భావ సూత్రము కవి బాంధవు లల్ల.

దిక్కుల కెగదన్ను తేజంబు వెలుగ
జగముల నూగించు మగతనం బెగయ
రాలు పువ్వులు సేయు రాగాలు సాగ
సౌందర్య మెగపోయు సాహిత్య మొప్ప.

వెలిగిన దీ దివ్య విశ్వంబు పుత్ర!
దీపించె నీ పుణ్య దేశంబు పుత్ర!
అవమాన మేలరా, అనుమాన మేల
భరత పుత్రుడ నంచు భక్తితో పలుక.

ఏ దేశ మేగినా ఎందు కాలిడినా......

# సంపాదకీయం

1967 నవంబరు ఆంధ్ర ప్రదేశ్ సంచికను పాఠకులు ఆదరించిన తీరు మాకెంతో ఆనందాన్ని కలిగించింది. పాఠకులకు కొత్త శీర్షికలు అందించాలనే ఆకాంక్షతో పత్రిక ప్రచురణను మూడు మాసాలపాటు ఆపుచేయవలసి వచ్చింది. పాఠకుల ఔదార్యానికీ, ఓర్పుకూ మా కృతజ్ఞతలు. వారు ప్రదర్శించిన సహనం, అభిమానం మా కెంతో ఉత్సాహాన్ని కలిగించింది. అన్ని రంగాలలోని అనుభవజ్ఞులైన మిత్రుల సహాయంతో కొత్త శీర్షికలకు అంకురార్పణ చేయ గలిగాము. ప్రభుత్వ పత్రికగా వుంటూనే ప్రతి సంచిక మా పాఠకులకు సంతృప్తి కలిగిస్తుందని ఆశిస్తున్నాము. కొత్త శీర్షికలతో కూడిన మా ప్రథమ సంచికను చూసి అనేకమంది అభినందించారు.

అన్ని రంగాలకు సంబంధించిన అమూల్యమైన సమాచారాన్ని అన్ని రకాల పాఠకులకు ఆసక్తి కలిగించే విధంగా అందించడమే మా లక్ష్యం. పత్రిక ధర మామూలు ప్రకారమే వుంటుంది. సామాన్య ప్రజలకు అందుబాటులో ఉంచే దృష్టితోనేతప్ప యితర పత్రికలతో పోటీపడే దృష్టితో యీ పని చేయలేదు. చాలా స్వల్పమైనధరకు ఆసక్తికరమైన సమాచారాన్ని అందజేస్తున్నప్పటికీ ప్రధానంగా ప్రభుత్వ అధికార పత్రికగానే యిది వ్యవహరిస్తుంది. ప్రభుత్వ వివిధ కార్యక్రమాల వివరాలను యివ్వడంతోపాటు ప్రజాబాహుళ్యానికి వర్తించే ప్రభుత్వ నిర్ణయాలకు సంబంధించిన వివరాలనుకూడా అందజేయడం జరుగుతుంది. అవసరమైన సమాచారం పొందడానికి పాఠకులు ప్రశ్నలు పంపవచ్చు. జనబాహుళ్యానికి ఉపయోగకరమైన వాటికి యీ పత్రికలో జవాబులు ప్రచురించ గలం.





## కరువు ప్రాంతాలలో సహాయక చర్యలు

ముఖ్య మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి, సతీ సమేతంగా లండన్ నుండి రాగానే విమానాశ్రయంలో పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో గల ఆహార కొరతను మదింపు వేసి ప్రజల యీతిబాధల నివారణకు అవసరమైన చర్యలను వెంటనే తీసుకోవడం జరుగుతుందని అన్నారు. ప్రజలకు సహాయ పడడానికి సాధ్యమైన చర్యలన్నిటినీ తీసుకుంటామని ఆయన అన్నారు.

కరువు ప్రాంతాలలో అమలు జరపాల్సిన సహాయ కార్యక్రమాలను గూర్చి చర్చించడానికి డిశెంబరు 13 వ తేదీన రాష్ట్ర మంత్రివర్గం సమావేశమవుతుంది.

డిశెంబరు 3 వ తేదీన మాట్లాడుతూ వర్షాభావం ఫలితంగా ఆహారం, పశుగ్రాసం, మంచినీటి కొరత ఏర్పడిన విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలో పర్యటిస్తానని ముఖ్యమంత్రి అన్నారు.

ఈ ప్రాంతాలలో పంపిణీ నిమిత్తం కేంద్ర ప్రభుత్వం 500 టన్నుల పిల్లల ఆహారాన్ని కేటాయించిందనీ ఈ ఆహారాన్నీ, గోధుమలు, తదితర ఆహార పదార్థాలను యింకా ఎక్కువ మొత్తంలో పంపాలని కేంద్రానికి విజ్ఞప్తి చేశామనీ ముఖ్యమంత్రి వెల్లడించారు.

ప్రతి రాష్ట్రంలో లభించే ఆర్థిక వనరులు, అభివృద్ధి స్థాయి ప్రాతిపదికగా ఆయా రాష్ట్రప్రణాళికలకు కేంద్ర సహాయం లభింప చేయాలనీ, దేశంలోని అన్ని ప్రాంతాలు ఒకేరీతిగా అభివృద్ధి చెందడానికి యిది చాలా అవసరమనీ ముఖ్యమంత్రి అన్నారు.



నాడూ-నేడూ

# ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక ప్రగతి

సి. వి. హెచ్. రావు

"రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధి కొంత సంతృప్తికరంగా వున్నప్పటికీ ఈ అభివృద్ధి తీరుతెన్నులు అంత సంతృప్తికరంగా లేవు" అంటూ రాష్ట్ర పరిశ్రమల శాఖామంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి, శాసనసభ బడ్జెటు సమావేశంలో పరిశ్రమల శాఖ పద్దును ప్రవేశపెడుతూ అన్నారు. ఇంతవరకు పారిశ్రామిక అభివృద్ధి కృషి యావత్తూ హైదరాబాదు, విశాఖపట్టణం, విజయవాడ, వరంగల్లు, కొత్తగూడెం వంటి కొన్ని పట్టణాలకు మాత్రమే పరిమితమైపోయిందని, అందువల్లనే రాష్ట్ర ఆర్థిక వ్యవస్థపై యీ అభివృద్ధి ప్రభావం ఏమాత్రం పడినట్టు లేదని అన్నారు. పారిశ్రామిక అభివృద్ధి తీరులోని ప్రధానలోపం యిదే నని స్పష్టం చేశారు.

నిజమే. మంత్రిగారు చెప్పిన విషయం రాష్ట్ర పారిశ్రామిక పరిస్థితిలో కొట్టొచ్చినట్టు కనబడుతున్న లోపమే. అయితే అదొక్కటే లోపం మాత్రం కాదు. ఇంకావున్నాయి. ప్రయివేటు రంగం క్రింద చెప్పుకోదగ్గ కృషి జరగడంలేదు. ఏదోనామమాత్రంగానే యీ రంగం క్రింద పరిశ్రమలు నెలకొల్పబడుతున్నాయి. అదొక లోపం. మరొకటి—కేంద్రం, రాష్ట్రంలో పబ్లిక్ రంగం క్రింద నెలకొల్పే పరిశ్రమలలో పెట్టే పెట్టుబడులు యితర వాటితో పోల్చి చూస్తే బాగా తక్కువగా వుండడం. ఇవి ప్రధానంగా చెప్పుకోవలసిన మరికొన్ని కారణాలు. కొన్ని ఇతర రాష్ట్రాలలో యీ రెండూ సమ స్థాయిలో వుండి పారిశ్రామిక అభివృద్ధి కుంటుపడకుండా నల్లేరు మీద బండిలా సాగిపోవడానికి దోహదం చేస్తూ వస్తున్నాయి. ఇంత మాత్రంచేత పారిశ్రామికాభివృద్ధి కృషిలో రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యత లేదని చెప్పడంలేదు. నిజానికి వీటి బాధ్యతే చాలా ఎక్కువగా వుంటుంది. మన రాష్ట్రం పారిశ్రామికాభివృద్ధికి ఆలస్యంగా శ్రీకారం చుట్టినప్పటికీ ఈ అభివృద్ధి కృషిలో తనవంతు బాధ్యతను నిర్వర్తించడంలో విశేషంగా కృషి జరుపుతున్నది. నిజానికి, యీ రంగంలో కొంత విజయాన్ని కూడా మన రాష్ట్ర ప్రభుత్వం సాధించింది.

ఈ రంగంలో రాష్ట్ర ప్రభుత్వం జరుపుతున్న కృషి ప్రధానంగా సాంకేతిక సలహా, సహాయ, ప్రోత్సాహాల మీద ఆధారపడి వున్నది. సాంకేతిక సలహాలను అందజేయడం, ఆ విషయాలలో సహాయపడడం, ప్రయివేటు పారిశ్రామిక వేత్తలు ముందుకువచ్చి పరిశ్రమలను స్థాపించేటట్టు వారిని ప్రోత్సహించడం—యివి ప్రధానంగా ప్రభుత్వకృషికి సంబంధించిన కార్యకలాపాలు. ఈ కార్యకలాపాల వల్ల ప్రభుత్వం పారిశ్రామికాభివృద్ధి లక్ష్యాన్ని కొంతవరకు సాధించగలిగింది. ఈ సౌకర్యాల్ని కల్పించాలంటే కొన్ని యిబ్బందులు ఎదుర్కోవాల్సి వుంది. విద్యుదుత్పత్తిలో అభివృద్ధిని సాధించాలి. ఇలాంటి యిబ్బంది వున్నప్పటికీ ప్రభుత్వం పారిశ్రామికాభివృద్ధిని కొంత వరకు సాధించడం గమనార్హం.



*భారత్ భారీ విద్యుత్పరికరాల కర్మాగారం*

ఏవోకొన్ని నగరాలు, పట్టణాల చుట్టూ పరిశ్రమలు కేంద్రీకరించబడడమే పారిశ్రామిక అభివృద్ధిలో ప్రధాన లోపమని రాష్ట్ర పరిశ్రమల శాఖామంత్రి స్పష్టంచేసిన విషయం యింతకుముందే ప్రస్తావించాను. ఈ విధంగా ఒకేచోట పరిశ్రమలు కేంద్రీకృతం కావడం పారిశ్రామికాభివృద్ధికి ఏ విధంగానూ దోహదం కాదు. అయితే ఆంధ్ర ప్రదేశ్ వంటి రాష్ట్రాలలో యిది తప్పనిసరి. ఎందుకంటే ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికీకరణ ప్రధానంగా వ్యవసాయ, అటవీ వనరుల మీదా; ఖనిజాలు, సముద్ర సంపదలమీదా; వాటిని పరిశ్రమలలో సాధ్యమైనంత ఎక్కువగా ఉపయోగించు కోవడం మీదా ఆధారపడివున్నదనే విషయం యిక్కడ ఎవరూ అంతగా గుర్తించినట్టు లేదు. చిరకాలంగా ఈ విషయం విస్మరింపబడుతూ వస్తోంది. రాష్ట్రంలో పారిశ్రామికీకరణ ఎప్పుడూ ఇక్కడ లభ్యమయ్యే వనరులమీదే ఆధారపడి వుండాలన్న సత్యాన్ని మనం విస్మరించరాదు.

దీనివల్ల రాష్ట్రంలోని అపారమైన వనరుల్ని సాధ్యమైనంత ఎక్కువగా వినియోగించుకునే అవకాశం వుంటుంది. ఈ దృష్ట్యా

యీ అంశాన్ని మనం విస్మరించ తగదు. అంతే కాదు. మరో రెండు ప్రధాన విషయాలు కూడా దీనిలో వున్నాయి. మొదటిది— గ్రామీణ, పట్టణ ప్రాంతాలలోని ఆర్థిక వ్యత్యాసాన్ని తొలగించ వలసిన అవసరం ఎంతయినా వుంది. రెండవది—గ్రామీణ ప్రాంతాలలోని అపారమైన మానవశక్తి వనరులను పూర్తిగా వినియోగించుకొని తద్వారా వ్యవసాయమే ప్రధాన వృత్తిగాగల గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగులకు, పాక్షిక నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలను కల్పించడం చాలా అవసరం. పైన చెప్పిన వనరుల మీద ఆధారపడిన పరిశ్రమలను నెలకొల్పడంవల్ల యీ రెండు సమస్యలను కూడా అధిగమించవచ్చు.

రాష్ట్రంలోని అనుకూల పరిస్థితులదృష్ట్యా పబ్లిక్ రంగంలో భారీ ప్రాతిపదిక పరిశ్రమలను సాధ్యమైనన్ని ఎక్కువగా యిక్కడ కేంద్రం నెలకొల్పేటట్లు రాష్ట్రప్రభుత్వం కేంద్రాన్ని గట్టిగా కోరాలి. ఆ పరిశ్రమలు బొగ్గు, ఖనిజాలు వంటి వనరులపై ఆధారపడిన పరిశ్రమలైనా కావచ్చు, లేదా వనరులపై ఆధారపడని పరిశ్రమలైనా కావొచ్చు. రాష్ట్రప్రభుత్వం ఈ పరిశ్రమలకు నీరు, విద్యుచ్ఛక్తి రవాణా, తదితర సౌకర్యాలు లభించడానికి అవకాశంగల స్థలాన్ని అందజేయాలి. ఉక్కు కార్మాగారం, ఎరువుల కార్మాగారం వంటివి రాష్ట్రంలో నెలకొల్పబడితే రాష్ట్రాల మధ్య పారిశ్రామికాభివృద్ధిలోగల అసమానతలు తొలగిపోగలవు. వాటివల్ల అనేక అనుబంధ, సహాయక పరిశ్రమలు తలెత్తగలవు. సాంకేతిక క్షేత్రాలకు, పారిశ్రామిక వేత్తలకు చక్కటి అవకాశాలు ఏర్పడగలవు. కార్మికులకు ఉపాధి లభిస్తుంది. పారిశ్రామిక ప్రగతి సిద్ధిస్తుంది.



*హెచ్. యం. టి. కర్మాగారం లోపలి భాగం*

ఈ విషయంలో రాష్ట్రప్రభుత్వకృషి కొంత మేరకు మాత్రమే విజయవంతమైందని చెప్పాలి. గత కొద్ది సంవత్సరాల లోనూ రాష్ట్రంలో మూడు భారీ కేంద్రప్రాజెక్టులు నెలకొల్పబడ్డాయి. ఒకటి— హిందుస్థాన్ యంత్రపరికరాల కర్మాగారం. మరొకటి— భారత్ భారీ విద్యుత్పరికరాల కర్మాగారం. ఇంకొకటి— సింథటిక్ మందుల కార్మాగారం. ఈ మూడూ యిప్పుడు ఉత్పత్తిలను కూడా ప్రారంభించాయి. చతుర్థ పంచవర్ష ప్రణాళికా కాలంలో కేంద్రం, ఆంధ్రప్రదేశ్‌లో పబ్లిక్ రంగంక్రింద రూ. 16.7 కోట్ల ఖర్చుతో భారత్ హెవీప్లేట్స్ అండ్ వెస్సల్స్ కర్మాగారం, రూ. 7 కోట్ల ఖర్చుతో చర్లపల్లిలో కేబిల్ కర్మాగారం, రూ 7.85 కోట్ల ఖర్చుతో చర్లపల్లిలో ఆటామిక్ ఎనర్జీ కాంప్లెక్స్ కార్మాగారాలను నిర్మించనున్నది. అయిదవ ఉక్కు కార్మాగారాన్ని ఆంధ్రప్రదేశ్‌లో నెలకొల్పే విషయం ప్రస్తుతానికి వాయిదా పడినప్పటికీ ఆంధ్రప్రదేశ్ లోనే యిది నెలకొల్పబడవచ్చునని పరిశీలకుల అభిప్రాయం. వేచి చూద్దాం.

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికీకరణకూ, ప్రభుత్వం పబ్లిక్ రంగం క్రింద నెలకొల్పిన నాలుగు కార్పొరేషన్ల శక్తి సామర్థ్యం, పనితీరుకూ సన్నిహిత సంబంధంవుంది. పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్, లఘుపరిశ్రమల కార్పొరేషన్, మైనింగ్ కార్పొరేషన్, రాష్ట్ర ఫైనాన్షియల్ కార్పొరేషన్ — యీ నాలుగింటిని ప్రభుత్వం ఏర్పాటుచేసింది. తమకు సంబంధించిన రంగాలలోని పరిశ్రమలను అభివృద్ధిపరచడం, సాంకేతిక సహాయాన్నీ, ఆర్థిక సహాయాన్నీ వాటికి అందజేయడం యీ కార్పొరేషన్ల పని.

ఈ కార్పొరేషన్లు చేసిన, చేస్తున్న కృషిని గురించి విడి విడిగా వివరంగా యీ చిన్న వ్యాసంలో తెలియజేయడం వీలుకాదు. అయితే ఒక విషయం చెప్పక తప్పదు. మధ్యతరహా, లఘు పరిశ్రమలకూ, ఖనిజాల త్రవ్వకం అభివృద్ధిచెందడానికి ఈ నాలుగు కార్పొరేషన్లూ సమిష్టిగా బాధ్యత వహిస్తాయి.

విడివిడిగా యీ కార్పొరేషన్లు తమ తమ పరిధులలో చేసిన కృషి, ముఖ్యంగా పరిశ్రమలకు ఆర్థిక సహాయం చేయడంలోగాని, తమ అధీనంలోని సాంకేతిక పరిజ్ఞానాన్ని అందజేయడంలోగాని, ఉన్న పరిమితులమేరకు గణనీయమైన కృషే జరిపాయనవచ్చు. కోరమాండల్ ఎరువుల కర్మాగారాన్ని నెలకొల్పడానికి అవసరమైన సౌకర్యాలన్నిటినీ పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషను కల్పించింది. బాల్ బేరింగ్ ప్రాజెక్టును ఏర్పాటు చేయడానికి కూడ తోడ్పడేందుకు ఒప్పందం జరిగింది. గ్రామీణ పారిశ్రామిక వాడలకు అవసరమైన పరికరాలను తయారుచేసే జనరల్ పర్పస్ ఇంజనీరింగ్ వర్క్‌షాపు నొకదానిని నెలకొల్పేందుకు లఘు పరిశ్రమల కార్పొరేషను అవసరమైనసహాయాన్ని అందజేస్తున్నది. అంతేగాక భారత ప్రభుత్వం వారి జాతీయ లఘుపరిశ్రమల కార్పొరేషన్, లఘు పరిశ్రమల అభివృద్ధి కమీషనర్ సహాయంతోను, రాష్ట్రప్రభుత్వ పరిశ్రమలశాఖ సహాయంతోను లఘుపరిశ్రమల అభివృద్ధికి తీవ్రమైన ఉద్యమాన్ని నిర్వహిస్తూ దాని ప్రగతికి తోడ్పడుతున్నది. వివిధ రకాల లఘుపరిశ్రమలు రాష్ట్రంలో తలెత్త డానికి విశేషించి కృషిచేస్తున్నది. మైనింగ్ కార్పొరేషన్ చేపట్టవలసిన పనికూడా విశేషంగానే వున్నది. ఇంతవరకు త్రవ్వితీయని ఖనిజ సంపద రాష్ట్రంలో అపారంగా వుండడంవల్ల యీ రంగంలో దీనికృషి లాభదాయకంగానే వుంటుంది. రాష్ట్రంలోని ఖనిజ నిక్షేపాలను వెలికి తీసేందుకై రాష్ట్ర ప్రభుత్వం భారత భూగర్భశాఖ, భారతీయ గనుల సంస్థ సహాయంతో కడపజిల్లాలో ప్రాతిపదిక ఖనిజాలు లభ్యమయ్యే

స్థలాలను తెలుసుకునే నిమిత్తం "ఆపరేషన్ హార్డ్‌రాక్" పేరుతో విమానాలద్వారా ఖనిజ నిక్షేపాల సర్వే ఒకటి జరిపింది. దీనివల్ల రాష్ట్రంలో ఖనిజ నిక్షేప సంపద ఎంతవున్నదో తెలుసుకోవడమే గాక యీ రకరకాల ఖనిజాలను వెలికితీయడానికి వివిధ పథకాలను రూపొందించడానికికూడా వీలవుతుంది. పైపెచ్చు ఇలా వెలికి తీసిన ఖనిజాలను రాష్ట్రంలోని ఖనిజ పరిశ్రమలకు ముడిసరుకుగా ఉపయోగించుకోవచ్చు. లేదా ఎగుమతి చేసుకోవచ్చు.

రాష్ట్రంలోని అపారమైన ప్రకృతి వనరులను నిరంతరంగా పరిశ్రమలలో వినియోగించుకోవాలంటే రాష్ట్రంలోనూ, యితర రాష్ట్రాలలోనూ వుండే పారిశ్రామిక వేత్తలు తమ తమ పెట్టుబడులతో ముందుకు రావడం చాలా అవసరం. రాష్ట్రంలోని యీ ముడి ఖనిజాలను వినియోగించేందుకు పారిశ్రామిక వేత్తలు ముందుకు వచ్చేట్లు చూడవలసిన బాధ్యత ప్రభుత్వానిదీ, ఈ నాలుగు కార్పొరేషన్లదీనూ. ఇంతవరకు నెలకొల్పబడిన పరిశ్రమలను విజయవంతంగా నిర్వహించడంలో కార్పొరేషన్ చేసిన సహాయం, ముమ్ముందు కొత్త పరిశ్రమలను నెలకొల్ప దలచిన వారికి ప్రోత్సాహం కలిగించేదిగా ఉండాలి. ఈ సహాయం అందజేయాలని రాష్ట్ర ప్రభుత్వం ఆత్రతతో ఉండడం వాస్తవంగా ప్రోత్సాహకరమైన విషయం. అదే సమయంలో కార్పొరేషనులు ప్రోత్సాహక కార్యక్రమాలను నిర్వహించడానికి కూడ సహాయపడడం అవసరం. కార్పొరేషన్ పెంపొందించిన పారిశ్రామిక సంస్థల మేనేజిమెంటు, కార్పొరేషన్ సహాయంపొందిన సంస్థల నిర్వహణ, రాష్ట్రంలో పబ్లిక్‌రంగంలోని కొన్ని సంస్థల నిర్వహణలనుగూర్చి కూడ శ్రద్ధ వహించాలి. తాత్కాలిక పద్ధతిపై సంస్థల మేనేజరును నియమించడం కాక సంస్థల సీనియరు మేనేజిమెంటు సిబ్బందికి శిక్షణ యివ్వడం నేడు చాలా అవసరం.

ఆంధ్రప్రదేశ్‌లో సమీప భవిష్యత్తులో పారిశ్రామిక అభివృద్ధికి ప్రత్యేకంగా పేర్కొనదగిన నాలుగు అంశాలు ఉన్నాయి. ఇతర అంశాలకు సంబంధించిన విధానాలు కార్యక్రమాలు యిప్పుడు స్పష్టంగా ఉండి పటిష్ఠవంతంగా అమలు జరపబడుతున్నప్పటికీ దిగువతెల్పిన విషయాలకు సంబంధించిన విధానాలు, కార్యక్రమాలనుకూడ పటిష్ఠవంతంగా అమలు జరపాల్సిఉంది.

మొదట రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో పరిశ్రమల అభివృద్ధికి అనువైన ప్రదేశాలను ఎన్నికచేసి, పారిశ్రామిక అభివృద్ధి ప్రాంతాల పథకాలను మరింత త్వరితగతిని సమర్థవంతంగా రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించాలి. అటువంటి ప్రాంతాలను ఎన్నిక చేసిన తర్వాత ఆ ప్రాంతంలో పరిశ్రమల యూనిట్ల ఏర్పాటుకు అవసరమైన రోడ్లు, కమ్యూనికేషన్స్, నీటిసరఫరా మొదలైన సౌకర్యాలను కలిగించడమేగాక స్థలాలను యూనిట్లకు కౌలుకు యిచ్చే ఏర్పాటు చేయాలి. ఈ ప్రాంతాలు క్రమంగా పారిశ్రామిక పట్టణాలుగా అభివృద్ధిచెంది అనేక పెద్ద, చిన్న పరిశ్రమలు, అనుబంధ పరిశ్రమలు ఏర్పడుతాయి. అవి పరస్పర సహాయంతో ఆరోగ్యకరమైన పోటీతో నిర్వహించబడడానికి అవకాశం ఏర్పడుతుంది. విజయవాడలోని "జవహార్ ఆటోనగర్" పథకాన్ని యిందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు. మోటారు రవాణా పరిశ్రమకు అవసరమైన పరికరాలను తయారు చేయడానికి అక్కడ అనేక యూనిట్లను నెలకొల్పాలని ఉద్దేశించారు. ఇటువంటి పథకం పారిశ్రామిక వేత్తలకు ఎంతో ప్రయోజనకరమైనది.



సనత్ నగర్ పారిశ్రామిక వాటిక

రెండవది — రాష్ట్రంలో గ్రామీణ పరిశ్రమల పథకాలను ఎక్కువ సంఖ్యలో నెలకొల్పడానికి సంబంధించిన కేటాయింపులను ప్రభుత్వం పొందాలి. వ్యవసాయము, యితర స్థానిక వనరుల ఆధారంగా వెనుకబడిన ప్రాంతాల్లో లఘు పరిశ్రమలను త్వరితగతిని అభివృద్ధిచేయడానికి ప్రణాళికా సంఘం యీ కార్యక్రమాన్ని ప్రత్యేకంగా రూపొందించింది. ఈ కార్యక్రమాన్ని చురుకుగా అమలు జరపడానికి వీలుగా విద్యుచ్ఛక్తి, ఎక్కువ పరిమాణంలో వ్యవసాయ ముడిపదార్థాల సరఫరా, లభించే రవాణా సౌకర్యాలు, —ఇవి ప్రాతిపదికగా చిన్న పట్టణాలు గానీ గ్రామాలుగానీ కేంద్రాలుగా నిర్ణయించాలి. ఈ ప్రాంతాలలో పరిశ్రమలను నెలకొల్పడానికి ముందుకువచ్చే పారిశ్రామిక వేత్తలకు పరపతి సౌకర్యాలు, సాంకేతిక సలహాలు, సర్వీసు సౌకర్యాలు, అందజేసే సమీకృత పథకాన్ని కూడ వెంటనే అమలు జరపాలి. ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం అటువంటి మూడు పథకాలను 1962—63 సంవత్సరం నుండి అమలు జరుపుతున్నారు. అయితే ప్రణాళికాసంఘం పేర్కొన్న నిబంధనలను పూర్తిచేస్తే రాష్ట్ర ప్రభుత్వం మరికొన్ని పథకాలను పొందకలుగుతుంది. ఈ ప్రాజెక్టులకు ప్రణాళికాసంఘం అందజేసే సహాయాన్నికూడ ఉపయోగకరంగా వినియోగించవచ్చు.

మూడవది—త్వరితగతిని అభివృద్ధి చెందుతున్న నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతంలో లఘుపరిశ్రమలు, సంబంధిత యితర

పరిశ్రమలు, ఇంజనీరింగ్ పరికరాల తయారీ పరిశ్రమలను విస్తృత ప్రాతిపదికపై నెలకొల్పడానికి అపారమైన అవకాశాలు ఉన్నాయి. "త్వరితగతిని అన్నిరంగాలలో సమానాభివృద్ధిని సాధించడానికి" పరిశ్రమల అభివృద్ధి ప్రణాళికలకు యిటువంటి ప్రాంతాలు ప్రత్యేక ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. అనేక అంశాలపై యీ ప్రాంతాల పారిశ్రామిక అభివృద్ధి ఆధారపడి ఉంటుందని సాంకేతిక ఆర్థిక సర్వే రిపోర్టులో పేర్కొన్నారు. ఈ ప్రాంతంలో ప్రత్యేకంగా వ్యావసాయిక పరిశ్రమలకు చెందిన ఆయిల్ క్రషింగ్ ఎక్స్‌పెల్లర్లు, పత్తిగింజలు వేరుచేసే ఫ్యాక్టరీలు, బియ్యం మిలులు చెరకు ఉత్పత్తి జరిగే చోట్ల కొన్ని చక్కెర ఫ్యాక్టరీలు, ఖండసారి యూనిట్లువంటి పరిశ్రమలను ఏర్పాటు చేయవచ్చునని రిపోర్టులో పేర్కొన్నారు. ఈ ప్రాజెక్టుక్రింద విస్తృత ప్రాతిపదికపై వేరుశనగ పైరు వేయాలని ఉద్దేశించిన దృష్ట్యా ఒకటి, రెండు వనస్పతి ఫ్యాక్టరీలను కూడ ఏర్పాటు చేయడానికి అవకాశంఉంది. ఈ ఆయకట్టు ప్రాంతంలో రైతులకు కావాల్సిన వ్యవసాయ యంత్ర పరికరాలను తయారుచేసే పరిశ్రమలను కూడ యిక్కడ నెలకొల్పవచ్చు. విద్యుచ్ఛక్తి సరఫరా పెరుగుతూ, ఆర్థిక వనరులు అభివృద్ధి చెందుతున్న దృష్ట్యా యీ ప్రాంతంలో విద్యుచ్ఛక్తి పరికరాలు, వినియోగ వస్తువులకు సంబంధించిన పరిశ్రమలను కూడ ప్రారంభించవచ్చు.



*రాజమండ్రి పేపరు మిల్లు*

నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రాంతంలో లభించే పారిశ్రామిక వనరులకు సంబంధించి సర్వే జరిపే పనిని లఘు పరిశ్రమల విస్తరణ శిక్షణ సంస్థ నిర్వహిస్తున్నది. ప్లాను ప్రింట్లు సిద్ధమైన వెంటనే అమలు జరపడానికి వీలుగా అమలుజరపాల్సిన వివిధ పరిశ్రమలకు చెందిన పారిశ్రామిక పథకాలను యీ సంస్థ వెంటనే రూపొందించాలి. ఈ వ్యవధిలో యీ ప్రాజెక్టు ప్రాంతంలో పరిశ్రమలను నెలకొల్పడంలో ప్రోత్సాహం కలిగించడానికి పరిశ్రమల శాఖ, పారిశ్రామిక అభివృద్ధి సంస్థ, సహకారశాఖలు తీవ్రంగా ప్రచారం చేయాలి.

నాలుగవది — ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక వాడల నిర్మాణం కార్యక్రమాన్ని పరిపుష్టం చేయాలి. పారిశ్రామిక వాడలను అభివృద్ధి పరచి, తగిన విధంగా వినియోగించుకోవడానికి, ప్రస్తుతం అమలులో ఉన్న పథకాలలోని లోపాలను సవరించడానికి ఒక కార్యక్రమాన్ని అమలు జరపాలి.

రాష్ట్రంలో ప్రాతిపదిక పరిశ్రమయైన వ్యవసాయానికి అనుబంధంగా ఉండే వ్యావసాయక పరిశ్రములు, లఘుపరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు నెలకొల్పాల్సిన అవసరం ఉన్నదని ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక అభివృద్ధి సమస్యలను యిటీవల చర్చించినప్పుడు నొక్కిచెప్పారు. ఇదిచాలా హర్షించదగిన విషయం. రాష్ట్ర వనరులను గరిష్టపరిమితిలో వినియోగించుకుని, ఎక్కువ ఉద్యోగ అవకాశాలు కల్పించి, రాష్ట్ర ఆదాయాన్నీ, తలసరి సగటు ఆదాయాన్నీ పెంపొందించడానికి వీలుగా బహుముఖ లక్ష్యాలతో వివిధ పరిశ్రమలను నెలకొల్పడాన్ని ప్రోత్సహించి, పారిశ్రామికాభివృద్ధికి ప్రభుత్వం తీవ్రంగా కృషిచేయాలి. ఈ విధంగా రాష్ట్ర ప్రణాళిక అంచనాలను సాధించడమేగాక, సర్కారు, రాయలసీమ, తెలంగాణా జిలాలమధ్య ఉన్న వ్యత్యాసాలను తొలిగించవచ్చు.

"పారిశ్రామికాభివృద్ధి దశాబ్ది" కాలంలో ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ మారమధ్యంలో ఉంది. మూడవ ప్రణాళికకుముందు ఉన్న పరిస్థితులతో పోల్చినప్పుడు పారిశ్రామిక పరిస్థితులు నేడు ఎంతో ప్రోత్సాహకరంగా, సహాయకారిగా ఉన్నాయి. ప్రత్యేకంగా విద్యుదుత్పాదక శక్తి పెంపొందడం, దాని అభివృద్ధికి ప్రభుత్వం నిర్వహిస్తున్న కృషి, ప్రభుత్వపారిశ్రామిక విధానాలు, ప్రైవేటురంగంలో పరిశ్రమలను ప్రోత్సహించడానికి ప్రభుత్వం కల్పిస్తున్న ప్రోత్సాహం మొదలైన విషయాలు, సత్వర పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుతున్నాయి. తగిన ప్రణాళిక, దృఢనిశ్చయాలతో పాటు, అమలు జరిపే విధానాలపైన, తీవ్రమైన కృషిపైన యివి చాలావరకు ఆధారపడిఉన్నాయని సాంకేతిక, ఆర్థిక సర్వేనివేదికలో పేర్కొన్నారు.

రాష్ట్రంలోని 4.6 కోట్లమంది ప్రజలకు ఉత్తమ జీవిత పరిస్థితులను కల్పించడానికి సులువైన మార్గమేదీ మరొకటిలేదు.



## మన ప్రధాన కార్యదర్శి

శ్రీ యం. టి. రాజుగారు అక్టోబరు 29 వ తేదీన ప్రధాన కార్యదర్శిగా పదవి స్వీకరించారు. ఐ. సి. యస్ అధికారవర్గంలో శ్రీ రాజుగారు సీనియర్ సభ్యుడు.

పూర్తిపేరు మంతెన తిమ్మరాజు. జననం 1911 సంవత్సరం అక్టోబరు 6 వ తేదీ. 1935లో ఆయన ఇండియన్ సివిల్ సర్వీసులో ప్రవేశించారు. ప్రథమంగా తంజావూరు అసిస్టెంట్ కలెక్టరుగా నియమితులయ్యారు. తరువాత ఒంగోలు సబ్ కలెక్టరుగా పనిచేశారు. కొంతకాలంపాటు మిలిటరీ రిక్రూట్ మెంట్ ఆఫీసర్‌గా కూడా వున్నారు. అనంతరం రాజమండ్రిలో సబ్ కలెక్టరుగా నియామకం జరిగింది. 1945-48 మధ్యకాలంలో కేంద్ర ప్రభుత్వ కార్మిక శాఖలో డిప్యూటీ కార్యదర్శి పదవి నలంకరించి, ఆ హోదాలో అనేక అంతర్జాతీయ సంఘాలలో భారత ప్రభుత్వానికి ప్రాతినిధ్యం వహించారు. అంతర్జాతీయ కార్మిక సంఘం సమావేశంలో భారత ప్రతినిధిగా వ్యవహరించారు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో శ్రీ రాజుగారు వ్యవసాయ శాఖ డైరెక్టరుగానూ, పరిశ్రమల శాఖ డైరెక్టరుగానూ పనిచేశారు. హైదరాబాదులో పోలీసు చర్య జరుగక పూర్వం అనుభవజ్ఞుడైన ఒక సీనియర్ అధికారి నియామకం అవసరమైంది. ఆసందర్భంలో రాజుగారిని, హైదరాబాదులోని భారత ఏజెంటు శ్రీ కె. యం. మున్షీకి కార్యదర్శిగా నియమించారు.

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినప్పుడు కర్నూలులో ఆయన రెవిన్యూ శాఖ కార్యదర్శిగా పనిచేశారు. ఆంధ్ర ప్రదేశ్ విస్తృత రాష్ట్రంగా ఏర్పడిన తర్వాతగూడ ఆయన ఆపదవిలోనే వున్నారు. 1958 లో రెవిన్యూ బోర్డు సభ్యులుగా నియమితులైనారు. ప్రధాన కార్యదర్శిగా నియమితులయ్యే వరకు ఆయన బోర్డు సభ్యులుగానే వున్నారు.

రెవిన్యూబోర్డు సభ్యులుగా వుంటున్నప్పుడు రాజుగారు అనేక శాఖలను సమర్థంగా నిర్వహించారు. అమ్మకాల పన్ను మీద ఆదాయం 1962 లో రు. 13 కోట్లు మాత్రమే వుండేది. ఇది యీ యేడు రు 30 కోట్ల పైకి పెరిగిందంటే దీనికి ఆయనే ముఖ్యంగా బాధ్యులు

జిల్లా పరిపాలనా వ్యవస్థలో జాప్యాలను తగ్గించి, దానిని పటిష్టంచేయడానికి అవసరమైన సలహాలను యిచ్చేందుకై ప్రభుత్వం కొంతకాలం క్రితం నియమించిన సంఘానికి ఆయన అధ్యక్షత వహించారు. రాజుగారు పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకాకు చెందినవారు. లండన్‌లో బి. ఎ. ఆనర్స్ డిగ్రీ పొందారు. బారిష్టరుకూడా.



" ఇటీవలనే శ్రీ కె. యస్. అనంతరామన్ గారు ప్రధాన కార్యదర్శి పదవీ విరమణ చేశారు. కాని ఒకందుకు మనందరికీ సంతోషం. ఎందుకంటే ఆయన మరొక ముఖ్యపదవి-రాష్ట్ర విజిలెన్స్ కమీషనర్-నిర్వహిస్తూ యిక ముందుకూడా మన మధ్యనే వుంటారు. అనంతరామన్ గారుకూడా ఐ. సి. యస్. ఉద్యోగి వర్గానికి చెందినవారే. వారు మంచి సంస్కార వంతులు, సజ్జనులు, పండితులు. సంగీతం మీద, యితర లలిత కళలమీద ఆయనకు చాల అభిమానం. ఆంధ్ర సంస్కృతి, వాతావరణం చక్కగా తెలిసిన వారు "

-దక్కన్ క్రానికల్

అనంత రామన్ గారి వయస్సు 58 సంవత్సరాలు. 1932 నుండి ప్రభుత్వోద్యోగం చేస్తున్నారు. ప్రథమంగా కాకినాడలో అసిస్టెంట్ కలెక్టరుగా నియమితులయ్యారు. భూసంస్కరణల సంఘానికి, గ్రామోద్యోగుల విషయాలను పరిశీలించే సంఘానికి వీరు అధ్యక్షులుగా వున్నారు.

## ఇతర మార్పులు

శ్రీ ఎస్.ఎ. అయ్యంగార్, ఐ.పి.ఎస్.—ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ అధ్యక్షుడు.

శ్రీ వి. కె. రావు, ఐ. సి. ఎస్.—రెవెన్యూబోర్డు ప్రథమసభ్యుడు.

శ్రీ ఎం. ఎ. అబ్బాసీ, ఐ. ఎ. ఎస్.—పరిశ్రమల శాఖ కార్యదర్శి.

శ్రీ ఎన్. రమేశన్, ఐ. ఎ. ఎస్.—ఆర్థికశాఖ కార్యదర్శి.

శ్రీ బి. ఎల్. ఓట్సు, ఐ. ఎ. ఎస్.—గనుల శాఖ కార్యదర్శి.

శ్రీ ఎస్. ఆర్. రామమూర్తి, ఐ.ఎ.ఎస్.—విద్యాశాఖ కార్యదర్శి.

శ్రీ ఎ. కృష్ణస్వామి, ఐ. ఎ. ఎస్.— హోంశాఖ కార్యదర్శి.

## జిల్లా పరిపాలన

జిల్లా ఆర్థిక అభివృద్ధిసాధన బాధ్యతను ఒకేసంస్థ వహించాలనే దృష్టితో జిల్లా పరిపాలనను పునర్వ్యవస్థీకరించాలనే సమస్యను, 1967 ఏప్రిల్ 12 నుండి 14 వ తేదీవరకు జరిగిన కలెక్టర్ల సమావేశంలో చర్చించారు. ఈ ప్రతిపాదనను, దాని అమలుకు ప్రస్తుతం ఉన్న నియమ నిబంధనలలో జరగాల్సిన మార్పులను గూర్చి సమగ్రంగా పరిశీలించే నిమిత్తం, 1967 మే లో ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. కలెక్టర్ల సమావేశంలో జరిగిన చర్చల వివరాలను, అనేక యితర విషయాలను యీ సంఘం పరిశీలించి తమ నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. ప్రభుత్వం యీ నివేదికను ఆమోదించి, ఈ దిగువ ఉత్తర్వులను జారీచేసింది.

జిల్లా కలెక్టరు (అధ్యక్షుడు), జిల్లా పరిషత్తు అధ్యక్షునితో ప్రతి జిల్లాకు ఒక జిల్లా అభివృద్ధి బోర్డు ఉంటుంది. జిల్లా పరిషత్తు కార్యదర్శి ప్రస్తుతానికి యీ బోర్డు కార్యదర్శిగా వ్యవహరిస్తారు.

జిల్లా ఆర్థిక అభివృద్ధికి యీ బోర్డు బాధ్యత వహిస్తుంది. జిల్లా ఆర్థిక అభివృద్ధికి ఉద్దేశించిన కార్యక్రమాలను ప్రత్యేకంగా వ్యవసాయం, పారిశ్రామిక ఉత్పత్తికి సంబంధించిన కార్యక్రమాలతో పాటు నీటిపారుదల, విద్యుచ్ఛక్తి పశుగణాభివృద్ధి, మత్స్య పరిశ్రమ, సహకారం, మార్కెటింగ్ కార్యక్రమాలను రూపొందించి అమలు జరపడానికి యీ బోర్డు బాధ్యత వహిస్తుంది.

## జిల్లా ప్రణాళిక

వ్యవసాయం, పారిశ్రామిక ఉత్పత్తి, నీటి పారుదల, చిన్న తరహా నీటివనరులు, గ్రామీణ విద్యుదీకరణలకు సంబంధించిన రాష్ట్ర శాఖాధిపతులు, బడ్జెటు కేటాయింపులు జరిగిన 15 రోజులలోగా, ఆ సంవత్సరం ఆయా జిల్లాలలో అమలు జరపాల్సిన ప్రణాళికా పథకాలు, ప్రణాళికేతర పథకాల వివరాల జాబితాను, సంబంధిత జిల్లా కలెక్టర్లకు పంపాలి. అదే విధంగా జిల్లా శాఖాధిపతులు, బడ్జెటు కేటాయింపు అవసరంలేని జిల్లాలో లభించే అభివృద్ధి వనరుల వినియోగానికి సంబంధించిన ప్రతిపాదనలను కలెక్టరుకు అందజేయాలి. పంచాయితీ సమితులు తమ నిధులతో నిర్వహించే వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తికి సంబంధించిన పథకాలను కలెక్టరుకు సమర్పిస్తారు. ఆ తర్వాత జిల్లా బోర్డు సమావేశం జరుగుతుంది. సంబంధిత జిల్లా శాఖాధిపతులను కూడ యీ సమావేశానికి ఆహ్వానిస్తారు. ప్రతి పథకానికి సంబంధించిన ఉత్పత్తి శక్తిని యీ బోర్డు పరిశీలించి సంవత్సరంలో యీ పథకాల క్రింద సాధించాల్సిన ఉత్పత్తి లక్ష్యాలను నిర్ణయిస్తుంది. ఈ విధంగా వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తికి జిల్లా ప్రణాళిక ముసాయిదాను జిల్లా బోర్డు రూపొందిస్తుంది. అవసరమైతే ఒకే శాఖక్రింది బడ్జెటు కేటాయింపులను పునర్వ్యవస్థీకరించే అధికారాలనుకూడ యీ బోర్డు నిర్వహిస్తుంది. ఈ ముసాయిదా ప్రణాళికను ఆమోదం నిమిత్తం జిల్లా పరిషత్తుకు బోర్డు సమర్పిస్తుంది.

ఇకనుండి ప్రతిశాఖ ఆర్థిక అభివృద్ధి నిమిత్తం రూపొందించే కొత్త పథకాలలో వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తులకు సంబంధించిన అదనపు ఉత్పత్తి అంచనాలు, పథకం నిర్వహణ కాలపరిమితి, ఆశించిన అదనపు ఉత్పత్తి అంచనాల సాధన కాల పరిమితికి సంబంధించిన వివరాలను పొందుపర్చాలి. ఇటువంటి ప్రతి పథకాన్ని జిల్లా అభివృద్ధి బోర్డు పరిశీలించి అమలుజరిపే బాధ్యతను స్వీకరించినప్పుడుమాత్రమే పథకానికి మంజూరీ లభిస్తుంది.

## ప్రణాళిక అమలు

జిల్లా ప్రణాళికను అమలు జరిపి, దానిలో నిర్దేశించిన లక్ష్యాలను సాధించే బాధ్యత యీ బోర్డుపై ఉంటుంది. డివిజినల్ అధికారులు, జిల్లా అధికారులు, సమర్పించిన తనిఖీ నివేదికలను పరిశీలించి, జిల్లా ప్రణాళిక అమలు తీరును సమీక్షించడానికి యీ బోర్డు నెలకు ఒకసారిగానీ, అవసరమైనప్పుడల్లాగానీ సమావేశమౌతుంది. ప్రణాళిక అమలులో పురోభివృద్ధిని గూర్చిన త్రైమాసిక నివేదికను యీ బోర్డు, రాష్ట్ర అభివృద్ధిమండలికి సమర్పిస్తుంది. సంబంధిత అంశాల ప్రతులను ఆయా శాఖాధిపతులకు పంపుతారు. అంతేగాక జిల్లా పరిషత్తుకు కూడ యీ రిపోర్టును పంపుతారు. సంవత్సరం ఆఖరుకు సాధించిన ఆర్థిక పురోభివృద్ధి, జరిగిన లోపాలను వాటి కారణాలను గూర్చి నివేదికను రాష్ట్ర మండలికి సమర్పిస్తారు. ప్రతిజిల్లాలో సాధించిన ఆర్థిక అభివృద్ధిని సమీక్షిస్తూ రాష్ట్ర మండలి ప్రభుత్వానికి వార్షిక నివేదికను సమర్పిస్తుంది.

## పరిషత్తు, సమితి స్థాయి

జిల్లా పరిషత్తులు, పంచాయితీ సమితులు నిర్వహించే వివిధ కార్యక్రమాలలో విద్య, రవాణా, వైద్య సౌకర్యాలు, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు తమ నిధులనుండే బడ్జెటును కేటాయిస్తాయి. ఈ అంశాలు జిల్లా అభివృద్ధి బోర్డు పరిధిలో లేవు. వ్యవసాయం, పారిశ్రామిక ఉత్పత్తులకు సంబంధించిన పథకాలు మాత్రమే జిల్లా బోర్డు అధికార పరిధిలో ఉన్నాయి. జిల్లా ప్రణాళికలో చేర్చబడిన, తమ అధికార పరిధిలోని కార్యక్రమాలను, పథకాలను జిల్లా పరిషత్తులూ, పంచాయతీ సమితులే అమలు జరుపుతాయి.

## పరిపాలనా విషయిక మార్పులు

సమీకృత జిల్లా ప్రణాళికలను పటిష్ఠవంతంగా అమలు పరిచే వుద్దేశంతో జిల్లా స్థాయిలో యీ దిగువ శాఖలను యీ ఉత్తర్వుల పరిధిక్రిందకు తీసుకొనిరావడం జరిగింది.

1. వ్యవసాయ శాఖ.
2. నీటి పారుదల శాఖ.
3. సహకార శాఖ.
4. పంచాయతీరాజ్ శాఖ.
5. పరిశ్రమల శాఖ.

ఒక్క నీటి పారుదలకు మినహా మిగిలిన పై శాఖలన్నిటికీ జిల్లా స్థాయిలో కలెక్టరు ఆధిపత్యం వహిస్తారు. ఈ పునర్వ్యవస్థీకృత పద్ధతిలో కలెక్టరు తమ బాధ్యతలను నిర్వర్తించడానికి వీలుగా 20-5-1967 నాటి నివేదికలో ఈ కమిటీ కొన్ని సిఫారసులను చేసింది. దీని ప్రకారం కలెక్టర్లకు (1) ఆర్థిక పరమైన, తదితర అధికారాలు (2) జిల్లా స్థాయిలో శాఖల పునర్వ్యవస్థీకరణ అధికారాలు సంక్రమిస్తాయి. ఈ ప్రతిపాదనలను ప్రభుత్వం ఆమోదించింది. జిల్లా స్థాయిలో పై శాఖలకు సంబంధించి పరిపాలనా వ్యవస్థ స్వరూపం యీ దిగువ పేర్కొన్న విధంగా వుంటుంది.—

### (అ) సహకార శాఖ

ప్రతి జిల్లాకు రూ. 600-50-1000 స్కేలుపై ప్రత్యేక డిప్యూటీ రిజిస్ట్రారు పోస్టు అదనంగా మంజూరైంది. ఆయనపై పరిపాలనాధికారాలన్నీ కలెక్టరుకు వుంటాయి. కలెక్టరు పి. ఎ. గా ఆయన వ్యవహరిస్తారు. ఈ ప్రత్యేక డిప్యూటీ రిజిస్ట్రారులను ఏర్పాటుచేసిన తేదీనుంచి ప్రాంతీయ సంయుక్త రిజిస్ట్రార్ల పోస్టులు రద్దవుతాయి.

### (ఆ) వ్యవసాయ శాఖ

ప్రతి జిల్లాకు ఒక డిప్యూటీ డైరెక్టరు వుంటారు. ప్రస్తుతం యీ శాఖక్రింద 11 మంది డిప్యూటీ డైరెక్టర్లు వున్నారు. అందువల్ల జిల్లాకు ఒక్కొక్కరి చొప్పున ఏర్పాటు చేయడానికై అదనంగా మరొక 9 డిప్యూటీ డైరెక్టర్ల పోస్టులు మంజూరైనాయి. ఈయన కూడా కలెక్టరు పి. ఎ. గా వ్యవహరిస్తారు. ఈ పద్దుకు అయ్యే ఖర్చును ఐ. ఎ. ఎ. పి; ఐ. ఎ. డి. పి. పథకాలక్రింద మిగిల్చిన సొమ్మునుంచి ఖర్చుపెడతారు.

### (ఇ) పరిశ్రమల శాఖ

ప్రస్తుతం ప్రతి జిల్లాలోనూ పనిచేస్తున్న ఈ శాఖ అసిస్టెంటు డైరెక్టర్లు యిప్పుడు కలెక్టరు పరిపాలనాధికారాల పరిధి క్రిందకు వస్తారు. పరిశ్రమలశాఖకు సంబంధించిన ప్రాంతీయ జాయింట్ డైరెక్టర్ల కార్యాలయాలు రద్దవుతాయి. ఈ జాయింట్ డైరెక్టర్లు పరిశ్రమలశాఖ డైరెక్టరేటుకు బదలీఅవుతారు.

### (ఈ) నీటి పారుదల శాఖ

నీటి పారుదలకు సంబంధించిన ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, కలెక్టరు కంట్రోలులో వుంటారు. (ఎ) జిల్లా ప్రణాళికలో పేర్కొన్న వాటితో సహా అనుమతించబడిన పనులను అమలు పరచడంలోనూ (బి) ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు అధికార పరిధిలోవుంది. ప్రస్తుతం వున్న ఉత్తర్వుల ప్రకారం కలెక్టరు అనుమతి అవసరమైన పనులను అమలుపరచడంలోనూ ఈ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు కలెక్టరు పరిపాలనాధికారం క్రిందకు వస్తారు.

### (ఉ) ఇతర శాఖలు

జిల్లా ప్రణాళికలో చేర్చబడిన పథకాలను అమలుపరిచే విషయంలో ఎప్పటికప్పుడు కలెక్టరు యిచ్చే ఆదేశాలను మిగిలిన జిల్లా అధికార్లు అమలుపరుస్తుంటారు:

### (ఊ) జిల్లాలలో రెవెన్యూ పరిపాలన

కలెక్టరు యితర అభివృద్ధి పనులకు పూర్తిగా అంకితమై పనిచేయడానికి వీలుగా రెవెన్యూ, పౌర సరఫరాల పనులనుండి ఆయనకు వత్తిడిని కొంత తొలగించాలన్న ఎం. టి. రాజు కమిటీ సిఫారసులను ప్రభుత్వం అంగీకరించి ప్రతి జిల్లాకు ఒక జిల్లా రెవెన్యూ అధికారి పోస్టును మంజూరు చేసింది. కలెక్టరు పరిపాలనాధికార పరిధి క్రింద యీయన పనిచేస్తారు.

### (ఋ) డివిజన్ స్థాయి

బ్లాకులకు సంబంధించినంత వరకు జిల్లా ప్రణాళిక సమర్థవంతంగా అమలుపరిచే విషయంలో రెవెన్యూ డివిజనల్ అధికారి అజమాయిషీ వహిస్తారు. తరచు ఈయన క్షేత్ర పరిశీలనలు జరుపుతుంటారు. అక్కడి లోపాలను గుర్తించి వాటి నివారణకు తగు చర్యల్ని తీసుకుంటారు. తన అధికార పరిధిలోని బ్లాకుల సిబ్బంది సమావేశాల్లోనూ, పంచాయతీ సమితుల సమావేశాల్లోనూ పాల్గొంటారు. జిల్లా అధికారులు తమ పథకాలకు సంబంధించిన క్షేత్ర పరిశీలనల నివేదికలను ఎప్పటికప్పుడు ఈ రెవెన్యూ డివిజనల్ అధికారికి పంపిస్తుంటారు.

### రాష్ట్రస్థాయి

రాష్ట్రస్థాయిలో ఒక అభివృద్ధిమండలి వుంటుంది. అందులో—

ప్రధానకార్యదర్శి, అభివృద్ధి కమీషనరు – అధ్యక్షుడుగా వుంటారు. నీటి పారుదల, ఆయకట్టు అభివృద్ధికి సంబంధించిన రెవెన్యూబోర్డు సభ్యులు; పబ్లిక్‌వర్క్సుశాఖ ప్రత్యేక కార్యదర్శి; ఆహార, వ్యవసాయశాఖ ప్రత్యేక కార్యదర్శి; పరిశ్రమలశాఖ కార్యదర్శి; ఆర్థికశాఖ కార్యదర్శి; వ్యవసాయశాఖ డైరెక్టరు; సహకార సంఘాల రిజిస్ట్రారు; పరిశ్రమలశాఖ డైరెక్టరు; చీఫ్ ఇంజనీరు (జనరల్)—సభ్యులుగా వ్యవహరిస్తారు. ప్రణాళికశాఖ సంయుక్త కార్యదర్శి మెంబర్ సెక్రటరీగా వ్యవహరిస్తారు.

జిల్లా ప్రణాళికలు సక్రమంగా అమలు జరిగేటట్టు చూడవలసిన బాధ్యత ఈ మండలిది. వివిధ జిల్లాల ప్రణాళికల్ని కూడా యిది సమీక్షిస్తుంది. సభ్యులు జిల్లాలలో పర్యటిస్తుంటారు. ఆయాప్రాంతాలలో యీ మండలి తరచు సమావేశమౌతూ వుంటుంది.

ఈ మండలి కేవలం ప్రణాళికకు సంబంధించిన పథకాలనేగాక వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తులకు సంబంధించిన ప్రణాళికేతర పథకాలను గూడ అమలు జరుపుతుంది.

### జనసంబంధ శాఖ

పౌరసంబంధ, సమాచారశాఖను 1967 నవంబరు 1వ తేదీ నుంచి 'జనసంబంధ శాఖ'గా మార్చినట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఈ పేరుకు ఇంగ్లీషు అనువాదం వుండదనీ, అవసరమైనప్పుడు రోమన్ స్క్రిప్టులో వ్రాయడం జరుగుతుందని కూడా ప్రభుత్వం తెలియజేసింది.

### శ్రామికశాఖ

ప్రస్తుతపు 'కార్మికశాఖ' ను 'శ్రామికశాఖ' గా 1967 నవంబరు 1 నుంచి మార్చినట్లు ప్రభుత్వం ప్రకటించింది. కొంతకాలం పాటు ఈ పేరుతోసహా ఇంగ్లీషులో పేరునుకూడా బ్రాకెట్‌లలో వ్రాయడం జరుగుతుంది.

### పారిశ్రామిక ఉపాధిచట్టం

ఆంధ్రప్రదేశ్‌లో 1946 సం. పు పారిశ్రామిక ఉపాధిచట్టం లోని సెక్షన్ 2 (ఇ) అమలు విషయంలో ప్రభుత్వం ప్రకటించిన యితర సంస్థలకు కూడా వర్తించేందుకు అవకాశాన్ని కల్పిస్తూ దానిని సవరించడానికి మంత్రిమండలి అంగీకరించింది.

---

## శాసనపర్వం

# మద్యనిషేధాన్ని కఠినంగా అమలుపరచడానికి శాసన చర్య

వి. శేషాద్రి

1967 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) మద్యనిషేధ (సవరణ) బిల్లు (ఆంధ్రప్రదేశ్ అసాధారణ గెజెటు 1967 జూన్ 17 వ తేదీ సంచికలో మొదటి పుట నుంచి 9వ పుట వరకు ఇది ప్రచురించబడింది) లో పొందుపరిచిన వివిధ చర్యల ద్వారా మద్యనిషేధాన్ని కఠినంగా అమలుపరచడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించుకున్నది. మద్యనిషేధ శాసనం ఆంధ్ర ప్రాంతంలో గత 30 సంవత్సరాల నుంచి అమలులోవుంది. దీనిని కొనసాగించడం సమర్థనీయమైనట్లు ఇది వెల్లడిస్తున్నది. ఈ శాసనం తరచుగా ఉల్లంఘించబడుతున్నదనడం దీని రద్దుకు కారణం కాజాలదు. ఏ శాసనమైనా అది తరచుగా ఉల్లంఘించ బడుతున్నంత మాత్రాననే నిష్ప్రయోజనమైనది కాదు. కఠినంగా శిక్షలు విధించడం వల్ల, శాసనాన్ని ఫలప్రదంగా అమలుపరచడానికి వీలుఅవుతుందనవచ్చు. సారాయి, లేక మరేదైనా మత్తుపదార్థాన్ని తయారుచేయడం, వాటిని తయారు చేసేందుకు ఉపయోగించే పదార్థాలను, పరికరాలను మొదలైన వాటిని కలిగివుండడానికి సంబంధించిన నేరానికి *రెండు సంవత్సరాలకు తగ్గకుండా, అయిదు సంవత్సరాలకు మించకుండా కఠినఖైదు శిక్షనూ, అయిదు వేల రూపాయలకు హెచ్చుకుండా జరిమానానూ* విధించడానికి ప్రభుత్వ చర్య ఉద్దేశిస్తున్నది. ప్రస్తుతం అమలులోవున్న చట్టం క్రింద ఈ నేరానికి జరిమానాతోసహాకాని, లేక జరిమానాలేకుండాకానీ రెండు సంవత్సరాలవరకు ఖైదు శిక్ష విధించవచ్చు. ఇప్పుడిది హెచ్చించ బడింది.

1937 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంతం) మద్యనిషేధ చట్టం 5, 7, 16, 24 వ సెక్షన్ల క్రింద నేరస్థులైన వారిని కఠినంగా శిక్షించడాన్ని ప్రభుత్వ చర్య ఉద్దేశిస్తున్నది. సెక్షను 4, లేక సెక్షను 4-ఏ లోని (1) వ సబ్ సెక్షను క్రింద గల (ఏ), (బి), (ఇ), (ఙ), లేక (ఎక్స్) క్లాజు క్రిందికి వచ్చే ఏదైనా నేరాన్ని చేసిన, లేదా అట్టి నేరం చేసినట్లు సహేతుకంగా అనుమానించదగిన ఏ వ్యక్తి దగ్గిరనుండైనా రెండు వందల రూపాయలకు మించకుండా డబ్బు స్వీకరించడానికై జిల్లా మద్య నిషేధశాఖ అధికార్లకు అధికారాలు సంక్రమింప జేయడానికి కూడా యిది అవకాశం కలిగిస్తున్నది. అయితే వారు అసిస్టెంట్ ప్రొహిబిషన్ అధికార్ల సిఫార్సు ననుసరించి చర్యతీసుకొనవలసి వుంటుంది. డబ్బుముట్టిన తరువాత నిందితుడు నిర్బంధంలో వున్నట్లయితే అతనిని విడుదల చేస్తారు. సారాయి, మత్తుపదార్థం, లేక కల్లు మినహా పట్టుబడిన ఇతర ఆస్తులను కూడా వాటి విలువను చెల్లించిన పిమ్మట ఇచ్చి వేయవచ్చు. ఆ ఆస్తివిలువను జిల్లా మద్య నిషేధ శాఖాధికారి అంచనా వేస్తారు.

ఈ బిల్లులోని 18_బి సెక్షను, కల్లు గీతకు ఉపయోగించే తాటి చెట్లపైన ఎక్సైజు పన్నును హెచ్చించడాన్ని ఉద్దేశిస్తున్నది. రాష్ట్ర ఆదాయాన్ని పెంచే ఉద్దేశంతో తీసుకునే చర్య ఇది. ప్రస్తుతం అమలులో వున్న పన్ను రేట్లు, బిల్లులో నిర్దేశించిన రేట్లు దిగువ పట్టికలో పేర్కొనబడినాయి :—

| కల్లుగీతకు ఉపయోగించే తాటి చెట్ల రకాలు | ప్రస్తుతం వర్తింపులో వున్న లైసెన్సుఫీజు లేక చెట్టు పన్ను (సంవత్సరానికి) | పన్ను గరిష్ఠ హెచ్చింపు (సంవత్సరానికి) |
|---|---|---|
| 1. ఈత చెట్టు | చెట్టుకు రు. 6.52 | చెట్టుకు రు. 10 |
| 2. తాటి చెట్టు | రు. 7.76 | రు. 12 |
| 3. కొబ్బరి చెట్టు | రు. 11.64 | రు. 15 |
| 4. పగు చెటు | రు. 15.56 | రు. 18 |

ఈ హెచ్చింపు ప్రస్తుత రేటులో 50 శాతం మొదలు 60 శాతం వరకు వుంది. అయితే ఈ హెచ్చింపు రేటు గరిష్ఠమైనదిగా మాత్రమే పేర్కొనబడిందనీ, దీనిలో ఏరేటునైనా ప్రభుత్వం అనుసరించ వచ్చునని బిల్లు నిబంధనను బట్టి స్పష్టమవుతున్నది. కొత్త సెక్షను 18_బి క్రింద పన్ను విధించబడిన సందర్భంలో గీతకు ఉపయోగించే చెట్టు యజమాని, లేక ఆ చెట్టుపై అధ్వర్యం వహిస్తున్న వ్యక్తి నిర్ణీత గడువులోపుగా తన అయిష్టతను తెలియ జేయవచ్చు. అటువంటి పరిస్థితిలో నిర్దేశించబడిన గడువు వరకు నిర్దేశించిన విధంగా సెక్షను 19, లేక సెక్షను 19_ఏ క్రింద లైసెన్సు దారునుంచి పన్ను వసూలు చేయబడుతుంది, లేక చెల్లింప బడుతుంది. క్రొత్తగా రూపొందించిన సెక్షను 18_డి, లైసెన్సు లేకుండా చెట్లు గీయడానికి సంబంధించినది. చెల్లించవలసిన పన్నును ప్రధానంగా చెట్టుగీసిన వ్యక్తినుంచి, లేక అందుకు కారకుడైన వ్యక్తినుంచి రాబట్టడాన్ని ఈ సెక్షను నిర్దేశిస్తున్నది. ఈ విధంగా పన్ను చెల్లింపు జరగని పక్షంలో ఆ మొత్తాన్ని చెట్ల యజమాని నుంచి, లేక వాటిపై అధ్వర్యం వహిస్తున్న వ్యక్తినుంచి రాబట్టాలి. ఈ బిల్లులోని సెక్షను 18_ఇ ననుసరించి, లైసెన్సు మంజూరైన సందర్భంలో చెట్లయజమానికి లేక వాటి ఆక్రమణదారుకు నియమావళి క్రింద ఎప్పటికప్పుడు [illegible] నిర్ణయించబడే మొత్తాన్ని అద్దె క్రింద పొందడానికి [illegible] వుంటుంది. అయితే ఈ మొత్తం, చెల్లించవల[illegible] పన్నుకు 25 శాతానికి మించ కూడదు.

డిస్టిలరీలను, గిడ్డంగులను స్థాపించ[illegible] ప్రభుత్వానికి అధికారం ఇచ్చే సెక్షను 15_బి క్రొ[illegible] బిల్లులో పొందుపరచబడింది.

ఈ బిల్లులో పాతదాని స్థానే క్రొత్త సబ్ సెక్షను (2) చేర్చబడింది. సబ్ సెక్షను (3) నూత్నంగా ప్రవేశపెట్టబడింది. పూర్వపు నిబంధనల ననుసరించి ఎట్టి కారణం చూపకుండానే లైసెన్సును రద్దు చేయడానికిగానీ, నిలుపు చేయడానికిగానీ కార్యనిర్వహణాధికారికి అధికారం వుంది. శ్రీ నాగేశ్వరరావుకూ, మద్రాసు ప్రభుత్వానికీ మధ్య జరిగిన వ్యాజ్యం (ఏ. ఐ. ఆర్. 1954 మద్రాసు పుట 643)లో ఇది చెల్లదని కొట్టివేయబడింది. కార్యనిర్వహణాధికారికి ఈ అధికారం స్వేచ్ఛాయుతమైన విచక్షణాధికారాన్ని సంక్రమింప జేస్తున్నదనీ, రాజ్యాంగంలో హామీ ఇచ్చిన ప్రాథమిక హక్కులకు ఇది భంగకరమైనదనీ ఈ సందర్భంలో న్యాయస్థానం అభిప్రాయపడింది. పై వ్యాజ్యంలో వెల్లడి అయిన లోపాన్ని బిల్లులోని (3)వ సబ్ సెక్షను సవరిస్తుంది. (2)వ సబ్ సెక్షనులోని (1)వ సబ్ సెక్షను క్రింద ఏదైనా లైసెన్సును లేక పర్మిటును రద్దుచేయడానికి, లేదా నిలుపు చేయడానికి పూర్వం లైసెన్సుదారుకు, లేక పర్మిటుదారుకు సముచితమైన గడువు లోపుగా *తన అభ్యంతరాలను తెలుపుకోవడానికి అవకాశం ఇవ్వాలని* ఇది నిర్దేశిస్తున్నది. ఈ విధంగా అనుమతించే గడువు సాధారణంగా 14 రోజులకు మించకూడదనీ, అతను విన్నవించుకునే విషయాలను అంతిమంగా ఉత్తర్వులు జారీ చేయడానికి పూర్వం పరిశీలించాలని కూడా పై సబ్ సెక్షను నిర్దేశిస్తున్నది.

కల్లు, తీపికల్లు గీతకూ, లైసెన్సు ఫీజు, పన్నుల విధింపుకు వసూళ్ళకూ సంబంధించిన కొన్ని నిబంధనలను చట్టబద్ధం చేయడానికి తగిన అవకాశాన్ని కూడా ప్రభుత్వ చర్య కలిగిస్తున్నది.

1898వ సంవత్సరపు క్రిమినల్ ప్రొసీజర్ [illegible] సెక్షను క్రింద సంక్రమింపజేసిన అధికా[illegible] రూపొంది[illegible] శిక్షలను విధించడానికి వీలుగా [illegible]నలు విధించడం [illegible] ప్రస్తుతపు 53వ సెక్షను స్థా[illegible] చాలని సెలక్టు కమిటీ సి[illegible] [illegible]త్తున దం[illegible]

నేరస్థులకు [illegible]ంగా అమలు పరచడమే ప్రభుత్వ చర్యల మద్యనిషేధా[illegible] ఎక్సైజు, మద్యనిషేధశాఖల మంత్రి శ్రీ వి. ప్రధా[illegible]యణరావు, ప్రభుత్వ విధానాన్ని పునరుద్ఘాటించారు. "మద్యనిషేధాన్ని రద్దు చేయడానికి ప్రభుత్వం సుముఖంగా లేదు. అంతే కాకుండా ప్రజల సహకారంతో ప్రభుత్వం దీనిని కఠినంగా అమలు పరుస్తుంది" అని ఆయన అన్నారు. 'ఆర్థిక ఇబ్బందులు' వున్న ఈ గడ్డు రోజులలో కూడా మద్యనిషేధాన్ని కఠినంగా అమలుపరిచే విధానానికే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కట్టుబడి వున్నదని చెప్పవచ్చు. అనేక రాష్ట్రాలు మద్యనిషేధాన్ని రద్దు పరచడానికి నిశ్చయించగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 47వ రాజ్యాంగ సూత్రంలోని ఈ రాజ్యాంగ బద్ధమైన అంశాన్ని—అంటే ప్రభుత్వ విధానాలకు సంబంధించిన ఆదేశిక సూత్రాన్ని—పాటించడానికి నిర్ణయించడం హర్షించదగిన విషయం. రాజ్యాంగంలో పొందుపరిచిన పవిత్రమైన సూత్రాన్ని పాటించడానికి నిశ్చయించుకున్నందుకుగాను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి రాష్ట్ర ప్రజలు కృతజ్ఞులై వుండగలరు.

# న్యాయపాలన

## సహకార సంఘాల రిజిష్ట్రారు

'ట్రిబ్యునల్ 'ను 'కోర్టు' గా పరిగణించడానికి ముఖ్యంగా మూడు విషయాలు అవసరం. మొదటిది_అది, "సివిల్ వివాదం" స్వభావం కలిగిన వివాదాన్ని పరిష్కరించాలి. రెండవది_ఈ పరిష్కారం 'జుడీషియల్ పద్ధతి" ననుసరించి జరగాలి. చివరిది_ అది ఇచ్చేతీర్పు విధిగా అమలుజరుగునదిగా వుండాలి.

1964వ సం.పు ఆంధ్రప్రదేశ్ సహకార సంఘాలచట్టం 61వ సెక్షను ప్రకారం, సంఘం మేనేజిమెంటు తదితర విషయాలకు సంబంధించిన వివాదాన్ని పరిష్కారానికై రాష్ట్ర సహకార సంఘాల రిజిష్ట్రారుకు నివేదించాలి. 62వ సెక్షను ననుసరించి అతను ఈ వివాదాన్ని స్వయంగా పరిష్కరించవచ్చు. లేక ఈ విషయంలో ప్రభుత్వంచే అధికారం సంక్రమింపజేయబడిన మరెవరైనా వ్యక్తికి బదిలీచేయవచ్చు. లేకపోతే మధ్యవర్తికి నివేదించవచ్చు. ఇలాటి వివాదాలను రిజిస్ట్రారు లేక మరెవరైనా సంబంధిత అధికారి పరిష్కరించాలన్న ప్రత్యేక నిబంధన చట్టంలో లేకపోయినట్లయితే, సివిల్ కోర్టులు సాధారణ పద్ధతిలో పరిష్కరించి ఉండేవి. కనుక ఈ " వివాదాలు " "సివిల్ వివాదాలు" అన్న నిర్వచనం క్రిందికి వస్తాయి.

120వ సెక్షను మేరకు, రిజిస్ట్రారు ఈ వివాదాలను పరిష్కరిస్తున్న సందర్భంలో " 1908వ సం. పు సివిల్ ప్రొసీజర్‌కోడ్ క్రింద కేసును విచారిస్తున్నప్పుడు సివిల్‌కోర్టుకు వుండేటటువంటి అధికారాలను " దిగువ తెలిపిన అంశాల విషయంలో కలిగి వుంటారు :— (1) ఏ [illegible] వ్యక్తినైనా పిలిపించడం, [illegible] ఏదైనా వ్యక్తి [illegible] ప్రమాణం [illegible]చి పరీక్ష చేయడం, (3) ఏదైనా [illegible] అక్కౌంటు, రికార్డు [illegible]ం, సెక్యూరిటీ లేక ఇతర ఆస్తులను చూపించడానికి [illegible]దం. (4)సాక్షిని విచారణ చేయడానికై శాకీదుచేయడం, ([illegible]ణం ఛేయించి వాఙ్మూలం తీసుకోవడం.

ఈ చట్టంక్రింద జారీచేయబడిన డిక్రీని సివిలుకోర్టు జారీ చేసిన డిక్రీవలె అమలు పరచవలసి వుంటుంది. కనుక 61వ సెక్షను వర్తించే వివాదాలను పరిష్కరించే సందర్భంలో రిజిస్ట్రారు సమక్షంలోని ప్రొసీడింగ్స్ "జుడిషియల్ ప్రొసీడింగ్స్" గానే పరిగణింపబడుతాయి.

రిజిస్ట్రారు తీర్పు సివిల్ కోర్టు డిక్రీవలె అమలు పరచదగినది. ఉభయపక్షాలూ దీనికి బద్ధులు కావల్సివుంటుంది. సెక్షను 76 క్రింద, రిజిస్ట్రారు ఉత్తర్వుకు వ్యతిరేకంగా ప్రభుత్వానికి అప్పీలు చేసుకోవచ్చు. రిజిస్ట్రారు తీర్పు బద్ధులను చేసేదిమాత్రమే గాకుండా సాధికారమైనదికూడా. కాబట్టి దానిని న్యాయస్థానపు తీర్పువలె పరిగణించాలి. *ప్రభుత్వానికి అప్పీలు చేసుకోవడానికి చట్టంక్రింద అవకాశమున్నంత మాత్రాన న్యాయస్థానంగా రిజిస్ట్రారు అధికారాల జుడీషియల్ ప్రతిపత్తికి భంగముండదు. రిజిస్ట్రారు తీర్పును ధిక్కరించడం కోర్టు ఆదేశాన్ని తిరస్కరించడమే అవుతుంది.*

సుప్రీమ్‌కోర్టు స్పష్టంగా ఇలా పేర్కొన్నది : "న్యాయస్థానాలు నిర్భయంగా, నిష్పాక్షికంగా, అభిమాన దురభిమానాలు లేకుండా తీర్పులు ఇవ్వగలగడానికై, వ్యాజ్యాలతో సంబంధం వున్నవారు, అధికారం, న్యాయ పరిపాలన అగౌరవానికి, అలక్ష్యానికి గురికానివిధంగా వ్యవహరించాలి. వారు, సులక్షణమైన విమర్శ హద్దులను మీరకూడదు. న్యాయస్థానాల సత్ప్రవర్తనను దూషిస్తూ మాటాడకూడదు. న్యాయస్థానాలు ఇచ్చే తీర్పులు మంచిచెడ్డలపై సవాళ్లు విసరకూడదు. ఇది న్యాయాధిపతి హోదాతో ప్రమేయంలేకుండా న్యాయాధీశులందరికీ, వ్యాజ్యాలతో సంబంధం వున్నవారందరికీ సమానంగా వర్తిస్తుంది."

సహకార సంఘాల విషయంలో ఆంధ్రప్రదేశ్ సహకార సంఘాల రిజిష్ట్రారు ఇచ్చిన తీర్పును తిరస్కరించడం న్యాయస్థానం నిర్ణయాన్ని ధిక్కరించడం వంటిదేనని పై విషయాలవల్ల స్పష్టపడుతున్నది.

---

## జిల్లా జనాభా లెక్కల పుస్తకాల అమ్మకం

ఆంధ్రప్రదేశ్ జనాభాలెక్కల నిర్వహణ సూపరింటెండెంట్ కార్యాలయం జిల్లా జనాభాలెక్కల పుస్తకాలను ప్రచురించింది. ఈ పుస్తకాలలో ఆయా జిల్లాలకు సంబంధించిన ముఖ్యమైన విషయాలతోపాటు 1961 సం. పు జనాభా లెక్కల పట్టికలు ప్రతిపట్టణం, గ్రామం వారీ జనాభా లెక్కలు వున్నాయి. జిల్లా తాలూకా పటాలు వీటిలోవున్నాయి. ఇప్పటికి ఈదిగువ పేర్కొన్న పుస్తకాలు తయారై హైదరాబాదులోని పబ్లికేషన్ బ్యూరోలో అమ్మకానికి సిద్ధంగా వున్నాయి.

1. శ్రీకాకుళంజిల్లా జనాభాలెక్కల పుస్తకం రూ. 11.50
2. విశాఖ రూ. 11.50
3. తూర్పు గోదావరి రూ. 12.00
4. పశ్చిమ గోదావరి రూ. 10.50
5. కృష్ణా రూ. 11.00
6. గుంటూరు రూ. 10.50
7. నెల్లూరు రూ. 11.00
8. చిత్తూరు రూ. 10.00
9. కడప రూ. 9.35
10. అనంతపురం రూ. 10.80
11. కర్నూలు రూ. 10.50
12. మహబూబ్‌నగర్ రూ. 9.25
13. మెదక్ రూ. 8.00
14. కరీంనగర్ రూ. 7.50
15. నిజామాబాద్ రూ. 8.00
16. వరంగల్లు రూ. 8.75

సీరియల్:

# తిరస్కృతి

వాసిరెడ్డి సీతాదేవి

## జరిగిన కథ

సూర్యం, అన్నయ్య పెళ్ళికని స్వగ్రామం వచ్చాడు. పెళ్ళికూతురు సరళ! చిన్నప్పుడు తనతో చనువుగా తిరిగిన సరళ, అన్నయ్యను పెళ్ళి చేసుకుంటున్నదంటే సూర్యానికి మనసంతా అదోలా వుంది. అన్నయ్య చిత్రకారుడు. సూర్యం వచ్చేసరికి అన్నయ్య ఎక్కడికో వెళ్ళాడు.

"ఏరా సూర్యం ఎప్పుడు రావడం" అప్పుడే లోపలకు వచ్చిన సత్యనారాయణ ప్రశ్నించాడు.

సూర్యం అన్నవైపు కళ్ళుపెద్దవి చేసుకొని చూశాడు. ఖద్దరు ధోవతి, ఖద్దరు లాల్చీలో ఎంతో నిండుగా హుందాగా కనిపించాడు. ఈ రెండు సంవత్సరాల్లో అన్నగారిలోవచ్చిన మార్పుని గమనించాడు. మునుపటికంటె కొంచెం వళ్ళువచ్చింది. ఇంటిపట్టున ఉండటంవల్లనే బాగా రంగుకూడా వచ్చింది. స్పష్టమైన ముఖ కవళికలు, దట్టమైన కనుబొమలు. చేతిలో స్కెచ్ గీసే స్టాండూ, కుంచెలూ- నిజమైన కళాకారునిలో ఉండవలసిన ఏదో విశిష్టత, ప్రత్యేకత ఆ నిండయిన విగ్రహంలో కొట్టవచ్చినట్లు కనిస్తాయి పదిమందిలో కూడా 'అతను ఎవరబ్బా!' అని కుతూహలం కలిగించేలా ఉన్నాడు. నిజంగా ధోవతి కట్టుకుంటే ఉండే హుందాతనం, అందం పాంటుల్లో ఎక్కడవుంది!

"ఏరా! కొత్తవాణ్ణిచూసినట్లు అలాచూస్తావు? ఎప్పుడొచ్చావు? ఇంతకాలనికారావటం? పోయిన సంవత్సరం శెలవులకు నీవు రానందువల్ల ఎంతబాధపడ్డామో తెలుసా? ఈ సంవత్సరం కూడా రాకపోతే నేనే విశాఖపట్నం వద్దామనుకున్నాను." అన్నగారి కంఠంలోని ఆప్యాయతకు సూర్యం మనస్సు సంతృప్తితో నిండిపోయింది.

"నేనువచ్చి గంటకు పైగానే అయింది."

"అన్నం తిన్నావా?"

"లేదు నీకోసమే ఎదురుచూస్తున్నాడు చిన్నబావ" అంది సరళ సత్యం చేతిలో సామగ్రిని అందుకొని గదిలో పెట్టడానికి వెళుతూ.

"ఏమిటిరా అబ్బాయి! రోజు రోజుకు మరీ చీకటిపడేదాకా ఉంటున్నావు. చెట్లల్లో పుట్టల్లో పురుగూ పుట్రా వుంటాయి. అందులో వేసవికాలం!" అంది తల్లి మందలింపుగా.

సత్యం, తల్లి మాటకు జవాబివ్వలేదు. నవ్వుకుంటూ బాత్ రూము వైపుకు వెళ్ళాడు.

"[illegible]గా సూర్యం, అన్నయ్య ధోరణి ఏమన్నా అను, [illegible] వదలడు. [illegible]. ఇప్పటికే ప్రొద్దు పోయింది. భోజనాలకు లేవండి. పొద్దున్ననగా ఎప్పుడు తిన్నావో!" అంటూ తల్లి కాంతమ్మ వంటింటి వైపు నడిచింది.

సత్యం ముఖం కడుక్కొని బయటకు వచ్చేప్పటికి సరళ చేతులో తుండు గుడ్డతో ఎదురు వచ్చింది.

రెండు సంవత్సరాలుగా హాస్టలు జీవితాన్ని గడుపుతున్న సూర్యం, తన జీవితంలో దేనికో దూరం అయినట్లు కలత చెందాడు.



"రా రా తమ్ముడూ! ఎంతకాలమయిందో మనిద్దరం కలిసి భోజనం చేసి" అంటూ సత్యంవెళ్ళి ఒకపీట మీద కూర్చున్నాడు. సూర్యం యాంత్రికంగా అన్న వెనకే వెళ్ళి రెండో పీటమీద కూర్చున్నాడు. సరళ వడ్డిస్తూంది. వంగినప్పుడల్లా పొడవాటి జడ ముందుకు

పడుతుంటే లేచి వెనక్కి వేసుకుంటూంటే సూర్యం సరళనే చూస్తున్నాడు.

"ఇవ్వాళ చిన్నబావ స్థానాన్ని పెద్దబావ తీసుకున్నట్లున్నాడు." అంది సరళ నెయ్యి వడ్డిస్తూ.

"అంటే ?" ఇద్దరూ ఒకేసారి అన్నారు.

"సత్యం బావ ఇన్ని మాటలు పది నిముషాల్లో అనటం విని ఎంతకాలం అయిందో ! సూర్యం బావ మౌనంగా ఉండటం చూస్తుంటే ఆశ్చర్యం కలుగుతుంది."

ఇద్దరూ పక్కున నవ్వారు.

"అమ్మా ! నాన్నగారు భోజనం చేశారా ?" సత్యం ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న తను వెయ్యలేక పోయినందుకు సూర్యం కొంచెం బాధపడ్డాడు.

"లేదురా బాబు ! నువ్వటు వెళ్ళగానే పొలంనుంచివచ్చిన పుల్లావు ముట్టె నేలవేసి నురగలు కక్కుతూ పడిపోయింది"

"కళ్ళు ఎంతబాధగా పెట్టిందో తెలుసా బావా ! నువ్వయితే అసలు చూడలేక లోపలకువచ్చి కూర్చునేవాడివి." గలగల మాట్లాడింది సరళ.

"అరే ! మరి చెప్పలేదేం ఇంతసేపూ ? ఇప్పుడెలా వుంది ?"

"పరవాలేదు. ఆ వీధి వెంకట్రామయ్యగారు వచ్చి ఏదో పసరు ముక్కుల్లో పిండాడు పదిహేను నిముషాల్లోనే బాధ చాల వరకు తగ్గింది" అంది తల్లి.

"పురుగేదైనా కుట్టివుంటుంది. నాలుగురోజులపాటు దాన్ని ఇంటి దగ్గరే కట్టేసి వుంచండి." అన్నాడు సత్యనారాయణ.

ఈ సంభాషణ సూర్యానికి విసుగనిపించింది. పశువుకు జబ్బుచేసిందట ! ఎంత శ్రద్ధగా మాట్లాడుకుంటున్నారో ! ఇంట్లో పిల్లవాడికి జబ్బుచేసినట్లే మాట్లాడుకుంటున్నారు ! తనవల్లకాదు బాబూ ఇలా బ్రతకడం.

ఇంకా వాళ్ళు ఆ ఆవునుగురించే మాట్లాడుకోవడం సూర్యానికి విసుగనిపించింది. అన్నం గబగబా తినసాగాడు.

"అయ్యో అదేమిటిరా అబ్బాయి ! పులుసు వేసుకోకుండానే మజ్జిగ వేసుకున్నావ్ ? ఏమి తింటావో ఏమిటో ! ఆ హాస్టల్లో మెతుకులు వంటబడితేగా ! ఎంతచిక్కిపోయావో, చూస్తూంటే కడుపు తరుక్కుపోతుంది"

తల్లి ఆప్యాయతకు సూర్యంలోని అంతకుముందు కలిగిన విసుగు అంతరించింది.

"అన్నయ్యా ! నీకు ఈ పల్లెటూర్లో ఏం తోస్తుందో నాకు అర్థం కావటంలేదు. కళాకారుడివికదా ? రోజూచూసే ఆ సూర్యోదయం, సూర్యాస్తమయం, అవే స్థలాలు, అవే పొలాలు నీ కళా హృదయంలో ఏం క్రొత్త అనుభూతుల్ని, అనుభవాల్ని కలిగిస్తాయో నాకు ఆశ్చర్యంగావుంది" అన్నాడు సూర్యం. సత్యం చిరునవ్వుతోనే సమాధానం ఇచ్చాడు అన్న జవాబు ఇవ్వనందుకు సూర్యం వళ్ళుమండింది.

"హాయిగా ఏదో ఒక బస్తీలో సెటిల్ అయితే నీ కళకు ఎంతో ప్రేరణా, సార్థకతా లభిస్తాయి"

అంతవరకూ మౌనంగా కూర్చున్న సరళ చురచురలాడుతూ చూసింది సూర్యం ముఖంలోకి.

"చూసే కళ్లూ, ఆనందించే కళాహృదయం ఉండాలే కాని ప్రకృతిలో నిత్యం నూతన సౌందర్యాల్ని తరచి చూడవచ్చును."

సూర్యం, సరళ ముఖంలోకి వింతగా చూశాడు. సరళ ఇంత పెద్ద విషయాలుకూడా మాట్లాడగలదని తను అనుకోలేదు.

"ఓహో సరళాదేవిగారికి చాలా పెద్దమాటలే వచ్చునే. అంతా బావగారినుంచి సంపాదించిన విజ్ఞానమేనా ?" తమాషాగానే అనాలనుకున్నాడు. కాని స్వరంలో కొంచెం హేళన తెలియకుండానే ప్రవేశించింది.

"పెద్ద ! బస్తీల్లో చదివే వాళ్లకే అన్ని విషయాలు తెలియాలి కాబోలు ! బావదగ్గర నేను చాలా విషయాలు నేర్చుకున్నాను. ఇంగ్లీషు కూడా నేర్చుకుంటున్నాను తెలుసా ?" గబగబా రోషంగా అనేసింది సరళ.

"ఏం ! తమ్ముడూ ! ఏం చదవాలనుకుంటున్నావు ?" అడిగాడు సత్యం మాటల ధోరణిని మరోవైపుకు మరలించటానికి ప్రయత్నిస్తూ.

"మెడిసిన్ చదవాలని వుంది. మరి, నాన్నగారు ఏమంటారో ?" నసిగాడు సూర్యం.

సత్యం ఆలోచనలో పడ్డాడు.

"అంటే ఏమిటిరా సూర్యం, నాకు తెలవకడుగుతాను ! షావుకారు భద్రయ్యగారి అబ్బాయి చదివేదేనా ?"

కాంతమ్మ కుతూహలంగా అడిగింది. షావుకారు భద్రయ్యగారి అబ్బాయి చదివే చదువే తనకొడుకూ చదువుతాడనే భావం కాంతమ్మ మనస్సును గర్వంతో నింపింది.

"కాదత్తయ్యా ! మెడిసిన్ అంటే డాక్టరు ! చిన్నబావ డాక్టరు చదువుతాడట ! భద్రయ్యగారి అబ్బాయి చదివేది ఇంజనీరింగు కోర్సు !" అంది సరళ ఉత్సాహంగా.

"డాక్టరు చదువుతావా ? నిజంగానే ? మాబాబునే ? నిన్ను డాక్టరయితే చూడాలని నాకు ఎప్పటినుంచో కోరికరా నాయనా !" కళ్లముందు సూర్యం మెడలో స్టెతస్కోపుతో, [illegible]

విద్యున్నట్లు ఊహించుకుని ఉక్కిరి బిక్కిరి అయింది కాంతమ్మ సంతోషం పట్టలేక.

"అది సరేనమ్మా! నాన్న ఒప్పుకోవాలిగా?" అనుమానంగా అన్నాడు సూర్యం.

"నాన్న తప్పక ఒప్పుకుంటారు. నువ్వేం బెంగ పెట్టుకోకు తమ్ముడూ! ఎందుకయినా మంచిది రెండుమూడు యూనివర్సిటీస్‌కు అప్లయి చెయ్యి" అన్నాడు సత్యం తమ్ముడికి ధైర్యం చెబుతూ.

"ఏమో అన్నయ్యా! నాన్న ఒప్పుకుంటారని నాకు నమ్మకం లేదు; ఇప్పటికే ఆస్తంతా నా చదువుకే తగలేస్తున్నట్లు సాధిస్తూ ఉత్తరాలు రాస్తున్నారు?" విషాదంగా అన్నాడు సూర్యం

'మరీ చిన్న పిల్లవాడిలా మాట్లాడతావేంరా సూర్యం నాన్నగారికి నువ్వు చదువుకోవటం ఇష్టం ఉండదా? డబ్బు దుబారాగా ఖర్చు చేయవద్దని ఆయన ఉద్దేశం కాని ..."

"చూశావా అమ్మా నేను డబ్బు దుబారా చేస్తున్నానట!",

"మీ నాన్నగారిది మరీ కాపీనతనం. బస్తీల్లో చదివే వాళ్ళకు ఎన్నిఖర్చులుంటయ్! పదిమందిలో దర్జాగా ఉండొద్దూ!"

"ఏమిటేవ్ దర్జాల గురించి మాటాడుతున్నావ్? నీ చిన్న కొడుకు దర్జా గురించేనా?" అన్నాడు తండ్రి లోపలకు వస్తూ.

'అవును కానీ మీకు ఒదేం బుద్ధంటా! బస్తీలో ఉండే వాడికి ఎన్ని ఖర్చులుంటాయి? సాధిస్తూ ఉత్తరాలు రాస్తావటగదూ! బిడ్డ ఎంత బాధపడుతున్నాడో! నీ లేకి బుద్ధి పోదుగదా!" సాగదీసింది కాంతమ్మ.

"మహా చెప్పొచ్చావులే. లేకిబుద్ధట లేకిబుద్ధి. ఆ లేకి బుద్ధే లేకపోతే నీ కొడుకు బస్తీలో చదివేవాడా? రెండెకరాల మాగాణిని రెక్కల కష్టంమీద పది ఎకరాలు చేశాను. దొరగారి ఇంత పెద్ద చదువుకోసం ఇప్పటికప్పుడే అరెకరం అమ్మాల్సి వచ్చింది" చంద్రయ్య అన్నాడు విసురుగా.

సూర్యం పళ్ళెంలో చెయ్యి కడుక్కొని లేచాడు.

"ముష్టి అరెకరం! రేపు వాడు డాక్టరయితే ఇట్లాంటి ముష్టిపదెకరాలురెండేళ్లలో సంపాదించడేం?" కాంతమ్మ కంఠంలో ధీమాకు చంద్రయ్యకు ఒళ్ళు మండింది.

"ముష్టి పదెకరాలా? అలాగే ఉంటాదే నీకు. కడుపులో చల్ల కదలకుండా అన్నీ తెచ్చిపడేస్తుంటే? డాక్టరు చదువుకు పంటున్నాడా ఏం?" నీరసంగా అడిగాడు చంద్రయ్య.

"అవును నాన్నా! తమ్ముడు డాక్టరు చదవాలని సరదా పడుతున్నాడు?" చెయ్యి కడుక్కొని లేస్తూ అన్నాడు సత్యం.

"సరదాలకేంలోటు. కాని అది ఎంతవరకు తీరుతుందని ఆలోచించవద్దూ?"

సూర్యం ఓరగా నిల్చొని తండ్రి నిర్ణయంకోసం ఆదుర్దాగా చూస్తున్నాడు. సత్యం, సూర్యం ముఖంలోకి "నీవు ఆదుర్దా పడక్కర్లేదు నేను ఒప్పిస్తాగా?" అన్నట్టు చూస్తూ చిరునవ్వు నవ్వాడు. కాని తండ్రి మొండితనం తెలిసివున్న సూర్యానికి నమ్మకం కుదరలేదు.

"అదేమిటినాన్నా! నా కెటూ చదువు అబ్బలేదు, కనీసం తమ్ముణ్ణి అయినా చదివించకపోతే ఎలా?"

"నేను మాత్రం చదువుకోవద్దన్నానా! బి. ఏ. చదువుకొని ఏదో ఉద్యోగం చూసుకుంటే చాలదూ? డాక్టరు చదువంటే మాటలా? అందులో నీతమ్ముడికి కష్ట సుఖాలు తెలియవు. డబ్బు దుబారాచెయ్యటంలో మాత్రం ఘటికుడు"

"దుబారా దుబారా అంటారేగాని బస్తీలోవుండే వాళ్లకు ఎన్ని ఖర్చులుంటాయో కొంచెంకూడా ఆలోచించరేం?" కాంతమ్మ చిరాగ్గా అంది.

"అయితే ఇంతకీ ఏమంటావు?" చంద్రయ్య భార్యను రెట్టించాడు.

"నా కొడుకు డాక్టరు చదవాల్సిందేనంటాను!" తీవ్రంగా అంది కాంతమ్మ.

"ఇంకేం. చదివించు డాక్టరీ! ఆ వున్న పొలంకాస్తా అమ్మి చిన్నకొడుకుని డాక్టరుచెయ్యి! పెద్దకొడుకు చేతికి చిప్ప ఇచ్చి పంపించు. అవిటివాడూ, నోరు లేనివాడూ! తల్లివిగదా, వాణ్ణిగురించి ఆలోచించవేం?" అంటూ చంద్రయ్య విసురుగా తన గదిలోకివెళ్ళి పోయాడు.

చంద్రయ్య మాటలకు కాంతమ్మ నోటికితాళం పడింది. పెద్దకొడుకువైపు జాలిగా చూసి వంటింట్లోకి వెళ్ళిపోయింది. సూర్యం రుసరుసలాడుతూ బయట వరండాలోకి వెళ్ళిపోయాడు. సరళకూడా చిన్న బావవెనకే బయటకు వెళ్ళింది.

సత్యం అలాగే నిలబడి ఓరెండు నిముషాలు ఏదో ఆలోచించి తండ్రి గదిలోకి వెళ్ళాడు.

సూర్యం కోపంగా వరండాలో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

"ఎందుకుబావా అంత బాధపడతావు? పెద్దబావ, మామయ్యను తప్పక ఒప్పిస్తాడు చూస్తూండు." అంది సరళ సూర్యం దగ్గిరగా వచ్చి.

"నాకేం నమ్మకంలేదు. తనభాగంకూడా నాకెక్కడ ఖర్చు చేయ్యాల్సి వస్తుందోనని ఆలోచనలో పడ్డటువున్నాడు. మిగిలిభాగం! నేను డాక్టర్నయితే ఒక్క సంవత్సరంలో అన్నయ్యబాకీ తీర్చేయగలను" అన్నాడు దురుసుగా.

"ఈ జన్మలో నువ్వు పెద్దబావను అర్థం చేసుకోలేవు. ంత చదవుకొని ఏంలాభం?" తిరస్కారంగా అనేసి విసురుగా ళ్ళిపోయింది సరళ.

సూర్యం అలాగే కొయ్యబారి నిల్చున్నాడు ఓక్షణం. అందరికీ అన్నయ్యే కావాలి! తను ఎవరికీ అక్కర్లేదు! ఈజీ ఛైర్లో కూలబడి కళ్లు మూసుకున్నాడు.

"ఒరే తమ్ముడూ! నాన్న నిన్ను మెడిసన్ చదవించడానికి ఒప్పుకున్నారురా?" సత్యం ఉత్సాహంగా అన్నాడు వరండాలోకి వస్తూ.

సూర్యం కళ్లుతెరచి అన్న ముఖంలోకి చూశాడు అపనమ్మకంగా.

"నిజంరా! నాన్న ఒప్పుకున్నారు."

సూర్యంలో అన్నమీద గౌరవం పొంగుకొచ్చింది. అంతకు ముందేఅన్నను అనుమానించినందుకు దుఃఖం కూడా వచ్చింది. తండ్రి తనను మెడిసన్ చదివించడానికి ఒప్పుకున్నందుకు మరో వైపు ఆనందం కలిగింది. మాటలు కరువయిన సూర్యం "అన్నయ్యా!" అంటూలేచి సత్యాన్ని కౌగలించు కున్నాడు.

అప్పుడే వచ్చి గడపలో నిల్చొన్న కాంతమ్మకు 'పెద్దవాణ్ణి అన్యాయం చేస్తున్నానేమో' అనే బాధ కలిగింది. భర్త ఒప్పుకోక పోతే బాగుండేది అనుకుంది మనస్సులోనే

"అమ్మా! బెంగపడకమ్మా! తమ్ముడు తప్పక డాక్టరవుతాడు! నాన్నగారు ఒప్పుకున్నారు!" ఉత్సాహంగా అన్నాడు సత్యం తల్లితో.

కాంతమ్మ ముఖంలో ఉత్సాహం కనిపించక పోవటం సూర్యంతో పాటు సత్యానికి కూడా ఆశ్చర్యమే కలిగించింది.

"నా బెంగ నీ గురించే బాబూ" అంది కాంతమ్మ పెద్దకొడుకు వైపు దిగులుగా చూస్తూ.

సత్యం మనస్సు చివుక్కు మంది. "ఏమిటమ్మా! మీరంతా నా గురించి అంత బెంగపడాల్సిందేమిటో నాకు అర్థం కావటంలేదు. నన్ను మరీ అంత అసమర్థుణ్ణిగా, ఇతరుల అండ లేకుండా బ్రతకలేని వాణ్ణిగా అనుకోవద్దు. నా పొట్టకు నేను సంపాదించుకోగలను. మీరంతా మాటిమాటికి నా మీద జాలిని చూపిస్తూ నన్ను కుంటివాడిగా, అసమర్థుడిగా క్షణ క్షణం జ్ఞాపకం చేస్తూ బాధపడుతున్నారు. నాకు ఎవరి దయా, జాలీ అక్కరలేదు. నన్నూ ఓ వ్యక్తిగా చూడండి చాలు" ఆవేశంతో అనేసి సత్యం అక్కడ నుంచి గబగబా వెళ్ళిపోయాడు.

అందరూ కొయ్యబారిపోయి సత్యం వెళ్ళినవైపే చూస్తూ నిలబడి పోయారు. కాంతమ్మ కళ్లొత్తుకుంటూ చిన్నగా లోపలకు వెళ్ళిపోయింది.

"పెద్ద బావ ఇంత ఆవేశంగా మాట్లాడటం ఎప్పుడూ చూడలేదు" అంది సరళ దిగులుగా, దానిలో నుంచి మాట్లాడుతున్నట్లు.

"అవును! అందరం కలిసి అన్నయ్య మనస్సును బాగా నొప్పించి నట్లున్నాం" అన్నాడు సూర్యం బాలోచనగా.

(సశేషం)

# ఆర్థిక వ్యవస్థ-తాత్కాలిక మాంద్యం

—కె. వి. నారాయణరెడ్డి

ఈనాడు భారత ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యోల్బణ ఒత్తిడులు పొడ చూపుతున్నాయి. కొన్ని ఉత్పత్తి రంగాలలో కొంత మాంద్యం కూడా కనిపిస్తున్నది. ద్రవ్యోల్బణపు ఒత్తిడులు కొనసాగుతుండగానే మాంద్యంకూడా ఏర్పడడం ఒక విధంగా విపరీతమైన పరిస్థితే. ఎందుచేతనంటే సాధారణంగా ద్రవ్యోల్బణ పరిస్థితులు ఆర్థికాభివృద్ధిని అడ్డగించడం కంటే దాని వికాసానికే దోహదం చేస్తాయి. ఈ విపరీతమైన పరిస్థితి గత రెండు దశాబ్దాలనుంచి పెంపొందుతున్నది.

మన ఆర్థిక వ్యవస్థకు ముఖ్యాధారమైన వ్యవసాయోత్పత్తిలో 1965_66, 1966_67 వ సంవత్సరాలలో బాగా తగ్గుదల ఏర్పడడం, ఎగుమతులు నిలిచిపోవడం, 1965 వ సంవత్సరంలో పాకిస్తాన్‌తో సంఘర్షణ ఏర్పడడం, తత్ఫలితంగా విదేశసహాయం తాత్కాలికంగా ఆగిపోవడం, దీనిమూలంగా విదేశమారకపు రిజర్వులపై అధిక భారం పడడం_ఇవీ మన ఆర్థిక వ్యవస్థలో అసాధారణమైన ద్రవ్యోల్బణ పరిస్థితులు ఏర్పడడానికి దారితీసిన కొన్ని కారణాలు.

గత రెండు సంవత్సరాలలోనూ దేశవ్యాప్తంగా అనావృష్టి పరిస్థితులు ఏర్పడినాయి. ఫలితంగా ఆహారకొరత విపరీతంగా కలిగింది. అన్ని వ్యవసాయ పదార్థాల ఉత్పత్తులూ బాగా తగ్గిపోయాయి. ఇందుచేత వ్యవసాయంపై ఆధారపడిన పరిశ్రమల పురోగతికి తీవ్రంగా దెబ్బ తగిలింది. దేశంలో 1964_65లో 89 మిలియన్ టన్నుల ఆహారధాన్యాలు ఉత్పత్తికాగా 1965_66 లో వాటి ఉత్పత్తి 72.76 మిలియన్ టన్నులకు తగ్గింది. అంటే 18 శాతం తగ్గుదల ఏర్పడిందన్నమాట. 1966_67 లో దిగుబడి కొంచెంపెరిగి సుమారు 79 మిలియన్ టన్నుల ఉత్పత్తి జరిగింది. కాని మనకు అవసరమైన దానికంటే ఇది చాలా తక్కువ. ఇదే విధంగా వాణిజ్య పంటల ఉత్పత్తిలోకూడా బాగా తగ్గుదలలు ఏర్పడ్డాయి. నూనె గింజలు 1964_65 లో 8.46 మిలియన్ టన్నులు ఉత్పత్తికాగా 1965_66లో 6.10 మిలియన్ టన్నులు మాత్రమే ఉత్పత్తి అయ్యాయి. అంటే వీటి ఉత్పత్తి 28 శాతం తగ్గింది. 1966_67లో 6.14 మిలియన్ టన్నుల నూనెగింజలు ఉత్పత్తి అయ్యాయి. ఇది అంతకుక్రితం సంవత్సరపు ఉత్పత్తికి ఇంచుమించు సమానం. 1964_65లో 7.60 మిలియన్ బేళ్ల జనుపనార ఉత్పత్తికాగా 1965_66లో దీని ఉత్పత్తి 5.72 మిలియన్ బేళ్లకు తగ్గిపోయింది. ఈ తగ్గుదల 25 శాతానికి సమానం. ఇదే ప్రకారం ప్రత్తి ఉత్పత్తి 5.69 మిలియన్ బేళ్ల (1964_65) నుంచి 4.71 మిలియన్ బేళ్ల (1965_66)కు 17 శాతం తగ్గింది. అయితే 1966_67 లో 5.35 మిలియన్ బేళ్ల ప్రత్తి ఉత్పత్తి అయింది.

## రక్షణవ్యయం

చైనా, పాకిస్తాన్‌లతో సంఘర్షణ ఏర్పడినందువల్ల రక్షణ వ్యయం చెప్పుకోదగినంతగా పెరిగింది. రక్షణ చర్యలపై 1961_62 లో రూ. 313 కోట్లు ఖర్చుకాగా 1966_67 నాటికి ఈవ్యయం రూ. 918 కోట్లు (బడ్జెటు అంచనా) కు హెచ్చింది. ఆర్థిక పరిస్థితి దృష్ట్యా రక్షణ వ్యయం చాలావరకు ఫలప్రదమైనది కాదు కనుక ఈ ఖర్చులో జరిగే పెరుగుదల ప్రభావం ధరలపై కనిపిస్తుంది.

పాకిస్తాన్‌తో సంఘర్షణ ఏర్పడినవెంటనే మనకు సహాయం అందజేస్తున్న కొన్ని ప్రధాన దేశాలు తమ సహాయాన్ని నిలిపివేయడంవల్ల విదేశీమారకపు వనరులపైన పెద్ద భారం పడింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెటు చర్యల ప్రభావాల వల్లకూడా ద్రవ్యోల్బణ పరిస్థితులు పెరిగాయి.

ప్రజలకు లభింపజేసిన డబ్బులో 1963_64 నుంచి అసాధారణమైన పెరుగుదల ఏర్పడింది. 1963_64 నుంచి 1966_67 వరకు నాలుగు సంవత్సరాల కాలంలో ఈ పెరుగుదల రూ. 1644 కోట్లువుంది. 1960_61 వ సంవత్సరాంతానికి ప్రజలకు రూ. 2868 కోట్లు లభింపజేయబడగా 1966_67 వ సంవత్సరాంతం నాటికి దీని పరిమితి రూ. 4954 కోట్లకు హెచ్చింది. అంటే 73 శాతం పెరుగుదల ఏర్పడిందన్నమాట. గత రెండు సంవత్సరాలుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రణాళికా పథకాలను నిర్వహించే నిమిత్తం లోటుబడ్జెట్లను రూపొందిస్తున్నాయి. ఇందు వల్లకూడా ద్రవ్యోల్బణ పరిస్థితులు పెంపొందాయి.

## తీవ్ర ద్రవ్యోల్బణ పరిస్థితి

పైన తెలిపిన కారణాలన్నీ దేశంలో ధరలపైన చెప్పుకోదగినంత ప్రభావం వేశాయి. మూడవ ప్రణాళిక మొదటి నాలుగు సంవత్సరాలలోనే ధరలు పెరగడం ప్రారంభమైంది. అయితే ఈ హెచ్చుదల మితంగానే వుంది. కాని 1965_66, 1966_67 వ సంవత్సరాలలో వ్యవసాయోత్పత్తిలో బాగా తగ్గుదల ఏర్పడడంవల్ల ఈ రెండు సంవత్సరాలలోనూ ధరలు తీవ్రంగా పెరిగాయి. గడచిన రెండు సంవత్సరాల (1965_66, 1966_67) కాలంలో టోకు ధరల సూచీ సంఖ్యలు 34.2 శాతం పెరిగాయి.

ఆహారపదార్థాల సూచీ సంఖ్యలు 41.7 శాతం, పారిశ్రామిక ముడిపదార్థాల సూచీ సంఖ్యలు 44.6 శాతం, ఉత్పత్తుల సూచీసంఖ్యలు 11.6 శాతం హెచ్చాయి. దేశం తీవ్ర ద్రవ్యోల్బణ పరిస్థితిని ఎదుర్కొంటున్నట్లు ఇవి సూచిస్తున్నాయి.

మన ఆర్థిక వ్యవస్థయొక్క ఉత్పత్తి రంగాలలో పొడసూపుతున్న మాంద్యాన్ని గురించి ఇప్పుడు పరిశీలిద్దాము. సాధారణంగా ఏ ఆర్థిక వ్యవస్థలోనైనా ప్రథమంగా నిర్మాణాలు, కాపిటల్ గూడ్స్ పరిశ్రమలలో మాంద్యం పొడసూపుతుంది.

1966 లో చక్కెర మిల్లు యంత్రాలు, నిర్మాణ యంత్రాలు యంత్ర పరికరాలు, తరిమెనపట్టే యంత్ర పరికరాలు, ఉక్కు క్యాస్టింగులు, ఫోర్జింగుల విషయంలో, శక్తి వినియోగంలో గణనీయమైన తగ్గుదల ఏర్పడింది. దేశంలో 1965, 1966 వ సంవత్సరాలలో ఈ పరిశ్రమలలో ఉత్పత్తిశక్తిని ఎంతమేరకు తక్కువగా వినియోగ పరచుకున్నదీ దిగువ పట్టికలో తెలుపబడింది :

| పరిశ్రమ | ఉత్పత్తి శక్తి తక్కువ వినియోగం శాతం | | వ్యర్థమైపోయిన శక్తిలో |
|---|---|---|---|
| | 1965 | 1966 | పెరుగుదల |
| నిర్మాణ యంత్రాలు | 41.0 | 45.1 | 4.1 |
| యంత్ర పరికరాలు | 22.6 | 31.3 | 8.7 |
| తరిమెన పట్టే యంత్రపరికరాలు | 14.8 | 32.5 | 17.7 |
| ఉక్కు క్యాస్టింగులు | 27.7 | 52.4 | 24.7 |
| ఉక్కు ఫోర్జింగులు | 5.6 | 36.0 | 30.4 |

అయితే 1966 లో సిమెంటు మిల్లు యంత్రాలు, కాగితం మిల్లు యంత్రాలు, రసాయనిక యంత్రాల విషయంలో మాత్రం ఉత్పత్తిశక్తి వినియోగం అంతక్రితం సంవత్సరానికి సమానంగానైనా వుంది, లేదా అంతకు ఎక్కువగానైనా వుంది.

వినియోగదార్ల వస్తుపరిశ్రమల విషయంలో 1966లో ఎలక్ట్రికల్ పరికరాలు, డీసెల్ ఇంజన్లు, పింగాణీ ఉత్పత్తులు, గాజు సామగ్రి మొదలైన వాటి విషయంలో ఉత్పత్తి శక్తిని మొత్తం మీద అధికంగా వినియోగించుకోవడం జరిగింది. అయితే ఇదే సంవత్సరం (1966) లో సిమెంటు, సిమెంటు ఉత్పత్తులవంటి వినియోగదార్ల వస్తు పరిశ్రమల విషయంలో ఉత్పత్తిశక్తి వినియోగం క్రిందటేడుకంటే కొద్దిగా తగ్గింది.

1963 వ సంవత్సరం వరకు యేటా 8 శాతానికి మించి జరిగిన పారిశ్రామికోత్పత్తి పెరుగుదల 1964 లో 5.1 శాతానికి, 1966 లో 2.5 శాతానికి తగ్గిపోయింది. చక్కెర, పత్తి, జనపనార పరిశ్రమలవంటి వ్యవసాయంపైన ఆధారపడిన కొన్ని ప్రధాన పరిశ్రమల ఉత్పత్తికి 1966 లో వ్యవసాయోత్పత్తులు క్షీణించడం వల్ల బాగా దెబ్బ తగిలింది.

## ఆంధ్ర ప్రదేశ్ లో...

భారత రిపబ్లిక్ లో అంతర్భాగం అయిన ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో కూడా దేశంలోని ఇతర ప్రాంతాలలో వచ్చిన ఒడుదుడుకుల ప్రభావం కన్పించడం సహజం. దేశం మొత్తం మీద జరిగినట్లుగానే ఆంధ్రప్రదేశ్ లోని పారిశ్రామిక సంస్థల విషయంలోకూడా ఉత్పత్తి శక్తిని తక్కువగా వినియోగించుకోవడం జరిగింది. 1965, 1966 వ సంవత్సరాలలో రాష్ట్రంలోని కొన్ని పరిశ్రమలలో ఉత్పత్తి శక్తిని ఎంత శాతంలో తక్కువగా వినియోగించుకున్నదీ ఈ క్రింది పట్టికలో చూపబడింది :—

| పరిశ్రమ | 1965 | 1966 |
|---|---|---|
| రేయాన్ వస్త్రాలు | 36.6 | 41.3 |
| జనపనార ఉత్పత్తులు | 31.9 | 48.4 |
| అస్బెస్టాస్ సిమెంట్ ఉత్పత్తులు | + 6.9 | 39.2 |
| కుట్టు మెషిన్లు | 77.1 | 87.1 |
| సిమెంటు యంత్రాలు | + 0.3 | 6.8 |
| కాగితం | 43.0 | 47.9 |
| చక్కెర | 9.1 | 37.9 |

వ్యవసాయంపై ఆధారపడిన పరిశ్రమలతో పాటుగా ఇతర పరిశ్రమలు కూడా 1966లో అంత క్రితం సంవత్సరంలో కంటే ఉత్పత్తి శక్తిని చాలా తక్కువ వినియోగించుకున్నట్లు పై వివరాల వల్ల వెల్లడవుతున్నది. రాష్ట్రంలోని పారిశ్రామిక రంగం పరిమితమైనదనీ, దేశంలోని పూర్తి పారిశ్రామిక శక్తిలో ఇది చాలా తక్కువ శాతానికి సమానమనీ, అందుచేత పారిశ్రామిక క్షేత్రంలో దేశం మొత్తం మీద వచ్చే పరిణామం ప్రభావం రాష్ట్రంలోని పారిశ్రామిక సంస్థలపై వుండి తీరుతుందనీ ఈ సందర్భంలో గమనించాలి.

పైన ఇచ్చిన భోగట్టాను బట్టి మాంద్యానికిగల కారణాలను పరిశీలించడంలో, నిర్మాణ అసమానతలు, ఉత్పత్తి సాధనాల వసతి, అసంపూర్ణ మార్కెటు పరిస్థితులతో ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందడం దృష్ట్యా మాంద్యానికి దారి తీసే ధోరణులు, వాటి ఒత్తిడులు చాలా బలీయమైనవైతే తప్ప వివిధ ఆర్థిక కార్యకలాపాలలో పూర్తి తగ్గుదలకు దారి తీయకపోవచ్చుననే అంశాన్ని గమనించడం ముఖ్యం. అయితే వివిధ ఆర్థిక కార్యకలాపాల సాధారణ అభివృద్ధిలో కొంత ప్రతిబంధకాన్ని కలిగించడం కద్దు.

మాంద్యం ప్రభావం రైల్వేల లోడింగు కార్యకలాపాలు మందగించడంలోనూ, దిగుమతి లైసెన్సులను తక్కువగా ఉపయోగించుకోవడంలోనూ ప్రతిఫలించింది. ఉదాహరణకు వర్తమాన ఆర్థిక సంవత్సరంలోని మొదటి నాలుగు నెలల కాలంలోనూ రైల్వేట్రాఫిక్ ఆశించిన స్థాయికి చేరుకోవలేకపోయింది. 1967-68 వ సంవత్సరంలో ఆదాయం చేకూర్చే సరుకులు అదనంగా 8.[illegible] మిలియన్ టన్నుల వరకు రవాణా కాగలవని ఆశించబడ్డా

మొదటి నాలుగు నెలల కాలంలోనే ముడి సరుకుల రవాణాలో గత సంవత్సరం ఇదే కాలంలోని పరిస్థితితో పోల్చి చూచినప్పుడు— మొత్తం మీద 3.90 లక్షల టన్నుల వరకు తగ్గుదల ఏర్పడింది. రైళ్ళ ద్వారా బొగ్గు, ముడి ఇనుం రవాణా, పైన తెలిపిన కాలంలో వరుసగా 1.08 మిలియన్ టన్నులు, 1.30 లక్షల టన్నుల వరకు పెరగ్గా ఉక్కు కర్మాగారాలకు సంబంధించిన ముడి పరికరాల రవాణాలో 90,000 టన్నుల తగ్గుదల ఏర్పడింది.

ముఖ్యంగా ఇంజనీరింగు, జవుళి, వస్త్ర పరిశ్రమలు మొదలైన వాటి మూసివేతను గురించిన వార్తలు మాంద్యం ఉనికిని సూచిస్తాయి. ఇది కార్మిక అశాంతి, లేఆఫ్, నిరుద్యోగ పరిస్థితి పెరుగుదలకు సామాన్య కారణం.

## జాతీయాదాయం

గత రెండు సంవత్సరాలలో మన వ్యవసాయోత్పత్తికి దెబ్బ తగలడంవల్లనూ, పారిశ్రామికోత్పత్తి మందకొడిగా సాగడంవల్లనూ జాతీయాదాయం పెరుగుదల గమనించ దగినంతగా క్షీణించింది. మూడవ ప్రణాళిక మొదటి నాలుగు సంవత్సరాలలో జాతీయాదాయం సగటున సంవత్సరానికి 4.3 శాతం చొప్పున పెరిగింది. కాగా 1965_66లో జాతీయాదయంలో—ధరలు నిలకడగా వున్నప్పుడు_3.7 శాతం తగ్గుదల ఏర్పడింది.

ప్రస్తుతం నెలకొనివున్న విపరీతమైన ఆర్థిక పరిస్థితికి రెండు విధాలుగా వ్యాఖ్యానాలు చెబుతున్నారు. మాంద్య పరిస్థితులు సాధారణ స్వభావం కలిగినవనీ, ద్రవ్యోల్బణ పరిస్థితులు ఇప్పుడు పరిమిత రంగాలకు వర్తించే నైజాన్ని కలిగివున్నాయని లేదా క్రమముగా ఆ స్వభావాన్ని అలవర్చుకుంటున్నాయని ఒక వర్గానికిచెందిన నిపుణుల అభిప్రాయం. ప్రస్తుత ద్రవ్యోల్బణ పరిస్థితులకు, ఒక దశాబ్దంగా వ్యవసాయోత్పత్తులు దెబ్బ తినడం, డబ్బు పెరిగిపోవడం కారణమని వీరి అభిప్రాయం. ఈ వాదం ప్రాతిపదికగా వీరు, ఆర్థిక విస్తృతిని ప్రోత్సహించే నిమిత్తం ఆర్థిక, బడ్జెటు విధానాలను సడలించాలని కోరుతున్నారు.

ద్రవ్యోల్బణ పరిస్థితులు సాధారణ స్వభావం కలిగినవనీ, పరిమిత రంగాలకు వర్తించే మాంద్య పరిస్థితులు నైజాన్ని మాత్రమే కలిగినవనీ రెండవవర్గం వారి అభిప్రాయం. వ్యవసాయోత్పత్తి చెప్పుతున్నంత మందకొడిగా లేదని వీరి వాదం. నిజానికి 1955_56—1964_65వ సంవత్సరాల మధ్యకాలంలో వ్యవసాయోత్పత్తి సూచీ 35 శాతం పెరుగుదలను, ఆహార ధాన్యాలు 30 శాతం పెరుగుదలను, నూనెగింజల 50 శాతం పెరుగుదలను, ప్రత్తి 40 శాతం పెరుగుదలను, జనుపనార 34 శాతం, టీ 30 శాతం పెరుగుదలను సూచించాయి. కాని మళ్లీ వ్యవసాయోత్పత్తి పెరుగుదల సాఫీగా సాగిపోలేదు. ఎన్నో హెచ్చుతగ్గులు వచ్చాయి. వ్యవసాయోత్పత్తి అధికమైనప్పటికీ ధరలు పెరిగాయి. ఉదాహరణకు 1964_65లో పంట దిగుబడి బాగా వుంది. అయినప్పటికీ ధరలు హెచ్చాయి. దేశంలో ద్రవ్యోల్బణం ఏర్పడడానికి ఆహారసరఫరా ఒక్కటి మాత్రమే కారణం కాదనే విషయాన్ని ఇది ఋజువు పర్చింది. డబ్బు విడుదల అధికం కావడం ధరల పెరుగుదలకు కీలకంవలె పనిచేస్తున్నది. ఇటీవలి సంవత్సరాలలో లోటు బడ్జెట్లను రూపొందించడం జరుగుతున్నది. ఆర్థికకొంత దృష్ట్యా ఈ విధంగా డబ్బు విడుదలను హెచ్చించడమే ప్రస్తుత అధిక ధరలకు ప్రధానహేతువు అయినట్లు కనిపిస్తున్నది. మొత్తంమీద ధరలు పెరగడంవల్ల ముఖ్యంగా ఆహార ధాన్యాల ధరలు హెచ్చడంవల్ల ప్రజల కొనుగోలు శక్తి సన్నగిల్లింది. అంతేగాక వారు పొదుపు చేయగలిగే మొత్తాలుకూడా తగ్గిపోయాయి. వస్త్రం వంటి వినియోగవస్తువులకు సైతం గిరాకీ తగ్గడానికి ఇది కారణం. ఇక విలాసవస్తువుల సంగతి సరేసరి. పారిశ్రామిక ముడిసరుకుల ధరల పెరుగుదల, అపమూల్యనం వంటి కారణంవల్ల కూడా కొన్ని సందర్భాలలో పారిశ్రామికోత్పత్తికి దెబ్బతగిలింది. ఈ విధంగా సాధారణస్వభావం కలిగినటువంటి ద్రవ్యోల్బణ పరిస్థితులు కొన్ని రంగాలలో, అసమానతలను ప్రవేశపెట్టడం ద్వారా ఉత్పత్తిపై దెబ్బతీశాయి.

## కంట్రోళ్ల తొలగింపు

మాంద్యం కొన్ని రంగాలకు మాత్రమే పరిమితమయ్యే నైజం కలిగినదన్న అభిప్రాయాన్ని, పురోభివృద్ధిలో ప్రతిబంధకాలు ఏర్పడడం స్పెక్యులేషన్‌పై ఎక్కువగా ఆధారపడిన కొన్ని పరిశ్రమలకే పరిమితం కావడం బలపరుస్తున్నది. ఉక్కు, సిమెంటు పైన ఇటీవల కంట్రోళ్ళు తొలగించడం జరిగింది. కంట్రోళ్లు వున్న కాలంలో వీటికి బాగా గిరాకీ వుండడానికిగల కారణాలు కృత్రిమమైనవి. కంట్రోళ్ల తొలగింపు పిమ్మట ఈ విషయం ఋజువైంది. కంట్రోళ్లను ఎత్తివేసిన తరువాత గిరాకీ సామాన్య స్థాయికి వచ్చింది. వీటి ధరలు పెరగలేదు.

ఆర్థిక వ్యవస్థకు ద్రవ్యోల్బణం వల్ల దెబ్బతగులుతుందన్న వాదాన్ని అంగీకరించి గిరాకీ, సరఫరాలమధ్య అసమానతలను తొలగించడానికీ, ధరలను అదుపులో పెట్టడానికీ కేంద్ర ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకున్నది. పెద్దఎత్తున దిగుమతి చేసుకోవడం ద్వారా, ముఖ్యంగా ఆహారధాన్యాలను_ఆహార ధాన్యాల సేకరణను తీవ్రతరం చేయడంద్వారా ప్రభుత్వనిలువలనుంచి ఎక్కువ సరకును విడుదల చేయడంద్వారా, కొన్ని ఆహారధాన్యాల విషయంలో రైతులకు మంచి ధరలు ఇవ్వజూపడం, ఇరిగేషన్ ప్రాజెక్టు పనులను త్వరితగతిని అమలుపరచడం, తక్కువ వ్యవధిలో అధికోత్పత్తిని సాధించడానికి సాధ్యమైన ప్రదేశాలలో తీవ్రతర సేద్యాన్ని సాగించడం ద్వారా సరఫరాలను పెంపొందించడానికి ప్రయత్నాలు జరిగాయి. ఒక లక్ష అంతకు ఎక్కువ జనాభాగల కొన్ని ముఖ్య నగరాలలో చట్టబద్ధమైన రేషనింగ్‌ను ప్రవేశపెట్టారు. పారిశ్రామిక ముడిపదార్థాలూ, ఉత్పత్తుల విషయంలో విదేశీ మారకం కొంత ప్రభావాన్ని సాధ్యమైనంత తగ్గించడానికి ప్రయత్నాలు జరిగాయి. ఆర్థిక, ద్రవ్య సంబంధంలోకూడా కొన్ని నిర్బంధచర్యలు తీసుకొనబడినవి.

## ఆర్థిక మంత్రిత్వశాఖ తీసుకున్న చర్యలు

ఇటీవల తీసుకున్న ఆర్థిక, ద్రవ్య సంబంధమైన చర్యలకు సంబంధించిన స్థూల సూత్రాలను కేంద్ర ఆర్థిక మంత్రి వివరించారు. ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడి, వాస్తవంగా సమాజం పొదుపు చేయగలిగిన మొత్తాలకు మించకూడదనీ, ఉత్పత్తి శక్తి హెచ్చింపుకూ వినియోగం తగ్గింపుకూ మధ్య పొదుపులను బాగా ప్రోత్సహించే విధంగా పొందిక వుండాలనీ ఆ సూత్రాలు నిర్దేశిస్తున్నవి. ఈ లక్ష్యాలను సాధించే నిమిత్తం కేంద్ర ఆర్థిక మంత్రిత్వశాఖ ఈ దిగువ చర్యలు తీసుకున్నది:-

(అ) ఎట్టి పరిస్థితులలోనైనా లోటు బడ్జెట్లు కూడదని ప్రతిపాదించ బడినది.

(ఆ) ఉత్పత్తి రంగాల వాస్తవిక ఇబ్బందులను నివారించడానికి రూ. 11.61 కోట్ల మేరకు పన్నురాయతీలు ప్రకటించబడినవి.

(ఇ) ప్రాధాన్యం వహించే పరిశ్రమల వాస్తవిక అవసరాలను ఆదుకునే నిమిత్తం పరపతి విధానం సడలించబడింది. దీని మేరకు 1966-67 లో 80 శాతానికి తగ్గకుండా బ్యాంకు పరపతి ఈ పరిశ్రమలకు లభింప జేయబడింది.

(ఈ) దిగుమతి సదుపాయాలు ఇతోధికంగా సడలించ బడినవి. 1967 మే మొదటి తేదీన ప్రకటించబడిన క్రొత్త దిగుమతి విధానాన్ననుసరించి భారీ, లఘుపరిశ్రమల రంగాలలో ప్రాధాన్యం వహించే 59 పరిశ్రమలకు కొనసాగింపు ప్రాతిపదికపైన లైసెన్సులు ఇవ్వబడతాయి. ఎగుమతి చేసే ఉత్పత్తుల నిమిత్తం ముడి పదార్థాలను దిగుమతిచేసుకోవడానికి లైసెన్సులు కోరే వాస్తవిక వినియోగదార్లకు, దిగుమతి చేసుకునే వస్తువుల విషయంలోనూ, తమ సరఫరాల అమ్మకపు కేంద్రాల విషయంలోనూ ఎన్నిక చేసుకునే స్వేచ్ఛ వుంటుంది. ప్రసిద్ధ దిగుమతి దార్లకు ఇప్పుడు వార్షిక ప్రాతిపదికపైన లైసెన్సులు ఇస్తారు. తమ లైసెన్సులను పూర్తిగా వినియోగించుకోవడానికై సంవత్సరం మధ్యలో అధికార్లనుంచి అనుజ్ఞ పొందవలసిన అవసరం ఇక వుండదు.

(ఉ) ద్రవ్య విస్తరణ అనుచితంగా జరుగకుండా వుండేందుకై జాతీయస్థాయిలోనూ, రాష్ట్రాల స్థాయిలోనూ ప్రణాళికా కేటాయింపులపై పరిమితులు వుంటాయి.

## ఉన్నతాధికార సంఘం

దేశంలో ఆర్థిక మాంద్యం ఏర్పడడానికిగల కారణాలను వివరంగా పరిశీలించి, ద్రవ్యోల్బణం మాంద్యంవల్ల కలిగిన ప్రస్తుత ఆర్థిక ఇబ్బందులను విజయవంతంగా ఎదుర్కొవడానికై స్వల్పకాలిక, దీర్ఘకాలిక చర్యలను సూచించడానికిగాను ఉపప్రధాని అధ్యక్షతవ త్వరలో ఒక ఉన్నతాధికార సంఘం నియమించ బడుతుంది.

ప్రస్తుత ఆర్థిక పరిస్థితి క్లిష్టంగా వున్నప్పటికీ ఇది సాధారణ ద్రవ్యోల్బణమే. మాంద్యం కొన్ని రంగాలకు మాత్రమే పరిమితమైవుంది. మాంద్యం సమస్య తీవ్రమైనదే. సందేహమేమీ లేదు. అయితే కొంతమంది పారిశ్రామిక వేత్తలు అంటున్నట్లు ఇది అంత తీవ్రంగా, విశాలంగా వ్యాపించి లేదు. మాంద్యం ప్రధానంగా పెట్టుబడి వస్తువులను ఉత్పత్తిచేసే కొన్ని పరిశ్రమలకు వ్యవసాయ ముడిపదార్థాలపై ఆధారపడిన పరిశ్రమలకు పరిమితమై వుంది. కొన్ని పరిశ్రమలలో ప్రస్తుతం మాంద్యం ఏర్పడడానికి గల వివిధ కారణాలను మదింపు చేయడం అంత సులభం కాదు. అయితే కొన్ని పరిశ్రమల ఉత్పత్తుల గిరాకీల విషయంలో సరి అయిన అంచనాలు వేయక పోవడం ఇందుకు తగిన కారణమైనట్లు కనిపిస్తుంది. అంచనాల లోపంవల్ల వ్యవసాయం తదితర వినియోగ వస్తువుల పరిశ్రమల పెరుగుదల స్థాయిని మించి ఆ యా రంగాలలో పెట్టుబడులు పెట్టడం జరిగింది. వర్షాభావంవల్ల కూడా అత్యవసరపదార్థాల ధరలు ఆకాశాన్నంటాయి. ఫలవంతమైన పెట్టుబడులకు ఆస్కారంలేకుండాపోయింది. పాకిస్తాన్ దురాక్రమణ వల్ల విదేశీ సహాయం తగ్గింది. తమ ఉత్పత్తుల ధరలను తగ్గించి, నాణ్యతను పెంచి వాటిని అంతరాతీయ ప్రమాణాల స్థాయికి తేవడానికి పరిశ్రమలు గట్టి ప్రయత్నం చేయలేదు. ఇది కూడా ఒక ముఖ్యాంశమే. మన ఉత్పత్తుల నాణ్యత విషయంలో విదేశీ దిగుమతి దార్లనుంచి కొద్దిగా మాత్రం ఫిర్యాదులు వచ్చాయి.

వర్తమాన సంవత్సరంలో వర్షాభావం లేకుండా వున్నట్లయితే ప్రస్తుత మన ఆర్థిక ఇబ్బందులు చాలా వరకు నివృత్తి అవుతాయి. అదనపు కొనుగోలు శక్తి, మాంద్యం ప్రభావాలను చాలా వరకు ఉపశమింప జేస్తుంది.

అంతర్జాతీయ ధరలకు ఉక్కును సరఫరా చేయడానికీ, ఫలప్రదమైన ప్రయోజనాలకు ఉదారంగా పరపతి లభింప జేయడానికీ, సబ్సిడీలు ఇవ్వడానికీ, ప్రోత్సాహక చర్యలు తీసుకోవడానికి ప్రభుత్వం నిశ్చయించింది విదేశాలకు మన ఎగుమతులను పెంపొందించడంలో ఈ చర్యలు బాగా తోడ్పడతాయి.

ఉత్పత్తి ఖర్చులను తగ్గించడానికీ, ఉత్పత్తుల నాణ్యతను పెంచడానికీ పరిశ్రమలను సయుక్తికమైన మార్గాలలో వ్యవస్థీకరించడం ముఖ్యావసరం. పరిశోధన మార్కెటు అభివృద్ధిపట్ల ఎక్కువ శ్రద్ధ వహించాలి. మన పారిశ్రామిక వేత్తలు కాలానుగుణ్యమైన మార్పులను అనుసరించాలి. దూరదృష్టిని ప్రదర్శించాలి. సయుక్తికమైన మార్గాలలో పరిశ్రమలను వ్యవస్థీకరించే యత్నంలో కొన్ని యూనిట్లు మూసివేయబడినట్లయితే—అందువల్ల సంభవించే ఉత్పత్తి నష్టాన్నికానీ, కార్మికుల తొలగింపునుకానీ ఎవ్వరూ లక్ష్యం చేయనవసరం లేదు. ఎందు చేతనంటే దీనివల్ల చేకూరే ప్రయోజనాలు తక్షణమే సంభవించే నష్టానికంటే ఎంతో అధికమైనవి. గత రెండు సంవత్సరాలలో ధరల తీవ్ర పెరుగుదలకు కారణభూతమైన వ్యవసాయోత్పత్తి వర్తమాన సంవత్సరంలో బాగా పెంపొందే అవకాశంవుంది. ఇప్పటి వరకూ దేశమంతటా ఋతు పరిస్థితులు అనుకూలంగా వున్నాయి. ఈ సంవత్సరం వచ్చే సంవత్సరం కూడా ఉత్పత్తి మంచిగా జరిగినట్లయితే మన ఆర్థిక ఇబ్బందులు చాలా వరకు సులభంగా తొలగిపోతాయి. ఇప్పుడు మనలను ఎదుర్కొంటున్న మాంద్యం మన ఆర్థిక వ్యవస్థలో తాత్కాలికంగా ఏర్పడిన పరిణామం మాత్రమే.

మనదేశంలో 1950 నాటికి మొత్తం స్థాపిత విద్యుచ్ఛక్తి 230 లక్షల కిలోవాట్లు వుండేది. 1971 నాటికి ఈ స్థాపిత శక్తిని రెట్టింపు చేయాలని మనం లక్ష్యంగా పెట్టుకున్నాం. అంటే యింతకాలంగా మనం విద్యుచ్ఛక్తిరంగంలో నెలకొల్పుకున్న దానికి రెట్టింపు స్థాపిత శక్తిని రానున్న అయిదేళ్ళలోనూ నెలకొల్ప వలసి వున్నది.

విద్యుదభివృద్ధి వల్ల ఏర్పడిన అవసరాలను తీర్చడానికి వీలుగా దేశవాళీ, భారీవిద్యుత్పరికరాల తయారీ అధికమయింది. ట్రాన్స్‌ఫార్మర్లు, స్విచ్ గేర్లు, సర్క్యూట్ బ్రేకర్లు, బాయిలర్లువంటివి కూడా భోపాల్‌లో, తిరుచినాపల్లిలోనూ తయారవుతున్నాయి. మరో రెండు భారీవిద్యుత్పరికరాల కర్మాగారాలు హైదరాబాదులో ఒకటి, హరిద్వారంలో ఒకటి నెలకొల్ప బడబోతున్నాయి. ఈ రెండూ ఏర్పాటు కావడంతో విద్యుత్పరికరాల తయారీలో యించుమించు భారతదేశం స్వయంసమృద్ధం కాగలదు.

## గ్రామీణ విద్యుదీకరణ

ఈనాడు దేశంలో ప్రతి పదిగ్రామాలలో ఒక గ్రామానికి విద్యుచ్ఛక్తి సౌకర్యం వుంది. 1951లో ప్రతి నూటయాభై గ్రామాలకు ఒక్క గ్రామం మాత్రమే విద్యుచ్ఛక్తి సౌకర్యం కలిగి వుండేది. చతుర్థ పంచవర్ష ప్రణాళికలో యిప్పుడున్న వాటికి రెట్టింపు గ్రామాలకు ఈ సౌకర్యం విస్తరింపజేయాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. ఈనాడు దేశంలో సుమారు 6.5లక్షల పంపుసెట్లు, గొట్టపుబావులు విద్యుచ్ఛక్తి ద్వారా పనిచేస్తున్నాయి.

పరిశ్రమలలో వేలాది కార్మికులు పని చేస్తుంటారు. మన అవసరాలనూ, అభిరుచులనూ సంతృప్తి పరచడానికి అవిరళంగా కృషిచేస్తుంటారు. సంపద ఉత్పత్తికి తోడ్పడే శారీరకమైన పనికి 'శ్రమశక్తి' అనిపేరు. ఆర్థిక శాస్త్రంలో దీనికి మొత్తం 'శ్రామికులు' అని అర్థం. స్థూలంగా పరిశీలిస్తే యిటీవలి కాలంలో, రెండు ప్రధాన ధోరణులు అమల్లో వున్నాయి. గత అర్ధశతాబ్దంగా కార్మికులకిచ్చే ప్రతిఫలం క్రమక్రమంగా పెరిగింది. పనివేళలు క్రమక్రమంగా తగ్గాయి.

దేశఆర్థికవ్యవస్థ పటిష్ఠతకూ, దేశప్రగతికీ కార్మికులు ప్రముఖమైన పాత్ర వహిస్తారన్న విషయం ప్రపంచమంతటా గుర్తించినట్టుగానే మనదేశంలోనూ గుర్తించడంజరిగింది. అందువల్ల జాతీయాభివృద్ధి కార్యక్రమంలో కార్మిక సంక్షేమం అనేది అత్యంత ప్రధానమైన అంశం.

కర్మాగారాలచట్టం, గనులచట్టం వర్తించే పరిశ్రమలలోనూ, సంస్థలలోనూ కాంటీనులు, విశ్రాంతి గదులు, పరిశుభ్రపరచుకునే సౌకర్యాలు, వైద్య సదుపాయాలు వంటివి కల్పించబడుతున్నాయి. సంక్షేమాధికార్లను ఏర్పాటు చేయడం కూడా జరుగుతున్నది. మైకాగనుల కార్మికులకు మైకా కార్మికుల సంక్షేమనిధి వైద్య, విద్యాసౌకర్యాలను, మనోల్లాసకర కార్యకలాపాల సౌకర్యాలను కల్పిస్తున్నది. ప్రసూతికేంద్రాలు, శిశుసంక్షేమ కేంద్రాలతో కూడిన డిస్పెన్సరీలు మైకాగని కార్మికులవైద్యావసరాలను ఆదుకుంటున్నాయి.

సబ్సిడీ యిచ్చే పారిశ్రామిక గృహనిర్మాణ పథకాల క్రింద రాష్ట్రప్రభుత్వాలకు, చట్టబద్ధమైన గృహనిర్మాణ మండలులకు, పారిశ్రామిక సిబ్బందికి, పారిశ్రామిక కార్మికులకు సంబంధించిన సహకార సంఘాలకు ఋణాలను, సబ్సిడీలను యివ్వడం జరుగుతున్నది.



### దుబారా చెయ్యకండి

నరుకు విలువచేయడంలో చెడు పద్ధతులవలంబించి రైతులు, వర్తకులు, గృహిణులు దుబారా చెయ్యడం తగదు. మనుమల శరీర పోషణకు అవసరమయ్యే అమూల్యమైన ఆహార పదార్థాలను వృధా చేయడంగానీ, ఎలుకలు పందికొక్కుల పాలుచేయడం గానీ న్యాయంకాదు జాతి క్షేమం దృష్ట్యా ప్రజలందరూ అనుసరించవలసిన కనీస ధర్మం యిది.



# మన రైతులు-నూతన సేద్యపు విధానాలు

-- యస్. వి. ...



గత అనేక సంవత్సరాలుగా మనం ఆహార కొరతను ఎదుర్కొంటున్నాము. ఈ కొరతమూలంగా మన పరిశ్రమలు, మొత్తం ఆర్థిక వ్యవస్థ కుంటుపడింది.

తక్కువ ఎకరా దిగుబడి, భూసారం లోపాల కారణంగానే ఆహార కొరత ఏర్పడుతున్నది. రోజు రోజుకు పెరిగిపోతున్న జనాభా కూడా దీనికి మరొక ముఖ్యమైన కారణం.

మేలురకం విత్తనాలు, తగిన మొత్తంలో ఎరువులవాడకం, సస్యరక్షణ, నీటిపారుదల సౌకర్యాలు, ఆధునిక సేద్యపు విధానాల అమలుద్వారా అధికోత్పత్తిని, ఎక్కువ ఎకరా దిగుబడిని సాధించవచ్చు. మన వ్యవసాయ పరిశోధనా కేంద్రాలలోను, మనదేశంలోని అభ్యుదయ కర్షకుల తీవ్రకృషి ఫలితంగాను ఎకరా దిగుబడిని అధికం చేయడం జరిగింది. దీని ఫలితంగా ఎక్కువ దిగుబడికి కావలసిన సాంకేతిక పరిజ్ఞానం మనదేశంలోనే లభించే అవకాశం కలిగింది. దేశంలోని రైతాంగాని కంతటికీ యీవిజ్ఞానాన్ని అందచేయాల్సిన అవసరం వుంది. భారతీయ రైతుకు యిదొక సవాలు. అతనికే కాదు, దేశంలోని ప్రజాస్వామ్యసంస్థలకు, ప్రత్యేకంగా విస్తరణ శాఖాధికారులకు కూడ యిదొక సవాలు.

ఆధునిక పద్ధతులను అనుసరించడంలో రైతులు ఎక్కువగా ముందుకు రాకపోవడం పెద్దసమస్యగావుంది. ఈ సమస్య పరిష్కారం కావడానికి అనుకున్న ఐదేళ్ళకన్నా యింకా ఎక్కువ కాలం పడుతుందని నిపుణుల సంఘం యిటీవల వ్యక్తం చేసింది. ప్రత్యేకంగా ప్రారంభించిన "అధిక దిగుబడి రకాల కార్యక్రమం" అమలు సందర్భంలో సూచించిన ఆధునిక పద్ధతులు, విధానాలను అనుసరించడంలో పట్టినకాలం గమనార్హమైనది.

నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని స్వీకరించడంగానీ, నిరాకరించడంగానీ రైతు మనస్తత్వంపైనా, ఆయన తీసుకునే నిర్ణయం పైనా ఆధారపడివున్నాయి. ఆధునిక విధానాలను గూర్చి రైతుకు పదే పదే వివరించడంద్వారా అంతిమంగా యివి అనుసరించడం గానీ నిరాకరించడంగానీ జరుగుతుంది. ఆధునిక విధానాలను అనుసరించడమంటే తరతరాలనుండి వస్తున్న పాత విధానాలకు స్వస్తి

...ప్పో కొత్త విధానాలను అనుసరించడానికిముందు వాటినిగూర్చి సరిగా తెలుసుకోవడం, పరిశీలించడం, మదింపు చేయడం అవసరం. ఆతర్వాతనే వాటిని అంగీకరించడానికి అవకాశం ఉంటుంది.

ఆధునిక పద్ధతులను అవలంబింప జేయడానికి ముందు రైతాంగంలో ఆ పద్ధతులను గూర్చి విరివిగా ప్రచారం జరగడం చాలా అవసరం. వారణాసి జిల్లా విత్తనాల సరఫరా కార్యక్రమానికి సంబంధించి, ప్రణాళికా సంఘానికి చెందిన ప్రాజెక్టు పథకాల కమిటీ యిటీవల జరిపిన పరిశీలనలలో యీ విషయం స్పష్టమైంది. ఈ కార్యక్రమాన్ని గూర్చి చాలామంది రైతులకు తెలియక పోవడమేగాక, గ్రామసేవకులు కూడ యీ కార్యక్రమాన్ని గూర్చి వినడం జరగలేదని యీ పరిశీలనద్వారా వెల్లడి అయింది.

## అంచల వారీగా అమలు

ఆధునిక పద్ధతులనుగూర్చి రైతు తెలుసుకున్నప్పుడు, వాటిలో ఆసక్తి కలిగి, వివరాలను తెలుసుకునే ప్రయత్నం చేస్తాడు. ప్రస్తుత పరిస్థితులను, భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని రైతు యీ కొత్త విధానాలను గూర్చి ఆలోచించ గలుగుతాడు. ఆ తర్వాతనే ఒక నిశ్చయానికి వస్తాడు. ఆధునిక విధానాల ప్రయోజనాలను ప్రత్యక్షంగా మదింపు చేసుకోవడానికి కొద్దిపాటి విస్తీర్ణంలో యీ పద్ధతులను అమలు జరుపుతారు.

ఆధునిక పద్ధతులను అమలు జరిపే సందర్భంలో రైతు ఏ దశలోనైనా వాటిని నిరాకరించవచ్చు. జపాను పద్ధతి వరిసాగు విషయంలో 97 శాతం, కంపోస్టు ఎరువుల విషయంలో ఒక శాతం కన్నా తక్కువ యీ విధానాలను త్యజించడం జరిగిందని 1958లో ప్రణాళికా సంఘం జరిపిన పరిశీలన ద్వారా తెలిసింది.

## ప్రదర్శనలు

చూస్తేగానీ యే విషయాన్నైనా నమ్మరు. రైతుల పొలాలలో ప్రదర్శన క్షేత్రాలను ఏర్పాటు చేస్తే ఆధునిక విధానాలను గూర్చి వారికి ఎన్నో విషయాలు ప్రత్యక్షంగా తెలుస్తాయి. దీనివల్ల రైతులలో ఉత్సాహం, ఆసక్తి ప్రబలుతాయి. క్షేత్ర ప్రదర్శనల ద్వారానే దాదాపు 25 శాతం వరకు ఆధునిక విధానాలను చేపట్టడం జరిగిందని అమెరికాలో జరిపిన పరిశీలనల వల్ల తెలిసింది.

## నూతన పద్ధతుల అమలు

అమలు కాలాన్నిపూర్వ రంగంగా భావించాలి. ఆ కాలంలోనే మనిషి మనస్సులో కొత్తఆలోచనలు వస్తుంటాయి. ఆధునిక పద్ధతులను అవలంబించాలా? వద్దా? అనేవిషయం వ్యక్తిగతమైనది. ఒక నిర్ణయానికి రావడానికి అవలీకత్తులు ఎంతగానో పని చేస్తాయి. రైతులలో విజ్ఞానాభిలాషను పెంపొందించడానికి విస్తరణ శాఖ సిబ్బంది కృషిచేస్తుంది. రైతులు ఆధునిక పద్ధతులనుగూర్చి ఎంత త్వరగా తెలుసుకోవడానికి కృషిచేస్తారో, వాటిని అంత త్వరగా అమలు జరపడానికికూడ ప్రోత్సహించాలి. ఆధునిక పద్ధతులు తెలియకపోవడంమూలంగానే వాటిని అవలంబించడంలో ఆలస్యం ఏర్పడుతున్నదనడం నిజంకాదు. అమెరికాలో ఏకొద్ది మంది రైతులో సంకరజాతి మొక్కజొన్నను వాడడానికి ముందుగానే సంకరజాతి మొక్కజొన్న గూర్చి దాదాపు అక్కడ రైతులందరు తెలుసుకునే ఉన్నారు.

అవలంబన విధానాలలో ఆధునిక పద్ధతులు ముఖ్యమైన అంశంగా భావించవచ్చు. వాటి ద్వారాపొందే ప్రయోజనాలు, అనుగుణ్యత, అవగాహనలపై యీ ఆధునిక పద్ధతుల అమలు ఆధారపడి వున్నది. ఆధునిక పద్ధతులు ఎంతవరకు లాభదాయకం, ప్రస్తుతం అమలులోఉన్న పూర్వపుపద్ధతులకన్నా యివి ఎంతవరకు శ్రేష్ఠమైనవి అనే విషయాలు, మొదటి అంశానికి సంబంధించినవి.

ప్రస్తుతపు విధానాలు, వాటి విలువలు, రైతుల అనుభవం అనే విషయాలు అనుగుణతకు సంబంధించినవి. ఈ సంవత్సరం పంజాబులో మెక్సికన్‌రకం గోధుమలను ఉత్పత్తిచేయడం ప్రారంభించారు. ఆస్ట్రేలియన్ రైతులు యంత్ర పరికరాలులేని ఆధునిక విధానాలకన్నా త్వరిగా యంత్ర పరికరాలతోకూడిన ఆధునిక విధానాలను త్వరిగా అనుసరించారు. రైతులు యంత్రపరికరాలకు ఎక్కువ విలువయివ్వడమే దానికి కారణం.

క్లిష్టంగాలేని కొత్త పద్ధతులను అతిత్వరగా అనుసరిస్తారు. అధిక రాబడిరకాలు, దానికి సంబంధించిన అనేక విధానాలకన్నా, మేలిరకం విత్తనాలుగానీ, ప్రత్యేకమైన ఎరువులనుగానీ ఉపయోగించడానికి రైతులు ఉత్సాహంచూపుతారు. అధికరాబడికి సంబంధించిన అనేకరకాల కార్యక్రమాలు, క్లిష్టమైన ఉపయోగ విధానాలు రైతులకు ఉపయుక్తమైనవి కావు.

## సాంఘిక ఆర్థికాది అంశాలు

ఆధునిక వ్యవసాయ పద్ధతులు మందకొడిగా అవలంబించబడడానికి గల కారణాలను దిగువ విధంగా అయిదు వర్గాల క్రింద విభజించవచ్చు:- సాంఘికమైనవి; ఆర్థిక సంబంధమైనవి; మనస్తత్వానికి సంబంధించినవి; ఈ ఆధునిక పద్ధతుల స్వరూప స్వభావాలు; విస్తరణ కార్యకర్తల సామర్థ్యం;

అభివృద్ధికరమైన వ్యవసాయ విధానాలు తక్కువగా అవలంబించబడడానికి ఆర్థికసంబంధమైన అంశాలేగాక సాహసంగా కొత్తపద్ధతులను చేపట్టడానికి రైతులు అంతగా యిష్టపడక పోవడం, అందుకు వారికి సామర్థ్యం లేకపోవడం ముఖ్యకారణాలు. అంతేగాక విస్తరణ కార్యకర్తలు జరిపే కృషిపైన కూడా ఇది ఆధారపడి వుంది. విస్తరణ పనుల ప్రమాణాన్ని పెంపొందించడం ద్వారామూ, రైతులకు పరపతి, పరికరాల వంటి సదుపాయాలను కల్పించడం ద్వారామూ ఆధునిక వ్యవసాయ పద్ధతులను కర్షకులచేత ఇతోధికంగా అవలంబింప జేయవచ్చు. అయితే సాంఘికమైన, మనస్తత్వానికి సంబంధించిన అంశాలు నేటికి అవి విడివిడిగా యిందుకు కారణాలు కావు. ఇవి ఒక

దానికి ఒకటితోడై ఆధునిక విధానాలు విస్తరించడానికి ప్రతిబంధకాలు కలిగిస్తున్నాయి. రైతులు నూతనసేద్య పద్ధతులను చేపట్టడానికి చేపట్టకపోవడానికి ఈ దిగువ అంశాల ప్రభావంవున్నట్లు కనిపిస్తుంది:—భూకమతాల పరిమాణం; విద్య; కొత్త సంగతులను గురించిన పరిజ్ఞానం; వీటి ప్రయోజనాలపట్ల నమ్మకం; ఆవశ్యకత; కొత్తప్రయోగాలు చేయడానికి సాహసం; విస్తరణ కార్యకర్తల నుంచి లభించే సహాయ పరిమాణం.

విస్తరణ కార్యకర్తలు తమ దృష్టినీ, శక్తినీ చాలా వరకు ఉత్పత్తిని పెంపొందించడానికి సంబంధించిన సాంకేతిక అంశాలలోనే కేంద్రీకరిస్తున్నారు. ఇది వాంఛనీయమే అనడంలో సందేహంలేదు. అయితే రైతు తాను వున్నటువంటి పరిస్థితులలో మార్పు సాంకేతికంగా సాధ్యమేనని గుర్తించేవరకూ ఈ మార్పులో చెప్పుకోదగిన అభివృద్ధి సాధ్యం కాదనే సంగతిని గమనించాలి. రైతు తన జీవన స్థాయి, పరిస్థితులపట్ల అసంతృప్తి చెంది అంతకు ఉన్నత స్థాయిని పొందగోరినప్పుడే ఈ గుర్తింపు సాధ్యమవుతుంది. అప్పటివరకు నిరీక్షించవలసిందే. రైతు ఆకాంక్షిస్తున్న ఉన్నత జీవన ప్రమాణానికీ, ప్రచారం చేయబడుతున్న ఆధునిక వ్యవసాయ విధానాలకూ మధ్య సన్నిహిత సంబంధం వున్నదనే సత్యాన్ని రైతాంగానికి తెలియజెప్పవలసిన గురుతరమైన బాధ్యత విస్తరణ కార్యకర్తలపైన వుంది.

పరిశోధనాగారాలలో సాగిన ప్రయోగాల సత్ఫలితాలుపంట పొలాలకు శీఘ్రంగానూ, సులభంగానూ విస్తరించడానికై వ్యవసాయదార్లకు విద్యాబోధన చేయడం చాలా అవసరం. మనదేశంలో రైతులలో నిరక్షరాస్యత ఎక్కువ కావడంవల్ల, భాషలు అధికం కావడంవల్ల ఈ సమస్య ప్రాధాన్యం వహిస్తున్నది. దేశంలో 1,200 భాషలు మాట్లాడుతారు. కాబట్టి రైతులకు వివిధ విషయాలు అందించడం ఒక పెద్ద సమస్య. ఆధునిక పద్ధతులను అవలంబించడం మెల్లగా జరిగే పనికాబట్టి, తక్షణ ఫలితాలను ఆశించ కూడదు. ప్రణాళికా బద్ధంగా, నిర్విఘ్నంగా, క్రమక్రమంగా సాగిపోవడమే ఇప్పుడు కావలసింది.

## ఎరువుల పంపిణీలో కొత్త పద్ధతి

నత్రజనికి సంబంధించిన ఎరువులు కొంత తేలిగ్గా లభ్యమౌతున్న దృష్ట్యా ప్రస్తుతం అమలులో వున్న ఎరువుల పంపకం విధానాన్ని ప్రభుత్వం పునః పరిశీలించి వెంటనే యీ దిగువ పేర్కొన్న విధానాన్ని ప్రవేశపెట్టింది. తిరిగి ఉత్తర్వులు వచ్చేవరకు యీ విధానమే అమలులో వుంటుంది.

(i) భారతప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వానికి కేటాయించిన ఎరువుల కోటా తెలియడంతోనే ఆ మొత్తాన్ని రాష్ట్రంలోని జిల్లాకు యింతింతని రాష్ట్ర వ్యవసాయశాఖ డైరెక్టరు కేటాయింపులు చేస్తారు. అమ్మకందార్లకు, ఎరువులను మిశ్రమంచేసే ఫర్మ్‌లకు, తదితర భారీవినియోగ దార్లకు కూడా ఆయనే ఎరువుల్ని కేటాయిస్తారు.

(ii) (ఎ) రాష్ట్రానికి కేటాయించబడిన మొత్తంలో [illegible] శాతం ఎరువులను జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాల ద్వారా పంపిణీ చేయడం జరుగుతుంది. జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాలు అందజేసిన మొత్తాన్ని ప్రాథమిక సహకార సంఘాలు వ్యవసాయ దారులకు ఎట్టి పర్మిట్లు అవసరం లేకుండానే అమ్ముతాయి. ప్రాథమిక సంఘాలు లేని చోట్ల జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాలే తమ డిపోలను ఏర్పాటుచేసి పర్మిట్లు అవసరంలేకుండానే రైతులకు అమ్ముతాయి. బ్లాకులకు, సంఘాలకు, గ్రామాలు మొదలైనవాటికి కలెక్టరే కేటాయింపులు చేసే ప్రస్తుతం పద్ధతి రద్దవుతుంది. జిల్లా మార్కెటింగ్ సంఘాలే కొన్ని ప్రాథమిక సంఘాలను ఎన్నికచేసి, ఆ సంఘాలకు ఎంతెంత మొత్తంలో ఎరువుల్ని యివ్వాలో నిర్ణయించుకుంటాయి. బ్లాకులకు, గ్రామాలకు ఎరువుల నిలవలను పంపిస్తాయి.

(బి) జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాలుగాని ప్రాథమిక సంఘాలుగాని తమకు కేటాయించిన ఎరువులను ప్రయివేటు వర్తకులకు గాని, ఎరువులను మిశ్రమం చేసే ఫర్మ్‌లకుగాని అమ్మవు.

(సి) జిల్లా హెడ్ క్వార్టర్సులో జిల్లాసహకార మార్కెటింగ్ సంఘాలు ఎరువులను నేరుగా వ్యవసాయదారులకు అమ్మవు. వాటికి కేటాయించిన ఎరువుల్ని ప్రాథమిక సంఘాలద్వారా అమ్ముతాయి. ప్రాథమిక సంఘాలు లేనిచోట్ల జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాలు నెలకొల్పిన చిల్లర దుకాణాలద్వారా యీ అమ్మకం జరుగుతుంది.

(డి) జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాలు తమ నిలవలను ప్రాథమిక సంఘాలకు పంపి, వాటి ద్వారా అమ్మకం జరిగేటట్లు సహకార సంఘాల రిజిస్ట్రారు చూస్తారు.

(iii) రాష్ట్రానికి కేటాయించిన మొత్తంలో 70 శాతం యీ విధంగా పంపిణీకాగా మిగిలిన 30 శాతాన్ని ప్రయివేటు వర్తకం నిమిత్తం కేటాయిస్తారు. అమ్మకం దారు లైసెన్సు కలిగివున్న వారికెవరికైనా ఈ ఎరువుల్ని కేటాయించ వచ్చు. వారు వీటిని పర్మిట్లు లేకుండానే రైతులకు అమ్మవచ్చు. ఈవిధంగా అమ్మకందార్లకు పంపిణీ చేసిన ఎరువులకు నిర్వహణ ఖర్చుక్రింద మెట్రికు టన్ను ఒక్కింటికి 10 రూ. చొప్పున వసూలు చేస్తారు. ఇదిగాక ఎరువుల అభివృద్ధినిధి క్రింద మెట్రికు టన్ను ఒక్కింటికి రూపాయిచొప్పునకూడా వసూలు చేస్తారు.

(iv) ఎరువులను మిశ్రమంచేసే ఫర్మ్‌లు ఆ ఎరువుల మిశ్రమంతోపాటు నేరుగా ఎరువులను అమ్మదలిస్తే అమ్మకందారు లైసెన్సుపొంది, ఆవిధంగా చెయ్యవచ్చు. అయితే వాటికి కేటాయించిన నత్రజని సంబంధమైన ఎరువులను మిశ్రమం తయారీలో ఉపయోగించాల్సి వుంటుంది. 1957 సం. పు ఎరువుల (కంట్రోలు) ఉత్తర్వు క్రింద ఎరువుల మిశ్రమం తయారీ, అమ్మకం విషయంలో పేర్కొన్న నియమ, నిబంధనలను తూ.చ. తప్పకుండా పాటించాల్సి వుంటుంది.

(v) 1957 సం. పు ఎరువుల (కంట్రోలు) ఉత్తర్వుకు లోబడి సహకార సంఘాలు, ప్రయివేటు వర్తకులు ఎరువుల అమ్మకం కొనసాగించాలి.

(vi) ఏ జిల్లాకు కేటాయించిన ఎరువులు ఆజిల్లాలోనే పంపిణీచేయాలి. వ్యవసాయశాఖ డైరెక్టరు అనుమతితో మాత్రమే జిల్లా వెలుపలికి ఎరువులను తీసుకొని వెళ్ళడం, అమ్మడం చేయాలి.

## బియ్యం, ధాన్యం తరలింపు

1965 సం. పు ఆంధ్రప్రదేశ్ బియ్యం, ధాన్యం (తరలింపు నిషేధం) ఉత్తర్వు క్రింద ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం యీదిగువ పేర్కొన్న విధంగా ఆరు మండలాలుగా విభజించబడింది—

- విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలు
- తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాలు
- గుంటూరు, నెల్లూరు జిల్లాలు
- చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలు
- మహబూబ్‌నగర్, హైదరాబాదు, నల్గొండ, ఖమ్మం, వరంగల్లు, కరీంనగర్, మెదక్, ఆదిలాబాదు జిల్లాలు
- నిజామాబాదు జిలా.

తగిన అధికారి వద్దనుండి పర్మిటు పొందితేనే తప్ప ఈ ఉత్తర్వుక్రింద ఏ వ్యక్తీ ఒక మండలంలోని ఏస్థలం నుంచయినా మరొక మండలంలోని మరే స్థలంలోకైనా బియ్యాన్ని గాని, ధాన్యాన్నిగాని తరలించడం, లేదా తరలించే ప్రయత్నం చేయడంగాని, లేదా ఈ విషయంలో యితరులకు తోడ్పడంగాని చేయరాదు.

## విశాఖజిల్లాలో సంకరజాతి జొన్న

విశాఖజిల్లాలో రబీ పంటకాలంలో రాగి పంటలో సాధించిన అభివృద్ధిని పురస్కరించుకుని ఖరీఫ్ పంట కాలంలో సంకరజాతి జొన్న వేసేందుకై ఒక ఉద్యమం ప్రారంభమైంది. ఇక్కడ 10,000 ఎకరాలలో సంకరజాతి మొక్కజొన్నను ఎంతో విజయవంతంగా పండిస్తున్నారు. ఈఉద్యమంవల్ల కృషితో నాస్తి దుర్భిక్షం అన్న విషయాన్ని రైతులు అర్థం చేసుకోవడానికి అవకాశం కలిగింది.

రైతులు తమ పొలంలో సంకరజాతి జొన్న విత్తులను నాటేటట్లు చేయడంలో గ్రామసేవకుల స్థాయి మొదలుకొని జిల్లాలోని అన్ని శాఖలూ సమిష్టిగా జరుపుతున్న కృషివల్ల రైతులకు కొత్త ఉత్సాహం, ఆశ కలిగాయి. వ్యవసాయ విస్తరణ శాఖాధికారులు, వి. ఎల్. డబ్ల్యుల సమిష్టి కృషే యీ ఉద్యమ విజయానికిని ప్రధానకారణం. వీరు ప్రతి రైతుకు విత్తనాలను అందజేస్తున్నారు. ఎరువులను, వ్యవసాయ పరికరాలను ఋణంలో రైతులకు తేలికగా లభింపజేస్తున్నారు.

సాధారణంగా జొన్న విశాఖ జిల్లాలో పండించబడుతుంటుంది. పెద్ద మొత్తంలో జొన్నను ఆధునిక పద్ధతుల్లో పండించడానికి అధికార్లు విశాఖ జిల్లాను ఎన్నుకోవడం సమంజసమైన పనే. ఈ జిల్లాలో సగం ఏజన్సీ ప్రాంతం. ఈ ఏజన్సీ ప్రాంతంలో జొన్నను పండించడం లేదు. ఇప్పుడు ఈ ప్రాంతంలో సంకరజాతి జొన్న, సంకరజాతి మొక్కజొన్నలను పండించే చర్యలు తీసుకుంటున్నారు.

సంకరజాతిజొన్న వేయడానికై జిల్లా అధికార్లు కొన్ని కొన్ని ప్రాంతాలను ఎంపిక చేశారు. ఎక్కువ భాగం భీమునిపట్నం, కోటౌరట్ల బ్లాకులలోనే వున్నాయి.

సంకరజాతిజొన్న వేసిన ప్రతి ప్రాంతంలోనూ మంచి ఫలితాలు వచ్చాయి. వచ్చే పంట కాలంలో కూడా దీనిని వేయాలని ప్రతి రైతు యిప్పుడు సంసిద్ధులౌతున్నారు. ఎరువులు వేయడం వల్ల వచ్చే ఫలితాలను కూడా రైతులు బాగా గుర్తించారు.

సంకరజాతిజొన్న సాగుకుగాను ఎకరానికి సుమారుగా రూ. 200—250 చొప్పున ఖర్చు పెట్టగా నికర లాభం రూ. 500 వచ్చింది.

ఈ విజయాన్ని పురస్కరించుకొని సంకరజాతి విత్తనాల అభివృద్ధి క్షేత్రాలను నెలకొల్పారు. ఇప్పుడు ప్రతి బ్లాకులోనూ అయిదు ఎకరాల్లో విత్తనాల అభివృద్ధి క్షేత్రం వుంది. మొత్తం 24 బ్లాకుల్లోనూ ఎనిమిది గిరిజన బ్లాకులతోసహా మొత్తం 16 బ్లాకులలో రైతుల్లో ఉత్సాహం, ఆనందం, కార్యదీక్ష వెల్లివిరిసాయి. గత కొన్నేళ్ళగా అనేకానేక కారణాల వల్ల అప్పులపాలై పోయినరైతులు భవిష్యత్తు వైపు ఆశతో చూస్తున్నారు. ఋణాలను కోటౌరట్ల వంటి ప్రాంతాలలో పెద్ద పెద్ద కమతాలుగల భూస్వాములు కూడా తమ పొలాలలో సంకరజొన్నను సాగుచేయడం ప్రారంభించారు.

## తూర్పుగోదావరిలో చిన్నతరహా నీటివనరులు

లింగవరం చెరువుకు,కాతివాడ, గెద్దాడలలోని ఆనకట్టకు సేద్యపునీటి మంత్రి శ్రీ శీలం సిద్దారెడ్డి ప్రారంభోత్సవం చేస్తూ తూర్పు గోదావరి జిల్లాలో, స్వాతంత్ర్యానంతరం 250 చిన్న సేద్యపునీటి పనులు చేపట్టబడ్డాయని తెలియజేశారు. వీటిలో యింకా 50 మాత్రం పూర్తి కావలసివుంది. లింగవరం చెరువుకు, కాతివాడ, గెద్దాడలలో ఆనకట్టకురూ. 5.21 లక్షలు ఖర్చు అయ్యింది. వీనివల్ల తూర్పు గోదావరిజిల్లాలోని గిరిజనులు నివసించే ఏజన్సీ ప్రాంతంలో 1,070 ఎకరాలకు సేద్యపు నీరు అందుతుంది.

గిరిజనులు విద్య, వ్యవసాయం, పరిశ్రమలు మొదలయిన రంగాలలో అభివృద్ధి చెందడానికై అవసరమైన చర్యలన్నింటినీ ప్రభుత్వం తీసుకోవాలని నిశ్చయించింది. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల్లోని ఏజన్సీ ప్రాంతాల సర్వతోముఖాభివృద్ధికై బృహత్పథకాన్నొకదాన్ని రూపొందించాలని కూడా ఆలోచిస్తున్నారు.

## తీవ్రతర వ్యవసాయాభివృద్ధి

దేశంలో తీవ్రతర వ్యవసాయాభివృద్ధి కార్యక్రమం క్రింద ఈ ఏడాది అయిదు జిల్లాలను ఎంపిక చేసినట్లు భారత ప్రభుత్వ వ్యావసాయిక ప్రాజెక్టు డైరెక్టర్ శ్రీ బి. డి. శాస్త్రి సెప్టెంబరు 29న రాయ్‌పూర్‌లో పాత్రికేయులకు తెలియజేశారు. అవి— రాయ్‌పూర్ (మధ్యప్రదేశ్), తంజావూరు (మద్రాసు), సంబల్‌పూర్ (ఒరిస్సా), పశ్చిమ గోదావరి (ఆంధ్రప్రదేశ్), లూధియానా (పంజాబు). ఈ జిల్లాలన్నింటిలో యీ ఏడాది వర్షాలు సమృద్ధిగా కురిసాయి. ఖరీఫ్ పంట వేసే తంజావూరు, పశ్చిమ గోదావరి, రాయ్‌పూర్, సంబల్‌పూర్ జిల్లాల్లో రెండు పంటల కార్యక్రమాన్ని ప్రారంభించినట్లు శ్రీ శాస్త్రి తెలియజేశారు.

## షాద్‌నగర్‌లో పాడిపశువుల అభివృద్ధి

మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్ ప్రాంతంలో పాడి పశువుల అభివృద్ధి నిమిత్తం 1966 మార్చి నుండి తీవ్రతర కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు. ఐదు సంవత్సరాలలో 33 శాతానికి దిగుబడిని అధికం చేయాలని ఉద్దేశించారు.

పాల దిగుబడిని అధికం చేసే దృష్టితో స్థానిక ఆవులకు జెర్సీ కోడెలతో సంకర సంపర్కాన్ని ఏర్పాటు చేస్తున్నారు. గేదెలకు ముర్రా జాతి ద్వారా కృత్రిమ గర్భోత్పత్తి కల్పిస్తూ పెంపొందిస్తున్నారు. 1966 మార్చిలో ప్రారంభించబడిన షాద్‌నగర్‌లోని ప్రాంతీయ పశువుల అభివృద్ధి యూనిటు యీ ప్రాంతంలోని దాదాపు 25000 ఆవుల పోషణ అవసరాలను తీర్చాల్సిఉంది.

పశుపోషణదారులకు శాస్త్రీయపద్ధతిలో పశుగ్రాసం తయారీ, అనుబంధ మిశ్రమ పశుగ్రాసం తయారీ విధానాలను తెల్పుతూ వాటిని ఉచితంగానూ, సబ్సిడీ రేట్లకూ సరఫరా చేస్తున్నారు. ఈ సంవత్సరం 80 ఎకరాలలో హైబ్రిడ్ నాపియర్ పశుగ్రాసం, 150 ఎకరాలలో లూసర్న్ పశుగ్రాసం సేద్యం చేశారు.

ఆరోగ్యకరమైన పశువుల కొష్టాలు, హైబ్రిడ్ పశుగ్రాసం ఉత్పత్తి నిమిత్తం బావుల త్రవ్వకం పనులకై పశుపోషణదారులకు ఋణాలు, సబ్సిడీలు మంజూరు చేశారు. అంటు వ్యాధులు ప్రబలకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవడం జరుగుతున్నది.

పాలకమీషనరు ఆధ్వర్యంలో షాద్‌నగర్‌లోని పాలఉత్పత్తి కేంద్రం, పరిసర గ్రామాల నుండి రోజూ పాలు సేకరించి హైదరాబాదుకు సరఫరా చేస్తున్నది. ఈ కేంద్రానికి 10,000 లీటర్ల ఉత్పత్తి శక్తి ఉంది.

## తైచుంగ్‌నేటివ్—1 పైరుకు వివిధ దశలలో నీటి అవసరం

తైచుంగ్‌నేటివ్—1 రకం వరి పైరుకు సంబంధించిన పొలాలలో అవసరానికి మించిన నీరు నిలువ చేసే తప్పుల్ని రైతులు మానుకోవాలి.

ఈ పైరు పెరుగుదలకు వివిధ దశలలో పొలాలలో నీరు కావాల్సి ఉంటుంది.

మొక్కలు నాటిన నాటినుండి వెన్నువేసే వరకు పొలాలలో దాదాపు 2 సెంటీమీటర్ల నీరు ఉంచాలి.

పైరు గరిష్ఠ పరిమితిలో కంకులు వేసిన తర్వాత పొలాలను పూర్తిగా ఎండబెట్టాలి. ఆ తర్వాత పూత కాలం నుండి గింజ గట్టిపడేవరకు పొలాలలో 5 సెంటీమీటర్ల నీరు ఉంచాలి.

అధిక దిగుబడి రకాలను ప్రవేశ పెట్టడం దృష్ట్యా, రైతులు సంవత్సరంలో ఒకదానికన్నా ఎక్కువ పైర్లు వేసే అవకాశం ఏర్పడింది.

ఒకటికన్నా ఎక్కువపైర్లు వేసే విధానాలను రైతులు యింతవరకు ఎక్కువగా అనుసరించడంలేదు. స్థానికరకాల పైర్లకు ఎక్కువకాలం పట్టడమే దానికి ప్రధాన కారణం. ఒక పైరు సిద్ధమయ్యే సమయానికి యితర పైర్ల సేద్యపు సమయం మించి పోతుంది.

ఇప్పుడు ప్రవేశ పెట్టిన అధిక దిగుబడి రకాలపైర్ల పెంపకం కాలపరిమితి చాలా తక్కువ. అంతేగాక వరి, జొన్న, సజ్జకుచెందిన అధిక దిగుబడి రకాలు ఋతుపరిణామాలకు అతీతమైనవి. సంవత్సరంలో ఏ కాలంలోనైనా యీ పైర్లను వేయవచ్చు.

స్థానికంగా లభించే స్వల్పకాలిక పంట విత్తనాల రకాలను రైతులు ఎన్నిక చేసికొని సంవత్సరంలో ఒకటికన్నా ఎక్కువ పైర్లను వేసే కార్యక్రమాన్ని అమలుజరిపాలి.

అధికరాలుబడి విత్తనాల రకాలను వినియోగించి రైతులు— ముఖ్యంగా నీటి పారుదల సౌకర్యం ఉన్న ప్రాంతంలోని రైతులు— సంవత్సరంలో ఒకటికన్నా ఎక్కువ పంటలను ఉత్పత్తి చేయవచ్చు.

## తైచుంగ్ నేటివ్-1 వరి అధిక రాలుబడికి ఎరువులు

తైచుంగ్ నేటివ్–1 వరి పైరువేసే రైతులు అధిక దిగుబడి నిమిత్తం, ఆయాప్రాంతాలకు తగిన విధంగా వివిధ పరిమాణాలలో ఎరువులను వాడాలి.

నారుమళ్ళలో 20 కిలోగ్రాముల కంపోస్టు, అరకిలో గ్రామ్ చొప్పున సూపర్ ఫాస్ఫేటు, అమోనియం సల్ఫేటువేయాలి. పైరు వేయడానికి సిద్ధంచేసిన క్షేత్రాలలో మొదటి హెక్టరుకు 60 క్వింటాళ్ళ ఎరువుమట్టి వేయాలి.

సాధారణంగా తైచుంగ్ నేటివ్–1 కు చెందిన పొలాలలో హెక్టరుకు 80 కిలోగ్రాముల నత్రజని, 50 కిలోగ్రాముల ఫాస్ఫోరిక్ ఆసిడ్, 45 కిలోగ్రాముల పొటాషు వాడాలి.

ఆ తరువాత ఆఖరుదశలో మూడింట నాలుగు వంతుల నత్రజని ఎరువులు, ఫాస్ఫేటు, పొటాసు మిగులు మొత్తం వేయాలి. ఇగురు వేసే దశలో మిగతా నత్రజని ఎరువువేయాలి.

ఈ పరిమాణంలో ఎరువులు వేసినప్పుడు హెక్టరుకు దాదాపు 9000 కిలోగ్రాముల దిగుబడి లభిస్తుంది.

## ఐ. ఆర్. 8 వరి

## తైచుంగ్ నేటివ్-1 కన్నా అధిక దిగుబడి రకం

తైచుంగ్ నేటివ్_1 రకంకన్నా ఎక్కువ దిగుబడియిచ్చే కొత్తరకం వరిని కనుగొన్నారు.

కొత్తరకం వరి ఐ. ఆర్. 8, దేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రయోగాత్మకంగా వేయబడుతున్నది. తైచుంగ్ నేటివ్_1 కన్నా యిది ఎక్కువరాలుబడి యిస్తున్నది.

ఐ. ఆర్. 8 వరికి, ఆకులపైవచ్చే తెగుళ్లు చాలా తక్కువగా వస్తాయి. అయినా ముందు జాగ్రత్తగా సస్యరక్షణ చర్యలు తీసుకోవాలి.

సంవత్సరంలో ఏ కాలంలోనైనా యీ పైరు వేయవచ్చు. ఖరీఫ్‌కాలంలో 125 నుండి 135 రోజులలోను, రాబీకాలంలో మరో 5 నుండి 10 రోజుల ఎక్కువ కాలంలోను పంట చేతికి వస్తుంది.

## ఉత్తమ ఫలితాలుయిచ్చే కొత్తరకం కందులు

150 కిలోగ్రాముల విత్తనాలు యివ్వగలగిన ఉత్తమమైన కొత్తరకం అర్హర్ (కందులు) ను కొత్త ఢిల్లీలోని భారత వ్యవసాయ పరిశోధన సంస్థ రూపొందించింది. దానిని కందులు, ఎస్_103 అంటారు.

పరిశోధన సంస్థలో హెక్టరుకు సగటున 1, 120 కిలోగ్రాముల విత్తనాలు ఉత్పత్తి అయ్యాయి.

కందులు ఎస్_103 తెగుళ్ళను తట్టుకుంటుంది. విత్తనాలు పెద్ద సైజులో గుండ్రంగా బూడిదరంగులో మెరుస్తూ ఉంటాయి. మొక్కలు ఎత్తుగా, నిటారుగా ఉంటాయి. అందువల్ల హెక్టర్లో ఎక్కువ సంఖ్యలో మొక్కలను పెంచవచ్చు.

## సహకార సేద్యం

అధికోత్పత్తి సాధనతో పాటు భూమిలేని వ్యవసాయ కూలీలకు ఉపాధికల్పించే దృష్టితో మూడవ ప్రణాళికా కాలంలో రాష్ట్రంలో వ్యవసాయ సహకార సంఘాలను ఏర్పాటు చేసే పథకాన్ని ప్రవేశపెట్టారు. 1967 మార్చి ఆఖరునాటికి బృహత్ ప్రణాళిక క్రింద కోస్తాసీమ ప్రాంతంలో 418 సంఘాలను, దివిసీమ ప్రాంతంలో 78 సంఘాలను ఏర్పాటుచేశారు. ఈ సంఘాలలో 30,906 మంది సభ్యులు ఉన్నారు. రు. 18.81 లక్షల మూలధనంతో నిర్వహించబడుతున్నాయి. ఈ సంఘాల పరంగా 31,800 ఎకరాల భూమి ఉంది. మూలధనంలో కొంత భాగాన్ని, ఋణాలు, సబ్సిడీలనూ యిస్తున్నారు. భూమి అభివృద్ధి, గోదాములు, పశువుశాలల నిర్మాణం వగైరా పనుల నిమిత్తం యీ సహాయం అందజేయబడుతుంది.

## యూరియా ఎరువుల ఫ్యాక్టరీ



విశాఖ లోని కోరమాండల్ఎరువుల కర్మాగారంలో 180 అ.ల యూరియా గోపురం

విశాఖపట్నంలోని కోరమాండల్ ఎరువుల ఫ్యాక్టరీలో 1967 నవంబరు ఆఖరునుండి యూరియా ఎరువును ఉత్పత్తిచేస్తున్నారు. ఈ యూనిటులో రోజుకు 400 టన్నుల యూరియా ఉత్పత్తి చేయగలుగుతారు. వరి, యితర ఆహార ధాన్యాలకు యూరియా ముఖ్యమైన ఎరువుగా ఉపయోగపడుతుంది. ఉత్పత్తిలోని కొంతభాగాన్ని పొలాలకు వినియోగిస్తారు. అధికభాగాన్ని అమోనియం ఫాస్ఫేటు తయారీ నిమిత్తం ఫ్యాక్టరీలోనే ఉపయోగిస్తారు.

కోరమాండల్ యూరియా యూనిటు భారతదేశంలో అతి ఆధునికమైనది. ఈ యూనిటులో 225 టన్నుల భారీ రియాక్టరు వుంది. అతిభారీదైన జిర్కోనియం లోహంతో దీనిని తయారుచేశారు.

ఆంధ్రప్రదేశానికి నవజీవన ప్రదాత

# హిందూస్తాన్ యంత్ర పరికరాల కర్మాగారం

ప్రమీలా నందా



హెచ్. ఎం. టి. కర్మాగారంలో ఒక దృశ్యం

(ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ, హిందుస్తాన్ యంత్ర పరికరాల సంస్థ అయిదవ కర్మాగారానికి హైదరాబాదులో ఆగష్టు 4వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. హైదరాబాదులోని కర్మాగారంలో 'హెచ్. ఎం. టి.' వారు, ప్రత్యేక ప్రయోజనానికి ఉపయోగించే యంత్రాలను ఉత్పత్తి చేస్తారు. ఈ వ్యాసంలో రచయిత్రి పేర్కొన్నట్లు, భారీ ఎత్తున ఉత్పత్తి సాగించడానికి ఈ యంత్రాలు బాగా ఉపకరిస్తాయి).

హిందూస్తాన్ యంత్ర పరికరాల సంస్థవారి ఐదవ కర్మాగారం హైదరాబాద్ సమీపాన కుకట్‌పల్లి అనేచోట, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉచితంగా ఇచ్చిన స్థలంలో ఏర్పాటయింది. రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన 850. యకరాల స్థలంలోనూ, 180 యకరాలలో ఫ్యాక్టరీ నిర్మాణమయింది. మిగతా ప్రదేశంలో సిబ్బంది ఇళ్ళ వాడ తయారవుతున్నది. మొత్తం 8 కోట్ల రూపాయలు ఖర్చయ్యే ఈ పథకానికి 1964 జూలైలో శంకుస్థాపన జరిగింది. నిర్మాణం మొదలయిన పన్నెండు నెలలకే, ఫ్యాక్టరీ భవనాలూ, సాంకేతిక నిర్వహణా విభాగమూ తయారయ్యాయి. సరిగ్గా 17 వ నెలకల్లా, 1965 డిసెంబర్‌లో ఉత్పత్తి ప్రారంభించేందుకు కర్మాగారం సర్వ సిద్ధమయినది.

ఫ్యాక్టరీ భవనంలో వేర్వేరు విభాగాలు, అత్యంత ఆధునికమైన శాస్త్రీయ పద్ధతుల కనుగుణంగా సరుకు సామగ్రులను ఇటూ అటూ చేరవేయడానికి ఎటువంటి ఆటంకమూ సలాభావమూ లేని విధంగా, ఉత్తరోత్తరా పెంచి చేటుకోవానికి వీలు ఉండేటుగా తయారయినై. సామాను చేరవేయడానికీ, సిబ్బంది రాకపోకలు సాగించడానికీ విడివిడిగా దారులు ఏర్పాటైనాయి. ఉత్పత్తి జరిగే చోట్లకు బాగా దగ్గరలోనే అందుకవసరమైన సామగ్రి గిడ్డంగులను కూడా ఏర్పాటు చేశారు — అనవసర కాలయాపన జరక్కుండా చూడడానికిది.

## ఫ్యాక్టరీలో వేర్వేరు విభాగాలు

లోహాన్ని కావలసిన కొలతల ప్రకారం కోసే విభాగమూ, ఇనుప రేకులతో సరుకులు చేసే విభాగమూ, తయారుచేసే రకరకాల పరికరాలకు నమూనాలు చేసే విభాగమూ సిద్ధంగా ఉన్నాయి. భారీరకం పోతసామగ్రి తయారీకి సంబంధించిన కొలిమి తయారు కావస్తున్నది. బాగా సునిశితమైన యంత్ర పరికరాలను చేసేందుకు కర్మాగారంలో దుమ్ము చేరకుండా చూడటమూ, ఉష్ణతను కావలసిన పరిమితికి మించకుండా చూడటమూ అవసరం. ఈ కర్మాగారంలో అట్లాంటి ఏర్పాట్లు చేశారు.

ఈ హైదరాబాద్ ఫ్యాక్టరీ, "స్పెషల్ పర్పస్" యంత్రాలను తయారు చేయడానికని నెలకొల్పారు కనుక, సుశిక్షితులైన మంచి అనుభవంగల సిబ్బందితో, నమూనాల విభాగం అంటూ ఏర్పాటవడం ఎంతో అవసరం. ఈ నమూనాల విభాగంలో దాదాపు 250 మంది పనిచేస్తున్నారు. ప్రతి యంత్రాన్నీ, దానిని కొనేవారి అవసరాల కనుగుణంగా రూపొందించవలసి ఉన్నది కనుక, ఇంతపెద్ద విభాగం అవసరమవుతుంది. దేశం మొత్తం మీద బాగా పెద్ద నమూనాల విభాగాలలో ఇది ఒకటి అవుతుంది.

ఏదయినా ఒక ఫ్యాక్టరీలో యంత్రాలవల్లా, పరికరాలవల్లా, పూర్తి ప్రయోజనం పొందాలీ అంటే వాటిని ఉపయోగించే సిబ్బందికి మంచి శిక్షణ ఇవ్వటం ముఖ్యం కనుక, ఈ హైదరాబాద్ యంత్ర పరికరాల కర్మాగారం ఇంకా ఏర్పడకముందుమంచే, సిబ్బందికి శిక్షణ సౌకర్యాలను కల్పించడమయింది.

...ల్ని ఈ కర్మాగారం తయారుచేస్తుంది. అందువల్ల మొత్తంలోనే మనకు విదేశీమారక ద్రవ్యం ఆదా కాగలదు. ఈ కర్మాగారానికి అవసరమైన యంత్రపరికరాలను జపాను నుంచి 'ఎన్' ఋణరూపంలో పొందడం జరుగుతున్నది.

## ఆదిలాబాదులో లఘుపరిశ్రమల అభివృద్ధి

ఆదిలాబాదు జిల్లాలో లఘుపరిశ్రమల అభివృద్ధికి ఒక తీవ్రతర కార్యక్రమం ప్రారంభించబడింది. నవంబరు 6వ తేదీన ఈ కార్యక్రమానికి రాష్ట్ర పరిశ్రమలశాఖా మంత్రి శ్రీ బి.వి. గురుమూర్తి నిర్మల్‌లో ప్రారంభోత్సవం చేశారు. లఘు పరిశ్రమల సర్వీసు సంస్థ యీ కార్యక్రమాన్ని, ఆదిలాబాదుజిల్లా పరిషత్తు సహకారంతోనూ, రాష్ట్ర పరిశ్రమల శాఖ డైరెక్టరేటు సహకారంతోనూ నిర్వహిస్తున్నది.

ఈ సంస్థ తాలూకు సంచారక వర్క్‌షాపు ఆదిలాబాదు జిల్లాలోని వివిధ ప్రాంతాలలో పర్యటించింది. ఈ వర్క్‌షాపులో వడ్రంగం, కమ్మర పని, తోలువస్తువుల తయారీకి సంబంధించిన తేలిక యంత్రాలు వున్నాయి. వస్తువుల ఉత్పత్తిని అధికంచేయడానికి, ఉత్పత్తి చేసే వస్తువుల నాణ్యతను పెంచడానికి ఏవిధంగా ఆధునిక విధానాలను అనుసరించాలో ప్రజలకు తెలియచెప్పడానికి యీ సంచారిక వర్క్‌షాపు సహాయ పడింది.

ఇంతవరకు యీ సంస్థ ఆంధ్రప్రదేశ్‌లోని 12 జిల్లాలలో తీవ్రతర ఉద్యమాన్ని అమలు పరిచింది. ఆదిలాబాదు జిల్లా పారిశ్రామికంగా బాగా వెనకబడివున్న కారణంగా యీ ఉద్యమం యీ జిల్లాలో ఒక ప్రత్యేకతను సంతరించుకున్నదని చెప్పవచ్చు.



రాష్ట్రప్రభుత్వ అనుమతిపొందిన గ్రంథం

# టోక్యో లేఖలు

ఆట్లూరి వెంకటేశ్వర రావు

## పిల్లల వినోదాలు

టోకియో,
15-9-1963

చిరంజీవులయిన బాబులకు మీతండ్రి దీవించి వ్రాయునది ఏమనగా—

మీరు వ్రాసిన ఉత్తరము అందినది. మీ ఇద్దరూ బాగా చదువుచున్నందుకు చాల సంతోషము. ఇదివరకటి ఉత్తరములో ఇక్కడి పిల్లల ఆటలు, విలాసయాత్రలు, పండుగ వేడుకలను గూర్చి వ్రాసెదనని చెప్పి ఉంటిని. ఇందులో ఆ విషయములను పొందుపరుస్తాను.

## చిన్న పిల్లలకు చిత్రమైన లోకం

ఈమధ్య చిన్నపిల్లల పార్కు సందర్శించితిని. ఇది చాల పెద్ద ఆవరణలో ఏర్పాటు చేయబడినది. ఇందులో చిన్నపిల్లల



బాలల చిత్రలోకం

ఆటలకు, విజ్ఞానానికి పనికివచ్చు సాధనాలన్నియు అమర్చబడె ఆ పరికరములను, సాధనాలను, పిల్లలు, పెద్దవారు కలసి ఉపయోగించి ఆనందిస్తారు.

పై ఛాయాచిత్రంలో ఒక పెద్దకప్పుసాసరును చూడవచ్చును. ఆ కప్పులో కూర్చుండుటకు సీట్లు ఉంటాయి. దానిలోకూర్చుండుటకు ప్రవేశ రుసుము ఉండును. ఒక్కొక్క కప్పులో ముగ్గురుగాని నలుగురు గాని కూర్చుండ వచ్చును. అన్ని కప్పులలోను పిల్లలు పెద్దలు ఎక్కిన పిదప ఆకప్పులన్నియు తమ చుట్టు తాము తిరుగుచు ఒక పెద్ద పరిధి చుట్టు తిరుగును. వాని వేగము కొద్దికొద్దిగా పెరుగుచు అత్యంత వేగముతో తిరిగి మరల కొద్దికొద్దిగా తగ్గుచు వచ్చి ఆగిపోవును అందులో కూర్చున్నచో ఒక వింత అనుభవము కలుగును పెద్దలకుకూడ భీతి కలుగును. కాని ఈ ఛాయా చిత్రములో ఇద్దరు చిన్నపిల్లలు తమంతట తామే కూర్చుని, భయములేకుండా ఆ అనుభవము పొందుతున్నారు దీనివలన వారి మనోధైర్యము, వారి తల్లిదండ్రుల మనోనిబ్బరము వ్యక్తమగుచున్నది ఇంత చిన్నవయస్సులోనే ఇటువంటి బ్రహ్మాండమయిన అనుభవములు పొందుటవలన వారికి భీతి అనిన యేమో తెలియదు. ఆత్మ విశ్వాసము దినదినాభివృద్ధి చెందును.

## వినోదాల సాహసాలు

వేరొకచోట కారునడిపినట్లు స్టీరింగు తిప్పుతూ కారును అనేక రోడ్ల గుండా తీసుకొని వెళ్ళినట్లు అనుభవించవచ్చును. ఇందులో కారుకు అనేక ఆటంకాలు వస్తాయి. ఈ ఆటంకాలన్నిటిని తప్పించుతూ కారును సురక్షితంగా గమ్యస్థానమునకు చేర్చవలెను. ఇంకొకచోట చిన్నకారు విద్యుచ్ఛక్తితో నడుపబడును. ఈ కారులో ఒక్కరుమాత్రమే కూర్చోవచ్చును. ఇటువంటివి సుమారు యిరువై కార్లను ఒక నిర్ణీత స్థలములో ఒకదానికి ఒకటి తగులకుండ నడుపవలెను. దీనిలో కూర్చున్న మామూలు కారులో కూర్చున్న అనుభవము కలుగును చిన్నవయస్సులోనే ఇటువంటి అనుభవములు సంపాదించిన పెద్దయిన పిదప ఎంత జన సమ్మర్దమయిన ప్రదేశాలలో నైనను సునాయాసముగా కారును నడుపగలుగుతారు. ఈదేశములో చాలామంది స్త్రీలుకూడ కార్లు, లారీలు, ట్రాక్టరులు, క్రేనులు నడుపుతారు. అందువలన స్త్రీ, పురుషులకు ఈ అనుభవము ఎంతో ముఖ్యము.

## వింత వింత అనుభవాలు

అక్కడే మరియొకచోట విమానములాంటి ఏర్పాటు ఉన్నది. దీనిలో పిల్లలు, పెద్దలు కూర్చోవచ్చును. విమానము ఆకాశములో ఎగిరినట్లుగా ఎగిరి అన్నిప్రక్కలకు తిరుగును. ఆ విమానములో ప్రయాణము చేసినట్లుగా అనుభవము కలుగును. ప్రక్కనే అతి వేగముగా ప్రయాణము చేయు విద్యుత్ శకటము ఉన్నది. ఇది పట్టాలపై ప్రయాణము చేయును. దీనిలో కూర్చుండి ప్రయాణము చేసిన ఒక ప్రత్యేకమయిన అనుభవము కలుగును. ఒక పెద్ద కొలనులో చాలా బోటులు ఉన్నవి. ఆ బోటులపైకూడ పిల్లలు,

ప్రయాణము చేయవచ్చును. రోలర్ స్కేటింగ్ రింగ్ వద్ద మెంతతో తయారయిన పెద్ద స్థలములో చక్రము అమర్చిన కాళ్ళ జోళ్ల తొడుక్కొని తిరగవచ్చును. కొంత అలవాటు పడువరకు సరిగా నిలుచుండుటే కష్టము. ఈ ఆటయందు కొంతనేర్పు చిక్కినచో అపరిమితమయిన ఆనందము కలుగును.

తుపాకితో గురినేర్చుకొనుటకు కొన్ని ఏర్పాట్లు ఉన్నవి. ప్రవేశ రుసుము చెల్లించినచో ఒక తుపాకి, కొన్నిగుండ్లు యిస్తారు. అనేక రకాల పక్షులు ఎగురుచున్నట్లు కొన్ని బొమ్మలు కదులు చుండును. బాగా గురిచూచి వాటిని కొట్టవలెను. ఇంకొకచోట అద్దాలతో కట్టబడిన ఇల్లు ఉన్నది. ఆ యింట్లో ప్రవేశించి బయటకు రావలెను. ఒకసారి ఆ యింటిలో ప్రవేశించిన తరువాత త్రోవ తెలియదు. మెల్లిగా వెతుక్కుంటూ బయటకు రావలెను. పిల్లలకు పెద్దలకు ఇది చాలా వింత అనుభవం.

## భయంకరమైన పాతాళగృహము

ఒక భూత గృహం ఉన్నది. కథలలోని పాతాళ గుహ లాగుండును. అక్కడ రకరకాల శబ్దాలు వినబడును. భయంకర మయిన అనుభవము కలుగును. కొన్ని అస్థి పంజరాలు చీకట్లో కనుపించును. కాళ్ళక్రింద మెట్లు జారినట్లుగా ఉండును. తిరుగు తున్నట్లుగా ఉండును. తిరుగుతున్న చక్రముపై నడపవలెను. భూతములు వస్తున్నట్లు ఉండును. ఇవి అన్నియు క్రొత్త అనుభవాలు. ఇక్కడ పిల్లందరు చిన్నవయస్సులోనే ఈవిధమైన విశేషాలన్నియుచూచి, అనుభవించెదరు. అందువలననే పెదలయిన పిదప భయమెరుగక, దృఢచిత్తులైన పౌరులుగా దేశపురో గమనానికి తోడ్పడుతారు. మీరందరు ఇట్టి అనుభవాలు ఎప్పుడు పొందుతారో?

## వినోద యాత్రలు

ఉపాధ్యాయులు తరచూ విద్యార్థులను వినోదయాత్రకు తీసికొని వెళ్తారు. అటువంటి యాత్రలలో విజ్ఞానంతోపాటు మనో వికాసం చెందుటకు అనువగు వాతావరణము కల్పించి విద్యార్థుల పురోభివృద్ధికి తోడ్పడతారు. ఈ పై ఛాయా చిత్రంలో అటు వంటి వినోద యాత్ర జరుపుతున్న విద్యార్థి బృందాన్ని చూడ వచ్చును. ప్రతి విద్యార్థి మెడలోను ఆ రోజుకు కావలసిన ఆహారము, నీరు కల సంచులు వ్రేలాడుటను చూడవచ్చును. విద్యార్థులందరూ ఒకేరకమయిన దుస్తులను ధరించుట గమనించ వలెను.



విహారయాత్రకు వెళ్తున్న బాలబాలికలు

## జపాను జంతు ప్రదర్శనశాల

టోకియో పట్టణంలో చాల పెద్ద జంతు ప్రదర్శనశాల ఉన్నది. దానిలోని జంతువులను చూపించుటకు పిల్లలను తల్లి దండ్రులు వెంటపెట్టుకొని తీసుకొని వస్తారు. చిన్నపిల్లలను గుఱ్ఱములపై ఎక్కించి త్రిప్పుతారు. ఇక్కడ మనదేశం నుండి



జంతు ప్రదర్శనశాల

జపాను దేశపు పిల్లలకు బహుమతిగా పంపిన చిన్న ఏనుగు కూడా ఉన్నది. దీనివద్ద పిల్లలు గుంపులు గుంపులుగా చేరి, చూచి ఆనందిస్తారు. చాలమంది పసిపిల్లలను వెంట తీసుకొని వస్తారు. ఆ పసిపిల్లలను ప్రదర్శనశాల చుట్టు త్రిప్పుటకు చక్రపుబండ్లు అద్దెకు ఇస్తారు.

## మనోహరమైన వనాల మధ్య ముద్దొచ్చే బాలబాలికలు

టోకియో పట్టణము చుట్టూ అనేక పెద్ద ఉద్యాన వనాలు గలవు. వానిలో చాల అందమయిన దృశ్యాలున్నవి విద్యార్థులు తీరిక వేళల్లో ఆ ఉద్యాన వనాల్లోనికి వెళ్ళి ఆ దృశ్యాలను తిలకించి చిత్రాలను తయారుచేస్తారు. ఈ దిగువ ఛాయా చిత్రంలో అట్టి విద్యార్థులను చూడవచ్చును. ఈ విద్యార్థులు ఏకాగ్రచిత్తంతో తమ పనిలో నిమగ్నులై ఉన్నారు. చుట్టు ప్రక్కల వాతావరణం గాని, జనసమర్దంగాని వారి దృష్టిని మరల్చదు ఉదాహరణకు ఈ ఛాయా చిత్రం తీసినట్లుగా వారికి తెలియనే తెలియదు. మీరు కూడా ఇటువంటి ఏదేని దీక్ష కలిగియుండుటకు కృషి చేయవలెను.





చిత్రాలు వేయడంలో నిమగ్నులైన విద్యార్థులు

## పెద్దలకు పిన్నలకు ఒకటే ధర

తీరిక వేళల్లో చిన్నపిల్లలు తమ తల్లిదండ్రులకు వీలయిన సహాయము చేస్తారు. బజారుకు వెళ్ళి ఇంటికి కావలసిన సామాను లన్నీ కొని తెస్తారు. ఇక్కడి దుకాణాలలో పిల్లలు వెళ్ళినను పెద్దలు వెళ్ళినను ఒకేధర చెప్తారు. చిన్నపిల్లల ఎక్కువ డబ్బులు తీసికొనుట జరుగదు. అందువలన తల్లిదండ్రులు పిల్లలను ఎక్కువగా ఇట్టి పనులకు పంపుతారు. మీరు కూడా అట్లే మీ బాధ్యతలను నిర్వహిస్తారని ఆశిస్తున్నాను.

## అందరు కలిసి ఆనందించే పండుగలు

వీరికి కూడా మన వలెనే అనేక పండుగలు గలవు. మన దీపావళి వలెనే వీరికి కూడ ఒక పండుగ గలదు. ఆ పండుగనాడు వీరు కూడా బాణసంచా కాలుస్తారు. కాని మన మాదిరిగా ప్రతి యింటా బాణసంచా కాల్చరు. ముఖ్యంగా వీరి యిండ్లన్నియు కొయ్యతో కట్టబడి యుండుటవలన వీరికి అగ్నిభయము ఎక్కువ. అందువలన అందరూ ఒక మైదాన ప్రదేశంలో సమావేశమై కొందరు బాణసంచా కాలుస్తుండగా అందరు చూచి ఆనందిస్తారు. ఇక్కడి ప్రజలు మనమాదిరిగానే ఆచార పరాయణులు. ఇదివరకు అగ్నిపర్వతములు మంటలను వెదజల్లుట వలన దేశములో చాలా నష్టములు సంభవించినవి గాన అగ్నిదేవుని శాంతింపజేయుటకు సంవత్సరమునకు ఒకసారి పూజలు జరుపుతారు. ఆ రోజున ప్రతి ఇంటి ముందు చిన్న కుంపట్లో బొగ్గులు వేసి మంటలు చేస్తారు. అట్లు చేసినచో అగ్నిదేవుడు సంతోషించి, నష్టము రాకుండా చూస్తాడని వారి నమ్మకము.

## జపానులో కూడా బొమ్మల కొలువులు

వీరికి కూడా బొమ్మల కొలువులు ఉన్నవి. ఆ రోజుల్లో చిన్నపిల్లలందరూ చేరి బొమ్మల కొలువులు ఏర్పాటుచేసి వేడుకలు జరుపుకొంటారు. వీరికి సంవత్సరాది చాలా పెద్ద పండుగ. ఆ రోజున అందరు క్రొత్త వస్త్రాలను ధరించి దేవాలయానికి వెళ్ళి దేవుని ప్రార్థిస్తారు. సామాన్యంగా వారు పాశ్చాత్య దుస్తులను ధరించినప్పటికీ ఆ రోజున మాత్రం వారి జాతీయ దుస్తులను ధరిస్తారు. ఈ దుస్తులు చాలా విలువైనవి. వాటి అలంకరణకు కొన్ని గంటలు పట్టును. అందువలన ఈ దుస్తులను సంవత్సరమునకు ఒక్కరోజునే వాడతారు.

ఇట్లు

మీ ప్రియమైన నాన్న.

---

## జనసంబంధ శాఖ ప్రచురణలు 1967

(1) ప్రగతి కోసం పరిశ్రమలు (2) శ్రమజీవుల సౌభాగ్యం (3) బంగారు పంటలు (4) ఆరోగ్యమే మహా భాగ్యము (5) విద్య (6) పంచాయతీ రాజ్యంలో ప్రజలే పాలకులు (7) సాంఘిక సంక్షేమం (8) మన రహదారులు (9) మన జలసంపద (10) విద్యుచ్ఛక్తి (తెలుగు) (11) మీకు తెలుసా? (ప్రశ్నలు జవాబులు) (తెలుగు; ఇంగ్లీషు) (12) మన మంత్రులు (ఇం) (13) తెలుగులోకి (ఫోల్డర్) (ఇం, తె) (14) పౌర సంబంధ, సమాచారశాఖ డిమాండు 1967-68 (ఇం, తె.) (15) నాగార్జున సాగర్ (సావనీర్) ఇం, తె (16) నాగార్జున సాగర్ ఆయకట్టు అభివృద్ధి పథకం (కరపత్రం) (తె) (17) నాగార్జున సాగర్ (జాషువా గేయకవిత) తె. (18) ఆంధ్ర ప్రదేశ్ (ఫోల్డర్) (ఇం) (19) అఖిల భారత పత్రికా సంపాదకుల మహాసభ సావనీర్ (ఇం) (20) అంధత్వనివారణ దినోత్సవం ఫోల్డర్ (తె) (21) నెహ్రూ జూలాజికల్ పార్క్ (ఫోల్డర్) (ఇం).

# చరిత్రను సృష్టించిన జడచర్ల



వెసెక్టమీ శిబిరంలో గవర్నరు

"ఈనాడు ప్రపంచానికి బాంబులు, బిడ్డలు పెద్ద బెడదగా పరిణమించారు" అని ఇటీవలనే ఒకరు మిత్రరాజ్య సమితిలో పేర్కొన్నారు. భారతదేశంలో ప్రతి ఒకటిన్నర సెకన్లకూ ఒక శిశుజననం జరుగుతున్నది. ఇదేదో అతిశయోక్తికాదు. అక్షరాలా జరుగుతున్నదిది. ఈ లెక్కన యేటా రెండుకోట్ల పదిలక్షలమంది శిశువులు జన్మిస్తున్నారు. అంటే 365 రోజుల కాలంలో ఆస్ట్రేలియా జనాభాకు రెట్టింపు జనాభా మన దేశంలో పెరిగి పోతున్నదన్నమాట. అయితే మనదేశంలోని వనరులు, ఇంత తీవ్రస్థాయిన హెచ్చుతున్న జనాభా అవసరాలను ఆదుకోవలేక పోతున్నాయి. ప్రణాళికా బద్ధమైన కార్యక్రమాల ద్వారా చేకూరుతున్న ప్రయోజనాలు ఈ జనాభా పెరుగుదలవల్ల దృగ్గోచరం కాకుండా పోతున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని ఒక చిన్నపట్టణం జడచర్ల. నవంబరు 20వ తేదీన ఈ పట్టణం చరిత్ర సృష్టించింది. మహబూబ్‌నగర్ జిల్లాలోని తాలూకా కార్యస్థానం ఇది. ఇచ్చట ఒకేరోజున 1560 వెసెక్టమీ సంతాన నిరోధక శస్త్ర చికిత్సలు జరిపి భారతదేశంలో క్రొత్త ప్రమాణాన్ని నెలకొల్పారు. ఈ పట్టణంలో ఏర్పాటైన కుటుంబ నియంత్రణ శిబిరంలో ముప్పైమంది డాక్టర్లు, అనేకమంది వైద్య ఉద్యోగులు దీక్షతో పనిచేసి ఈ కార్యాన్ని అద్భుతంగా సాధించారు. ఇంతకుపూర్వం రాష్ట్రంలో రోజుకు ఇలాంటి శస్త్రచికిత్సలను 820 చేయడం గరిష్ట ప్రమాణంగా వుండేది. జడచర్లకు కొన్ని మైళ్ళదూరంలో మహిళలకు క్రొత్తరకం గర్భనిరోధక శస్త్రచికిత్స(ట్యూబెక్టమీ)శస్త్రచికిత్సలు జరిపారు. మహిళాడాక్టర్లు ఇతర వైద్యసిబ్బంది అసాధ్యమైనదిగా కనిపిస్తున్న దానిని సుసాధ్యం చేయాలన్న దృఢసంకల్పంతో, కార్యదీక్షతో కదిలి వచ్చారు. గర్భనిరోధక శస్త్రచికిత్స చేయించుకోవడానికి ముందుకు వచ్చిన మహిళలు_నిరక్షరాస్యులు, నిరాడంబరులు_శాంతియుతంగా, క్రమశిక్షణతో మెలిగారు. తెలంగాణాప్రాంతంలో ఇటువంటి శిబిరం జరగడం ఇదే ప్రథమం. శిబిరంలోని స్కోరుబోర్డుపైన అంకెలు గంటగంటకూ పెరుగుతూపోయాయి. ఈ శిబిరంలో నవంబరు 20వ

మహబూబ్‌నగర్ జిల్లాలోని ఒక చిన్న పట్టణం జడచర్ల. నవంబరు 20వ తేదీన ఈ పట్టణం చరిత్రను సృష్టించింది. ఇచ్చట నిర్వహించిన కుటుంబ నియంత్రణ శిబిరంలో ఒకే రోజున 1560 వెసెక్టమీ సంతాన నిరోధక శస్త్ర చికిత్సలు జరిపి భారతదేశంలోనే క్రొత్తప్రమాణాన్ని నెలకొల్పారు.

తేదీన 44 ట్యూబెక్టమీ గర్భనిరోధక శస్త్రచికిత్సలు జరిపారు. ఒకేరోజున యింత అధికసంఖ్యలో యిలాంటి శస్త్ర చికిత్సలు జరపడం మున్నెన్నడూ జరగలేదు. దీనితో ఇది ఏమంత భారీ ఠికానికిచెందిన శస్త్రచికిత్స కాదనే విషయం ప్రపంచానికీ, వైద్య జగత్తుకూ నిరూపితమైంది.

జడచర్లలో నిర్వహించిన శిబిరం విజయవంతం కావడానికి ప్రజల దృక్పథంలో వచ్చిన పరివర్తన ప్రధాన కారణం. ఇది శుభావహమైన పరిణామం. నాగన్న కాయకష్టంచేసే కర్షకుడు. నలుగురు బిడ్డలతండ్రి. ఆర్థిక కారణాలవల్ల అతను తన సంతాన వృద్ధిని అంతటితో ఆపుచేయదలుచుకున్నాడు. కొద్దిగా భూవసతిగల బడుగురైతు వీరారెడ్డి. ఈడువచ్చిన తన ఇద్దరు కుమార్తెల వివాహం చేయడానికైనా తన ఆస్తి సరిగా చాలదని అతని విచారం. శ్రీనివాసరావు బడిపంతులు. ఆయనకు నాలుగు సంవత్స రాల ప్రాయంగల పండువంటి ఒకే ఒక కొడుకు వున్నాడు. అయినప్పటికీ జనాభా పెరుగుదలను అరికట్టడంలో యథాశక్తి తోడ్పడటానికి ఆయన కంకణం ధరించాడు.

క్షయవ్యాధితో బాధపడుతున్న తన భార్య ఆరోగ్యమే. ఇద్దరు పిల్లలుగల ఒక తండ్రికి ప్రధానం. ఇద్దరు పుత్రికలుగల ఎన్. జీ. ఓ. మూర్తిరాజు "ధరల పెరుగుదలవల్ల సంభవించిన ఆర్థికదుస్థితి, మధ్యతరగతి, ఆ క్రింది తరగతులవారు ఎదుర్కొన వలసివస్తున్న" ఇక్కట్లను గురించి ఏకరువు పెట్టాడు. తన ఇద్దరు భార్యలమధ్య సౌహార్ద్రమును పెంపొందించడమే ఒక ఆసామి ప్రధాన సమస్య. మొదటి భార్యకు ముగ్గురు కూతుర్లు, రెండవ భార్యకు ఒక కుమారుడు ఉన్నారు. మహిళలు సహజంగా మితభాషిణులు. అయితే ఆరోగ్యశాఖ సిబ్బంది తెలిపిన వివరాలు వారిని ప్రభావితులను చేశాయి. వారి ఉద్బోధవల్ల ఒక నిర్ణయానికి రాగలిగినారు. రొక్కం బహుమతులను ఒక లంబాడీ స్త్రీ ఎంతో శ్లాఘించింది.

ఆంధ్ర ప్రదేశ్‌లో కుటుంబ నియంత్రణ కార్యక్రమం తీవ్ర రూపంలో అమలు జరగకున్నా నిరాశాజనకంగా మాత్రంలేదు. 1966_67వ. సం. లో ఆంధ్ర ప్రదేశ్‌లో 56,624 సంతాన నిరోధక శస్త్ర చికిత్సలు చేశారు. అఖిల భారత స్థాయిలో యీ విషయంలో ఆంధ్ర ప్రదేశ్ ఆరవస్థానం ఆక్రమించింది. ఇక్కడ 58,243 లూపులు అమర్చారు. ఈవిషయంలో అఖిలభారత స్థాయిలో 7వ స్థానం లభించింది. శస్త్రచికిత్స విషయంలో మద్రాసుకు అగ్ర స్థానం లభించగా లూపులు అమర్చేవిషయంలో మహారాష్ట్ర గర్వ ప్రదమైన స్థానం సంపాదించింది. కుటుంబ నియంత్రణకై రెండవ ప్రణాళికలో రూ. 16.16 లక్షలు కేటాయించబడగా మూడవ ప్రణాళికలో రూ. 88.80 లక్షలు కేటాయించారు. మూడవప్రణాళిక ఆఖరు నాటికి ఆంధ్ర ప్రదేశ్‌లో 61 పట్టణ కుటుంబ నియంత్రణ క్లినిక్కులు, 306 గ్రామీణ క్లినిక్కులు ఉన్నాయి. వాటికి తోడు 20 కుటుంబ నియంత్రణ సమాచార కేంద్రాలుకూడ నిర్వహించబడు తున్నాయి.

కొంతకాలంగా, యీ శిబిరాల నిర్వహణ ప్రజలదృష్టిని ఆకర్షిస్తున్నది. కృష్ణాజిల్లా గన్నవరంలో నవంబరు 17తో ఆఖరు [illegible] ఆంధ్ర ప్రదేశ [illegible]

అయిన 17 రోజుల శిబిరం నిర్వహణ కొత్త రికార్డుల[illegible] చింది. 2101 ట్యూబెక్టమీ, 412 వెసెక్టమీ శస్త్రచికిత్సలు నిర్వహిం చడం జరిగింది. గన్నవరం తాలూకా తేలప్రోలు గ్రామంలో నూటికి నూరు శాతం శస్త్రచికిత్సలు నిర్వహింపబడి గర్వించదగిన స్థానం ఆక్రమించింది. ప్రప్రథమంగా నిర్వహింపబడిన యీ శిబిర కార్య క్రమం విజయవంతం కావడంలో లభించిన ప్రోత్సాహంతో రాష్ట్ర ప్రభుత్వం, నెలకు 90,000 శస్త్రచికిత్సలు జరిపే బృహత్తర కార్యక్రమాన్ని డిసెంబరు నుండి ప్రారంభిస్తున్నది. ఈ విష యంలో కేంద్ర ప్రభుత్వం నెలకు 13000 శస్త్రచికిత్సలు కోటాగా నిర్ణయించింది.

దివాకరుడు పడమటి దిశను దూరపు కొండలలో అదృశ్యమై చీకటి తెరలు చిక్కబడుతున్నప్పటికీ చికాకులేకుండా డాక్టర్లు తమ థియేటర్లలో ఆపరేషన్ పనులలో నిమగ్నులై వున్నారు. శిబిరానికి మైలు దూరంలో నల్లని చీకటిలో తెల్లగా కనబడుతున్న రహదారి బంగళాకు నేను వెళ్తున్న సమయంలోకూడా ఆపరేషనులు ముమ్మరంగా సాగుతూనే ఉన్నాయి. ఆలోచనలతో నిండిన నా మస్తిష్కంలో ముఖ్యమైన మూడు ఆలోచనలు ముందుకు వచ్చాయి. ప్రభుత్వోద్యోగులు కూడా చైతన్యంతో తమ పనులు సమర్థంగా చేయగలుగుతారు. పంచాయతీరాజ్ సంస్థల సిబ్బంది వాస్త వంగా దిగువస్థాయి ప్రజలతోకూడా అతి సన్నిహిత సంబంధాలుకలిగి ఉన్నారు. అన్నిటికన్నా ముఖ్యంగా సరైన మార్గంలో సరైన విధంగా వ్యవహరిస్తే ప్రజలు కాలంతో సమానంగా పరుగెత్తగలుగు తారు. ముఖ్యమైన యీ మూడు అంశాలు ఆధారంగా ఏ కార్య క్రమాన్ని అయినా విజయవంతంగా నిర్వహించవచ్చు.

---

భారతప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి 1967 సెప్టెంబరు 16వ తేదీన దేశానికిచ్చిన సందేశంలో దేశ ఆర్థికాభివృద్ధి, కుటుంబ నియంత్రణ విజయంమీద ఆధారపడి వుందనీ, కుటుంబం చిన్నదిగా, సుఖసంతోషాలకు ఆలవాలమైనదిగా వున్నప్పుడు దేశం సర్వతో ముఖాభివృద్ధి చెందుతుందనీ, సంపత్సమృద్ధితో తుల తూగుతుందనీ అన్నారు.

*ప్రధాని తమ సందేశంలో యింకా ఈ విధంగా అన్నారు.—*

" ప్రతియేటా మనదేశంలో రెండుకోట్ల ఒకలక్షమంది పుడుతున్నారు. ఎనభై లక్షలమంది మరణిస్తున్నారు. అందుచేత ఏటా కోటీముప్పయ్ లక్షలచొప్పున జనాభా పెరుగుతోంది.

స్వాతంత్ర్యంవచ్చిన యీ రెండు దశాబ్దాలలోనూ వ్యవ సాయ, పారిశ్రామిక రంగాలలో మనం అమోఘమైన విజయాలను సాధించాం. అయినా స్వయం సమృద్ధి స్థితికి చేరుకోలేక పోయాం. ఇది ఎందువల్ల? ఈమధ్యకాలంలో మన జనాభా పదకొండు కోట్ల ఆరులక్షలు అధికమైంది. అందువల్ల.

జీవితంలోని సుఖాలనీ, సంపదనూ, చక్కటి జీవితాన్నీ తమ బిడ్డలకు ప్రసాదించాలనుకోని తల్లిదండ్రులు లోకంలో వుంటారా? సుఖంగా, హాయిగా పెరిగే కుటుంబంలో పుట్టగూడ

...తలుపెడదాం? రానున్న కొత్త తరానికి సుందర భవిష్య త్తందజేయాలని ప్రభుత్వం విశేషించి కృషిచేస్తోంది. ఆ కృషిలో ప్రధానమైన భాగమే జనాభాపెరుగుదలను అరికట్టడం. ఈనాడు మనదేశంలో జననాల రేటు ఏడాదికి వెయ్యిమంది జనాభాకు 41 చొప్పునవుంది. ఈ రేటును సాధ్యమైనంతత్వరగా 25కు తగ్గించాలి. 1951లో మరణాలరేటు 27 వుండగా యీనాడు అది 16 మాత్రమేవుంది. అందువల్ల యీనాడు మనం శాస్త్రవిజ్ఞానాన్ని ఆధారంచేసుకుని జననాలరేటును కూడా తగ్గించాలి. అందువల్లనే కుటుంబ నియంత్రణను మనం జాతీయ సమస్యగా పేర్కొంటున్నాం. ఈ కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని దేశమంతటా అమలు పరచాలి.

ప్రతిగ్రామానికి, ప్రతి కుటుంబానికి కుటుంబ నియంత్రణ సౌకర్యాన్ని కలిగించే బాధ్యత ప్రభుత్వానిది. ప్రతి కుటుంబం చిన్నదిగా వుండాలని చాలామంది ప్రజలు ఈనాడు గుర్తించారు. సంతోషం. ఇవ్వాళనుంచి దేశమంతటా జాతీయ స్థాయిలో కుటుంబ నియంత్రణ పక్షోత్సవం ఆరంభమైంది. ఈ పక్షోత్సవ సందర్భంలో ప్రభుత్వం కల్పించే అవకాశాలను వినియోగించుకో వలసిందిగా తల్లిదండ్రు లందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను. కుటుంబ నియంత్రణకేంద్రాలను సందర్శించండి. అక్కడి డాక్టర్ల సలహాలను పొందండి. ఆ సలహాలను పాటించండి. ఇంతవరకు మీరు మీ పరిమిత కుటుంబ విషయమై డాక్టరుతో సంప్రదించక పోతే ఈ రెండు వారాలలోనూ తప్పక సంప్రదించండి

కుటుంబ నియంత్రణ విజయంమీదే ఆర్థికాభివృద్ధి ఆధారపడి వుంది. మన దేశమే ఒక పెద్దకుటుంబం. వ్యక్తిగత కుటుంబాలు ఆనందానికీ, సుఖశాంతులకూ నిలయాలైతే మొత్తం దేశమే అభివృద్ధి చెందుతుంది. ఐశ్వర్యవిలసిత మౌతుంది. సుఖప్రదమైన పరిమిత కుటుంబాలూ, సంపత్సమృద్ధమైన దేశమూ రూపొందించు కోవడమే మన లక్ష్యంగా పెట్టుకుందాం."

## భీమడోలు సమితిలో కుటుంబ నియంత్రణ ఉప కేంద్రాలు

ఆరు కుటుంబ నియంత్రణ ఉపకేంద్రాలను నిర్మించడానికి భీమడోలు పంచాయతీ సమితి స్థాయీసంఘం రూ 42,000 లు మంజూరు చేసింది.

## కొత్తూరు పంచాయతీసమితిలో కుటుంబ నియంత్రణ శిబిరం

శ్రీకాకుళంజిల్లా, కొత్తూరు పంచాయతీ సమితికి చెందిన బత్తిలి, శ్రీముఖలింగం, కొత్తూరు గ్రామాలలో అక్టోబరు 26నుంచి 28 వరకు మూడురోజులపాటు ఏర్పాటు చేయబడిన కుటుంబ నియంత్రణ శిబిరాలలో 871 మంది పురుషులకు వెసెక్టమీ శస్త్ర చికిత్సలు జరిపారు. ఈమూడురోజులలో పెక్కలిలోని ప్రభుత్వ ఆసుపత్రిలో 400 పైగా వెసెక్టమీ, శస్త్రచికిత్సలు జరిపారు.

## జూలూరులో కుటుంబ నియంత్రణ శిబిరం

జూలూరు గ్రామంలో వెసెక్టమీ శస్త్రచికిత్సలు చేయించుకున్న వారికి ప్రోత్సాహక బహుమతులను అక్టోబరు 27న నల్గొండజిల్లా కలెక్టరు శ్రీ ఎం చంద్రమౌళిరెడ్డి పంపిణీచేశారు. సమితి యిప్పుడు ఎసి లక్ష్యాన్ని సాధించగలిగినదనీ, మరిన్ని కుటుంబాలను కుటుంబ నియంత్రణ కార్యక్రమం క్రిందకు తీసుకు రాగలమనీ శ్రీ టి. లక్ష్మారెడ్డి కలెక్టరుకు హామీ యిచ్చారు. నల్గొండజిల్లా పరిషత్తు ఛైర్మన్ శ్రీరామకృష్ణారెడ్డి యీసందర్భంలో ప్రసంగిస్తూ సమితి అధ్యక్షునికృషిని శ్లాఘించారు.

## చిత్తూరుజిల్లాలో కుటుంబ నియంత్రణ ఉద్యమం

చిత్తూరుజిల్లాలో 1966 జనవరి నుంచి 1967 ఆగస్టు వరకు 1500 వెసెక్టమీ శస్త్రచికిత్సలు, జరిగాయి. 2000 లూపులు అమర్చడం జరిగింది.

## సంగం జాగర్లమూడిలో వెసెక్టమీ శిబిరం

సంగం జాగర్లమూడిలో ఏర్పాటు చేసిన కుటుంబ నియంత్రణ శిబిరంలో నవంబరు 11వ తేదీన 200 వెసెక్టమీ శస్త్రచికిత్సలు నిర్వహించారు. ఈ శిబిరానికి జిల్లా కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు. గుంటూరు, తెనాలి పట్టణాల నుండి ప్రయివేటు డాక్టర్లు వచ్చి స్వచ్ఛందంగా తమసేవలను అందజేశారు. అన్ని పంచాయతీ సమితులలోనూ ఒక ప్రత్యేకమైన ఉద్యమాన్ని ప్రారంభించడం జరిగిందనీ 1967 డిసెంబరు మాసాంతానికి గుంటూరుజిల్లాలో సుమారు 10 వేల శస్త్రచికిత్సలు జరుగుతాయనీ కలెక్టరు తెలియజేశారు.

# మహిళా సంక్షేమ శాఖ

శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా
డైరెక్టరు, మహిళా సంక్షేమశాఖ

(ఈ నెలనుండి మహిళా సంక్షేమశాఖ కార్యక్రమాల వివరాలను, తీరు తెన్నులను వరుసగా ప్రారంభిస్తున్నాము. రాష్ట్రంలో యీ శాఖ నిర్వహిస్తున్న సంక్షేమ కార్యక్రమాలను యీ వ్యాస పరంపరలో వివరించడం జరుగుతుంది. ఈ నెల వ్యాసంలో మహిళా సంక్షేమశాఖ లక్ష్యాలు, కార్యవిధానాలు చెప్పడం జరిగింది.—సం.)

స్వాతంత్ర్యం లభించిననాటినుండి జాతీయ ప్రభుత్వం సంక్షేమ రాజ్య స్థాపనకు కృషిచేస్తున్నది. సంక్షేమం యొక్క నిర్వచనం రోజు రోజుకు విస్తృతి మవుతున్నది. సోషలిస్టు పద్ధతి రాజ్యాన్ని నెలకొల్పడమే నేటి లక్ష్యం.

అందువల్లనే ప్రణాళికలద్వారా సాధ్యమైనంత త్వరలో దేశంలోని వివిధ వర్గాలమధ్య, ప్రాంతాల మధ్యగల వ్యత్యాసాలను తొలగించాలని పంచవర్ష ప్రణాళికలలోని ప్రధాన లక్ష్యాలలో పేర్కొన్నారు. సమాజంలో ఒక వర్గమైన మహిళలు చారిత్రక కారణాల ఫలితంగా బడుగుస్థితిలో ఉన్నారనీ; విద్య, సాంఘిక సంక్షేమం, సమాజాభివృద్ధి మొదలైన వివిధ కార్యక్రమాలద్వారా యీ బడుగు స్థితిని, వ్యత్యాసాన్నీ తొలగించాలనీ ప్రభుత్వం, ప్రజలు గుర్తించారు.

ఈ లక్ష్య సాధన నిమిత్తం మహిళలు, బాలలకు సంబంధించిన కొన్ని ప్రత్యేక రంగాలలో మహిళా సంక్షేమశాఖ కృషి చేస్తున్నది. మహిళల విద్య, ఆర్థిక ఉన్నతికై, ప్రత్యేకంగా నైతిక, సాంఘిక పునరావాసం, అవసరమైన బడుగువర్గాల మహిళల ఉన్నతికై ప్రత్యేక సంక్షేమ సర్వీసులను యీ శాఖ నిర్వహిస్తున్నది. అనాధ బాలల సంక్షేమం నిమిత్తం కేంద్రాలను నెలకొల్పారు.

దేశంలో మహిళలు నివసిస్తున్న పరిస్థితులు అంతటా ఒకేతీరుగా లేవు. పట్టణ ప్రాంతాలలోని చదువుకున్న స్త్రీలు అభ్యుదయ భావాలు కలిగి ఉన్నారు. గ్రామ ప్రాంతాలలోని నిరక్షరాస్యులైన స్త్రీలు యిప్పటికీ మూఢ నమ్మకాలతో, పురాతన సంప్రదాయాలతో వ్యవహరిస్తున్నారు. ఈ రెండు దృక్పథాలలో ఎంతో వ్యత్యాసం ఉంది. అంతేకాక అభివృద్ధి కార్యక్రమాలకు అవకాశాలు యీ రెండు ప్రాంతాలలో విభిన్నంగా ఉన్నాయి. ఈ వ్యత్యాసాన్ని గుర్తించి రెండు ప్రాంతాలకు అనువైన కార్యక్రమాలను రూపొందించారు. గ్రామ ప్రాంతాలలోని మహిళల అభివృద్ధి విషయం చాలాకాలంగా విస్మరించారు. వారి సంక్షేమానికి కృషి చేయని పక్షంలో భావి మహిళా లోకంలో ఆదర్శవంతమైన తల్లులుగా, ఉత్తమ పౌరులుగా వారు తమ పాత్రను నిర్వహించలేరనే విషయాన్ని గుర్తించడం జరిగింది. అందువల్లనే గ్రామీణ ప్రాంతాల మహిళాభ్యుదయానికి ఎక్కువ ప్రాధాన్యం యిస్తున్నారు.

మారుతున్న నేటి సంధికాలంలో మన దేశంలో సమిష్టి కుటుంబాల సంఖ్య తగ్గిపోతున్నది పారిశ్రామికాభివృద్ధి ఫలితంగా పట్టణ నాగరికత ప్రబలి మహిళలు, బాలల మానసిక, భౌతిక రక్షణలు అస్తవ్యస్తమవుతున్నాయి. మహిళల సంక్షేమానికి కార్యక్రమాలను రూపొందించే సమయంలో పై విషయాలను దృష్టిలో ఉంచడం జరుగుతున్నది. అయితే మారుతున్న యీ పరిస్థితులవల్ల ఒక ప్రయోజనం కలుగుతున్నది. దేశంలో రూపొందుతున్న నూతన ఆర్థిక, సాంఘిక పరిణామాల ప్రభావంవల్ల మహిళలు క్రమంగా తమ సాంప్రదాయసిద్ధమైన వేర్పాటు ధోరణులను విడనాడి జాతీయ కృషిలో ప్రముఖపాత్ర నిర్వహించడానికి ఎక్కువ సంఖ్యలో ముందుకు వస్తున్నారు.

పరిశ్రమలు, వాణిజ్యం, యితర ప్రయోజనకరమైన వ్యవసాయేతర రంగాలలో ఎక్కువ సంఖ్యలో మహిళలు ఉపాధి సౌకర్యాలు పొందడానికి ముందుకు వస్తున్నారు. తత్ఫలితంగా మహిళలకు ఉన్నతవిద్య, ఉత్తమ ఆరోగ్యం, ఆర్థిక భద్రత, యితర సౌకర్యాలను కల్పించడానికి విస్తృత ప్రాతిపదికపై కార్యక్రమాలను అమలుజరపాలి. బాలల సంరక్షణ, అభివృద్ధి, వారి తల్లి దండ్రులు, బంధువులకు మాత్రమే సంబంధించిన విషయమనే పురాతన సిద్ధాంతం విడనాడబడింది. భావి పౌరులైన బాలల భౌతిక, నైతిక, మానసిక అభివృద్ధి విషయంలో ప్రభుత్వం కూడ తగిన బాధ్యత వహించాల్సి ఉంది. బాలలు తమ వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోడానికి చిన్నవయస్సులోనే తగిన అవకాశాలను కల్పించాలి.

## సేవాసంస్థలు

మహిళలు, బాలల సంక్షేమానికి నిర్దేశించిన ప్రభుత్వ కార్యక్రమాలను ప్రధానంగా ఆరోగ్యం, విద్య, కార్మిక, మహిళా సంక్షేమశాఖల మధ్య పంపిణీచేయడం జరిగింది. ప్రణాళిక,



సర్వీసుహోంలలో చేతిపనులలో మునిగివున్న మహిళలు

ప్రణాళికేతర పద్దులలో మహిళా సంక్షేమ శాఖకు వార్షికంగా కేటాయించిన రు. 33 లక్షల పరిమిత వనరులతో రాష్ట్రం మొత్తంలో విస్తరించి ఉన్న సంస్థలద్వారా మహిళలు, బాలల సంక్షేమ కార్యక్రమాలను జరుపుతున్నారు బ్లాకులలో ఉన్న 300 పైగా ముఖ్య సేవికలు, అధిక సంఖ్యలోగల వారి సహాయకులు, గ్రామ సేవికలద్వారా యీ కార్యక్రమాలను అమలు జరుపుతున్నారు.

### మహిళలు :

యువతులు, వయోజనులైన మహిళల ప్రత్యేక అవసరాలను తీర్చడానికి, వివిధ ప్రాంతాలలో 5 రకాల సంస్థలు నిర్వహించబడుతున్నవి.

హైదరాబాదు, అనంతపురం, వరంగల్లు, విజయవాడ, కన్నాపురం (పశ్చిమ గోదావరిజిల్లా) లలో ఐదు సర్వీసుహోంలు పనిచేస్తున్నాయి. వాటిలో వరుసగా 150, 150, 30, 30, 50 మంది వయోజనులకు సౌకర్యాలు కల్పిస్తున్నారు. 7 సంవత్సరాలలోపు వయస్సుగల బాలబాలికలను వారి తల్లులతో యీ కేంద్రాలలో చేర్చుకుంటున్నారు. వితంతువులు, త్యజించబడిన భార్యలు, యితర ఆధారంలేని వనితలను, ప్రాథమిక విచారణ తర్వాత యీ కేంద్రాలలో చేర్చుకుంటున్నారు. వారు యీ కేంద్రాలలో మూడు సంవత్సరాలపాటు నివసించవచ్చు. అంతగా అవసరమని భావించిన పక్షంలో వ్యక్తిగత కేసులను దృష్టిలో ఉంచుకొని మరొక సంవత్సరంపాటు అక్కడ నివసించే అనుమతి యిస్తారు. ఈ కేంద్రాలలో నివసించేవారికి మెట్రిక్యులేషన్ వరకు సాధారణవిద్య, వృత్తులలో శిక్షణయివ్వడం జరుగుతుంది. శిక్షణ పూర్తిఅయిన తర్వాత వారికి పునరావాసం కల్పించడానికి సాధ్యమైనచర్యలు తీసుకుంటారు. సహాయక నర్సులు, ఉపాధ్యాయవృత్తి మొదలైన వాటిలో వారికి పునరావాసం కల్పించబడుతుంది. పీఠాపురం (తూర్పు గోదావరిజిల్లా) లో కస్తూరిబా గాంధీజాతీయ స్మారక ట్రస్టు, ఆళ్ళగడ్డ (కర్నూలుజిల్లా) లో స్థానిక మహిళామండలి సంస్థ స్వచ్ఛందంగా నిర్వహించే సర్వీసుహోమ్‌లకు యీ శాఖ సహాయక గ్రాంట్లను మంజూరు చేస్తున్నది.

హైదరాబాదు, రాజమండ్రి, మహబూబ్‌నగర్, కర్నూలు లలో నాలుగు స్టేట్ హోమ్‌లు ఉన్నాయి. సాంఘిక, నైతిక పునరుద్ధరణ పథకంక్రింద మొదటి రెండు కేంద్రాలలో 100 మందిని, తర్వాతి రెండు కేంద్రాలలో 75 మంది చొప్పున అభ్యర్థులను చేర్చుకుంటున్నారు నైతిక పతనంపొందిన బాలికలను వారికోరికపై యిందులో చేర్చుకుంటారు. అంతేగాక నాన్ కరెక్షనల్ సంస్థల నుండి విముక్తిపొందిన మహిళలను నైతిక ప్రమాదములోగల యితర మహిళలనుకూడ యిందులో చేర్చుకుంటారు. సుశిక్షితులైన గెజెటెడ్ అధికారి పర్యవేక్షణలో యీ హోమ్‌లు పనిచేస్తున్నాయి. ఈ మహిళలకు వృత్తిరంగాలలో పునరావాసం కల్పించి, సమాజంలో తగిన స్థానం లభింపజేయ డానికి వీలుగా యీ కేంద్రాలలో సాధారణ విద్యతో పాటు ఉత్పత్తి శిక్షణ యూనిట్లుకూడ నిర్వహిస్తున్నారు. ఇక్కడకూడ అభ్యర్థినులు 3 సంవత్సరాలపాటు నివసించడానికి సౌకర్యాలు కలిగించారు.

### వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలు

హైదరాబాదు, వరంగల్లు, శ్రీకాకుళం, ఏలూరు, కర్నూలు, కడప, అనంతపురంలలో 7 వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలను యీ శాఖ నిర్వహిస్తున్నది. వాటికి అనుబంధంగా హాస్టళ్లు కూడ ఉన్నాయి. ఈ కేంద్రాలలో బాలికలకు టైపురైటింగ్, షార్ట్‌హాండ్, వాణిజ్యవిషయాలలో బోధన గరుపుతారు. ప్రతి వృత్తి విద్యాకేంద్రంలో 30 మందికి ప్రవేశం ఉంటుంది. కడప, హైదరాబాదులలో రెండు జిల్లా టైలరింగ్ కేంద్రాలను ప్రారంభించారు. వాటికి అనుబంధంగా హాస్టళ్లు ఉన్నాయి. టైలరింగ్, దుస్తుల తయారీలో సాంకేతిక పరీక్షలలో పాల్గొనడానికి వీలుగా మహిళలకు యీ కేంద్రాలలో శిక్షణయిస్తారు. ప్రతి కేంద్రంలో 50 మంది అభ్యర్థులకు నెలకు రు. 25/- ల చొప్పున స్టయిఫండు యిస్తారు.

మహిళా కమ్యూనిటీ కేంద్రాలుగా వ్యవహరించబడే మహిళా సంక్షేమ విభాగాలు దిగువవర్గం సంస్థలు. ఈ కేంద్రాలలో టైలరింగ్, సవారు అల్లకం, విస్తళ్లుకుట్టడంవంటి గృహపరిశ్రమలలో మహిళలకు శిక్షణయిస్తారు. వయోజన విద్య, వ్యక్తుల, పరిసరాల పరిశుభ్రతల బోధనా ప్రదర్శనలు, ప్రథమచికిత్స, పిల్లలసంరక్షణ మొదలైన విషయాలలో కూడ శిక్షణయిస్తారు. మొత్తం 75 బ్రాంచీలలో 26 మహిళా సంక్షేమశాఖ అధ్వర్యంలోనూ మిగతా పంచాయతీ సమితుల అధ్వర్యంలోను పనిచేస్తున్నాయి. దీనికై సమితులకు రు. 1.80 లక్షలు సహాయక గ్రాంట్లుగా మంజూరు చేశారు.

ఏజన్సీ ప్రాంతాలలోని గిరిజనులకు, షెడ్యూలుకులాల మహిళలకు ప్రత్యేక మహిళా సంక్షేమ కేంద్రాలు ప్రారంభించారు.

### బాలబాలికలు :

బాలలనిమిత్తం యీ శాఖ మూడు విధాలైన సంస్థలను నిర్వహిస్తున్నది. పేదలు, నిస్సహాయులైన బాలబాలికల

నిమిత్తం రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో మొత్తం 37 బాలల హోమ్‌లు ఉన్నాయి. వాటిలో రెండు కేంద్రాలు, ప్రత్యేకంగా కుష్టువ్యాధి రోగులనిమిత్తం నిర్వహించబడుతున్నాయి. 7_12 సంవత్సరాల మధ్య వయస్సుగల బాలురు, 7_18 సంవత్సరాల మధ్య వయస్సుగల బాలికలను యీ హోమ్‌లలో చేర్చుకుంటారు. వారు సాధారణంగా విద్యాభ్యాసంలో వెనుకబడిఉంటారు. అందువల్ల యీ హోమ్‌ల సూపరింటెండెంట్లు వారికి ట్యూషన్ చెప్పుతార్లు. అయితే స్థానిక పాఠశాలలో వారికి సాధారణ విద్యా సౌకర్యాలు కల్పిస్తారు. హోమ్‌లలో సాంస్కృతిక, మనోల్లాస కరమైన కార్యక్రమాలనుకూడ నిర్వహిస్తారు. ప్రతి బాలల హోమ్‌లో 50 మంది బాలబాలికలు ఉంటారు. పెద్దపాడు (కర్నూలుజిల్లా) లోని హోమ్‌లో మాత్రం 100 మంది ఉన్నారు. 1967_68 సంవత్సరంలో యీ హోమ్‌లను ప్రతిష్ఠవంతంగా నిర్వహించడానికి రు. 15 లక్షలకు పైగా ఖర్చుచేస్తారు.

గ్రామాలలో ఎక్కువమంది మహిళలు వ్యవసాయరంగంలో పనిచేస్తుంటారు. పారిశ్రామిక నగరాలలో కొన్ని ఫ్యాక్టరీలలో పనిచేసే మహిళల బాలబాలికల నిమిత్తం సంరక్షణ కేంద్రాలను నిర్వహిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలలోను, మహిళా కార్మికులు (కూలీలు) ఎక్కువగా నివసించే మురికిపేటలు, యితర వెనుకబడిన ప్రాంతాలలోను పిల్లలు పనులలోకి వెళ్ళనప్పుడు 6 సంవత్సరాలలోపు వయస్సుగల వారి పిల్లల సంరక్షణకు ఎటువంటి సౌకర్యాలు యింతవరకు కల్పించబడడంలేదు. తత్కారణంగా 37 బాలల సంరక్షణ కేంద్రాలను యీశాఖ నిర్వహిస్తున్నది. ఈ కేంద్రాలలో పిల్లలకు మధ్యాహ్న భోజనం, టిఫినులు ఏర్పాటుచేస్తున్నారు. వారి నిమిత్తం ప్రీబేసిక్ తరగతులను నిర్వహిస్తున్నారు. సాధారణంగా బాలల మనోవికాసానికి సాంస్కృతిక కార్యక్రమాల సౌకర్యంలేని జిల్లాలలోని వివిధ ప్రాంతాలలో 28 బాల విహారాలను నిర్వహిస్తున్నారు. మహిళా సంక్షేమ కేంద్రాలన్నిటిలో 3_7 సంవత్సరాల మధ్య వయస్సుగల బాలబాలికలకు ప్రీ బేసిక్ తరగతులను నిర్వహిస్తున్నారు. ఈ బాలబాలికలకు పాలు, కాడ్లివర్ ఆయిల్, విటమిన్ మాత్రలు కూడ యిస్తున్నారు.

ఈ విధంగా యీశాఖ, దాదాపు వేయిమంది మహిళలకు, 6 వేలమంది బాల బాలికలకు యీ సంస్థలద్వారా సేవచేస్తున్నది.

## క్షేత్ర కార్యక్రమాలు

93 మహిళా సంస్థలు, 112 బాలల సంస్థలను నిర్వహించడం మహిళా సంక్షేమ కార్యక్రమాలలో ఒక భాగంమాత్రమే. రాష్ట్రంలో వేలాది గ్రామాలలోని విస్తృత ప్రాంతాలలో ముఖ్యమైన ఎన్నో కార్యక్రమాలను నిర్వహించాల్సి ఉంది. ఇది వరకే పేర్కొన్నట్టు యీ శాఖ ప్రధాన లక్ష్యాలు చాలా విస్తృతమైనవి. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక జీవితరంగాలలోని ముఖ్యమైన అంశాలన్నిటికీ వర్తిస్తుంది. ఆరోగ్యం, పరిశుభ్రత, ప్రసూతి సౌకర్యాలు, బాలల సంక్షేమం, నిరుద్యోగులైన వారికి కుటీర పరిశ్రమలు, గృహ పరిశ్రమలలో శిక్షణ యిచ్చి ఉపాధిసౌకర్యాలు కల్పించడం, అన్నిటి కన్నా ముఖ్యంగా వ్యక్తిగత కుటుంబాలకు



మిట్టు పని కేంద్రంలో మహిళలు

వారి రోజు వారీ సమస్యలను పరిష్కరించడంలో తోడ్పడడం యీ శాఖ కొన్ని ప్రధాన లక్ష్యాలు. అయితే యీలక్ష్యాలను సాధించడం అంత సులువైన పనికాదు. ముఖ్య సేవికలు, గ్రామ సేవికలు, మహిళా సంక్షేమ విభాగాల సిబ్బందిద్వారా యీ కార్య నిర్వహణకై తీవ్రంగా కృషి చేయడం జరుగు తున్నది అతి ప్రధానమైన కుటుంబ సంక్షేమానికి యీ కార్యక్రమంలో ప్రథమస్థానం యిస్తున్నారు. సుశిక్షితులైన క్షేత్రకార్య కర్తలు క్రమం తప్పకుండా కుటుంబాల వద్దకువెళ్ళి, వారి కుటుంబ పరిస్థితులను సమీక్షించి తగిన సలహా సహాయాలను అందజేస్తున్నారు. అంతే గాక ప్రథమ చికిత్స, నర్సింగ్, ఆరోగ్యం, పరిశుభ్రత, వైద్య సహాయం, ప్రసూతి, బాలల సంరక్షణ మొదలైన విషయాలలోకూడ తోడ్పడు తున్నారు. ఈ శాఖ బ్రాంచీలలో శిక్షణ పొందిన మంత్రసానుల సహాయంకూడ లభింప జేస్తున్నారు మారుమూల గ్రామాలలో యీ శాఖ మాత్రమే ప్రసూతి సౌకర్యాలు అందజేస్తున్నది. మహిళలు, ఆదర్శ మాతలుగా, గృహిణులుగా ఉత్తమ పౌరులుగా రూపొందడానికి వీలుగా కమ్యూనిటీ సేవ కేంద్రాలు వారికి సాంఘిక విద్య కల్పిస్తున్నాయి.

టైలరింగ్ కేంద్రాలు ప్రారంభించి శిక్షణ యివ్వడంద్వార ఉపాధి కల్పిస్తున్నారు. రాష్ట్రం అన్ని ప్రాంతాలలో దాదాపు 200 కేంద్రాలు పనిచేస్తున్నాయి. ఇందులో 4 జిల్లాలలో జిల్లాకు 20 కేంద్రాల చొప్పున పనిచేస్తున్నాయి. సాంఘిక సంక్షేమ సేవలోని ప్రబోధం, నివారణ, సంరక్షణ, పునరావాసం అంశాలపై యీ శాఖ కార్య క్రమాలు అమలు జరుగు తున్నాయి.

ఈ శాఖ వ్యవస్థలో జిల్లా స్థాయిలో జిల్లా మహిళా సంక్షేమ శాఖాధి కారిణులు కీలక పాత్ర వహిస్తారు. గ్రామ స్థాయిలో ముఖ్య సేవికలు ప్రధాన పాత్ర వహిస్తారు. డైరెక్టరు క్రింద ముగ్గురు అసిస్టెంటు ప్రాంతీయ డైరెక్టర్లు _ ఆంధ్ర ప్రాంతానికి యిద్దరు తెలంగాణా ప్రాంతానికి ఒకరు_ఉన్నారు. వారు తమ అధికార పరిధిలో సంక్షేమ కార్య క్రమాలపై పర్యవేక్షణాధి కారం వహిస్తారు

ఈ పని క్రొత్తది కాబట్టి అధికారిణులరూ, సిబ్బందికీ వారు ఎదుర్కొన వలసివచ్చే క్లిష్టమైన, విభిన్నమైన సమస్యలను గురించిన అవగాహన కలిగించడానికీ, అంతేగాక వారు తమ విధి నిర్వహణలో శాస్త్రీయమైన దృక్పథాన్ని అ పర్చు కొనగలగడానికీ వీలుగా వారికి శిక్షణ ఇవ్వడం అవసరమని భావించబడింది. ఈ లక్ష్యంతోనే మహిళా సంక్షేమ అధికారిణులకు శిక్షణ ఇవ్వడానికి ఒక సంవత్సరం కోర్సును ప్రారంభించారు. ఈ కోర్సు పాఠ్యాంశాలలో సాంఘిక శాస్త్రం, అర్థ శాస్త్రం, గ్రామీణ విస్తరణ సేవలు, సాంఘిక విద్య, చరిత్ర–సంస్కృతి, వైద్యం, గృహవిజ్ఞానం మాతృ విజ్ఞానం, ఆఫీసు పరిపాలన, ఆఫీసు పని మొదలైన సాధారణ అంశాలను, ప్రత్యేక అంశాలను చేర్చారు.

## అధికారిణుల బాధ్యత

అయితే, ఆశించిన ఫలితాలను పొందడానికి ప్రత్యేక శిక్షణ, విద్యాయోగ్యతలు మాత్రమే చాలవు. ఒకరికి అవసరమైన విద్యార్హతలు సంపూర్ణంగా వుండవచ్చు. కాని మహిళలలోని వెనుకబడిన వర్గాలవారి అభ్యున్నతికీ, ప్రేమపూర్వకమైన ఆదరణ అవసరమైన బీద పిల్లల అభివృద్ధికీ కావలసిన సేవాభావం, సేవా నిరతి లోపించినట్లయితే ఆమె తన విధి నిర్వహణలో విఫలురాలవుతుంది. ఆశ్రయ గృహాలలో కేంద్రాలలో, చేర్చుకొనబడేవారు పెద్ద వ్యథతో, ఇబ్బందులతో బాధపడుతుంటారు. వారి ఇబ్బందులు ఎప్పుడూ ఆర్థిక సంబంధమైనవి మాత్రమే కానవసరం లేదు. వారు తరచుగా చితికి పోయిన కుటుంబాలవారై వుంటారు. భర్తలచే పరిత్యజించబడిన వారై, దగ్గరి వారిచే పరిహరించబడినవారై వుంటారు. జీవితంలో చేసిన ఒక తప్పటడుగు నేరానికి శిక్షపొంది ఆశ్రయాన్ని కోరేవారై వుంటారు. వారి మచ్చలను మాన్పడానికి మానవత్వంతో కూడిన పరిచర్య అవసరం. మహిళా సంక్షేమ శాఖాధికారిణులు నైమిత్తికమైన, యాంత్రికమైన పరిపాలనా నిర్వహణ విషయాలలోనే నిమగ్నురాండ్రు కాకుండా ఆశ్రయ గృహాలలోని మందభాగ్యులైన సోదరీ మణులపట్ల సానుభూతి, కనికరం వహించి వారి సంక్షేమం, అభ్యున్నతి కొరకు కృషిచేయాలి. వారి సంక్షేమం తమకు అప్పగించబడిందనే విషయాన్ని అధికారిణులు దృష్టిలో వుంచుకోవాలి.

అధికారిణులు, సిబ్బంది ఒక బృందంగా, కలిసికట్టుగా పనిచేయాలి. సక్రమ పథంలో కార్యనిర్వహణ సాగించాలి. వీరందరూ ఒక మహత్తరమైన లక్ష్యంతో కృషిచేస్తున్నారనే అభిప్రాయాన్ని ప్రజలకు కలిగించాలి. ఏదో ఉద్యోగధర్మం నెరవేరుస్తున్నారనే భావం కలిగించకూడదు. "నారీ జీవితం ఇక్కట్లకూ, త్యాగాలకూ, నిలయం. అందుచేత ప్రజాజీవితంలో ఆమె ప్రవేశించిన ఫలితం అలంగం పరిశుద్ధంకావాలి" అని గాంధీజీఅన్నాడు. మనందరమూ ఈ ఆదర్శంతో, లక్ష్యంతోనే పనిచేయాలి. అనుచితమైన, నీచమైన వాంఛలుగల పురుషుడు కాని, స్త్రీకాని, ఎవరైనా వున్నట్లయితే, ఉదాత్తమైన, ఆదర్శప్రాయమైన మార్గంలో పయనిస్తున్న ఉమ్మడి శక్తి వారిని ఘుళిపిస్తుంది. భారత మహిళలు దేశ స్వాతంత్ర్య పోరాటకాలంలో మహోజ్వలమైన ఆదర్శాలకు ఒరవడి పెట్టారు. దేశప్రజలందరికీ ఆర్థికంగా, సాంఘికంగా విమోచనం కలిగించడానికి ఇప్పుడు పోరాటం మరింత ఉధృతంగా సాగుతున్నది. కాబట్టి ఇతోధికమైన శక్తితో ఈ సమయంలో పాల్గొని తొల్లిట నెలకొల్పిన ఉన్నత సంప్రదాయాన్నీ, ఆదర్శాన్నీ, ఇప్పుడు ఎందుకు పరిపోషించ కూడదు ?

ఈ కృషిని ఇంతటి విశాలదృక్కోణం నుంచి వీక్షించినప్పుడు ఈ ప్రయత్నంలో ప్రజలను ఇతోధికంగా భాగస్వాములను చేయవలసిన ఆవశ్యకత కనిపిస్తుందని వేరే చెప్పనవసరంలేదు. కాగా దీనికి అప్పుడే నాంది జరిగింది. ఈ శాఖ మహిళా సంక్షేమ విభాగాల కొరకు, పంచాయతీ సమితులకు, సహాయక గ్రాంట్లు ఇస్తున్నది. స్వచ్ఛంద సంఘాలు నిర్వహిస్తున్న కొన్ని సంస్థలకు కూడా ఈ గ్రాంట్లు లభిస్తున్నాయి. స్టేట్ హోమ్స్ నిర్వహణలో అనధికార్ల మేనేజింగ్ కమిటీలుకూడా పాల్గొంటున్నాయి. అర్హతలు ప్రజా సేవపట్ల ఆసక్తిగల మహిళలకు కొరతలేదు. వీరిసేవలను వినియోగించుకోవడానికి వీలుగా సంయుక్త కార్యాచరణను అభివృద్ధి పరచడానికి అనువుగా మహిళా సంక్షేమ శాఖ తన కృషిని తీవ్రతరం చేయాలి. ఈ ప్రయత్నంలో ప్రజలనుంచి భౌతికమైన స్వచ్ఛంద సహాయం సంపూర్ణంగా ఈ శాఖ వినియోగించుకొన దగినంతగా లభించాలి.

## ప్రచార కార్యక్రమం

ప్రజా సహకారాన్ని ఇతోధికంగా పొందడానికై, మహిళా సంక్షేమ శాఖ నిర్వహిస్తున్న కార్యకలాపాలను గురించి తగు ప్రచారసాధనాల ద్వారా ప్రజలకు తెలియజేయడం అవసరం. ఇందు నిమిత్తం అభివృద్ధి నివేదికలను ముద్రించడం, రేడియో ప్రసంగాలు ఏర్పాటుచేయడం, పత్రికలకు సమాచారం విడుదల చేయడం, సాంస్కృతిక కార్యక్రమాలను–ప్రదర్శనలను నిర్వహించడం, అవసరం. పత్రికా విలేఖరుల పర్యటనలను ఏర్పాటు చేయాలి. ఇలా చేయడంవల్ల ఈ శాఖ సాగిస్తున్న అభివృద్ధిపట్ల స్థూలంగా ఒక సక్రమమైన అభిప్రాయాన్ని ప్రజలు ఏర్పర్చుకొనగలుగుతారు. అప్పుడేవారురాష్ట్రవ్యాప్తంగా పెద్దఎత్తున జరుగుతున్న కార్యక్రమంలో ఎప్పుడైనా ఏదైనా స్వల్పలోపం జరిగినట్లయితే దానిని ఉపేక్షించ గలుగుతారు.

విజయం పొందడానికి అవకాశాలు, మిక్కుటంగా వున్నాయి. ఈ సందర్భంలో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ సుభాషితాన్ని మననం చేసుకుందాము–"ప్రజానీకాన్ని జాగృతం చేయడానికి మహిళా లోకాన్ని మేల్కొల్పాలి. మహిళ కదిలి వచ్చినట్లయితే ఆమెవెంట ఇంటిల్లిపాది–కదిలివస్తారు. గ్రామమూ, దేశమే కదిలివస్తుంది. స్త్రీల ద్వారానే బాలలు ఈ రంగంలోకి ప్రవేశిస్తారు. వారివల్ల ఆరోగ్య ప్రదమైన జీవితానికి, ఉత్తమ శిక్షణకూ అవకాశాలు కలుగుతాయి. ఈ విధంగా మనం ఈనాటి బాలల ద్వారా రేపటి సుందర, సురుచిర భారతావనిని తీర్చిదిద్దుకుంటాము."

సీరియల్ :

# భాగ్యచక్రం

ఆరికెపూడి కౌసల్యాదేవి

## జరిగిన కథ

ప్రమాదంలో [illegible] అయినవారికి చికిత్స చేసిన మెడికల్ స్టూడెంట్ లక్ష్మి ఇంటికి వచ్చింది. జయశ్రీ తనబావ శ్రీనగేష్‌కు [illegible] పోవాలని నిశ్చయించుకున్నట్లు లేఖ వ్రాసి పంపింది. శ్రీకాంత్ జయశ్రీలు తన రూములో కూర్చుని ఏకాంతంగా మాట్లాడుకోవడం శ్రీనగేష్ చూశాడు. శ్రీనగేష్‌కూ, జయశ్రీ మాటలు [illegible] లక్ష్మితో అతని సాన్నిహిత్యం [illegible] యిష్టంలేదు

---

పోతున్న అతడిని వెన్నంటి జయశ్రీ మాటలు కూలాంకషంగా వచ్చి [illegible] గిలాయి "ఆ పిశాచి నీ యింట్లో ఉన్నదట. అది పుణ్యం. పలుకు నేను ఆ గదిప్రక్కనే. సాయంత్రం, ఇక్కడికే వస్తాను. నీవు చెప్పదలచినది చెప్పు!"

శ్రీనగేష్ మనస్సు అదీనం తప్పిపోయింది. పైకి మౌనం వహించినప్పటికీ. శ్రీలక్ష్మి మృదు సరళ స్వభావాన్నీ. జయశ్రీ తీవ్రతర స్వభావాన్నీ పోల్చుకోకుండా ఉన్నతుండ లేకపోతుంది. అతడి అంతరంగం. ఆ ఆలోచనలతోనే ఆసుపత్రి పని ముగించి ఇల్లు చేరుకున్నాడు.

ఎదుటి హాలులో శ్రీదేవి, సుశీలాదేవి, శ్రీనివాసరావు చాలా ఆత్మీయంగా మాటాడుకుంటూ కూర్చున్నారు. కాలు చేతులు కడుక్కోవడానికి దొడ్లోకి వెళ్ళిన శ్రీనగేష్‌ను చూచి. తాను చెట్టుక్రింద తిన్నెపై కూర్చుని పరధ్యానంగా ఆలోచిస్తున్న శ్రీలక్ష్మి స్నేహంగా నవ్వుతూ లేచి నిలబడింది.

"బాగున్నదా ఒంట్లో? భోజనం చేశారా?" చిరునగవుతో అడిగాడు శ్రీనగేష్

"ఆ" సమాధానంగా చిరునవ్వుతో ఏమో చెప్పబోయిన శ్రీలక్ష్మి పరుగు పరుగున వచ్చి సందేహిస్తూ ఆగి నిలబడి పోయిన శ్రీధర్‌ను ముగ్ధురాలై చూస్తూ మాటలు మరచి పోయింది.

"రాడీ! నేను రావచ్చా?" తనను చూచి జయశ్రీ తగ్గుమవడం శ్రీధర్ పసి మనసును గట్టిగా ముద్రవేసి పట్టుకున్నందువల్ల! అదే వయసులో నున్న శ్రీలక్ష్మిని చూచి ఆ సామీప్యంలోనికి రావడానికి జంకి నిలబడ్డాడు

"రా బాబూ" ఆప్యాయంగా ఎత్తుకున్నాడు శ్రీనగేష్.

సంతోష దరహాస చంద్రికలు వెల్లి విరుస్తున్న నేత్రాలతో అన్నది శ్రీలక్ష్మి "మీకో అబ్బాయి ఉన్నాడా? చెప్పలేదే మండీ? ఇదే చూడడం నేనింత వరకూ చూడనే లేదు!"

"అవును. స్కూలు నుంచి సెలవులకు వచ్చాడు!"

ఆనందంగా వింటూ ఆప్యాయంగా చూచింది శ్రీలక్ష్మి శ్రీధర్ వైపు "ఇటు రా బాబూ, నువ్వేం చేస్తావ్ డాక్టర్ వౌతావా, కలెక్టర్ వౌతావా? ఏం చదువుతావు చెప్పు?"

"పెద్ద డాక్టర్నై మా నాన్నకు సాయం చేస్తాను!"

సిసింద్రీలా చెప్పిన ఆ జవాబుకు శ్రీలక్ష్మి శ్రీనగేష్ లిరువురికీ పెద్దగా నవ్వు వచ్చింది

"చాలా చురుకైన వాడే నండీ మీ అబ్బాయి! మరి వాళ్ళమ్మగా రెక్కడా?"

తప్పని సరిగా ప్రసంగం మార్చేశాడు శ్రీనగేష్, "రండి లోపలికి, ఎండ ఎక్కువౌతోంది." అంటూనే లోనికి దారి తీశాడు. కాని మల్లెపూవు వంటి మృదుత్వంగల శ్రీలక్ష్మి మృదు మధుర స్వభావమే అతడిని వెన్నంట సాగింది. శ్రీధర్‌ను చూడగానే జయశ్రీ అగ్గి గుగ్గిలమైంది. ఈమె ఆప్యాయంగా అక్కున చేర్చుకొంది! మానవ స్వభావాలలో ఎంతటి భిన్నత్వం!'

ఆ తర్వాత శ్రీలక్ష్మి ఆయింట వున్న రెండు రోజులలో శ్రీధర్ ఆమెకు అతి సన్నిహితుడై పోవడం చూచిన అందరికీ ఆశ్చర్యంతో పాటు మురిపెం కూడ కలిగింది. శ్రీలక్ష్మి నిజంగా ప్రేమ మూర్తి!' అనిపించింది ప్రతి ఒక్కరికీ.

కాని శ్రీలక్ష్మి పూర్తి ఆరోగ్యం చిక్కిన తర్వాత ఆమె కుటుంబ మంతరూ వెళ్ళిపోతున్న నాడు శ్రీధర్‌ను ఎవరికీ పట్ట శక్యం కాలేదు. " నేనూ వెళ్తాను, నేను యిక్కడుండను. " నిగలగా ఏడ్చి గొడవ పెట్తున్న అతడిని సముదాయింప ఎవరి తరమూ కాక పోయింది.

'' మళ్ళీ వస్తానులే బాబూ, ఏడవకు, " బ్రతిమాల్తున్న లక్ష్మి చేతులను త్రోసేసి చిందులు త్రొక్కాడు శ్రీధర్ "

అసలు వెళ్ళొద్దు, ఇక్కడే వుండిపో ! ''

అందరూ ఉలికిపడి ముఖ ముఖాలు చూచుకున్నారు. శ్రీదేవి కనులు ఒత్తుకున్నది. '' మన కంత అదృష్టమా బాబూ ? '' అంటూ,

తల్లి మాటలు వినగానే శ్రీ నగేష్‌కు సహనం హరించి పోయి చీకాకు కలిగింది. ఇటువంటి వాడిని మాలిమి చేసుకోకుండా ముందే దూరంగా వుంచాలి అసలు. వాడిని బ్రతిమిలాడేదేమిటి ? ఉండకేం చేస్తాడు ? మీరు కారెక్కండి లక్ష్మి. " అన్నాడు కటువుగా శ్రీధర్ చేయి గట్టిగా పట్టుకొని.

శ్రీలక్ష్మి మనసు జాలితో కరగి పోయింది. '' బాబును కొడతారా, అంతకోపం ప్రదర్శిస్తున్నారు ? " అని శ్రీ నగేష్‌ను ప్రశ్నిస్తున్న ఆమె నేత్రాలు ఆమెకు తెలియకుండానే అశ్రుసిక్తమై అంత రంగంలోని ఆర్ద్రతను వ్యక్తీకరించాయి. అలా అడుగుతూనే వచ్చి శ్రీధర్‌ను చెంతకు తీసుకుంది. " రా బాబూ, నీ యిష్టం వచ్చినన్నాళ్ళు నా దగ్గరుండువు గాని, అక్కడే చదువుకో వచ్చు. '' అంటూనే మరెవరి అనుమతి కోసం నిరీక్షించకుండా శ్రీధర్‌తో పాటు కారెక్కింది.

చూపరులు ఆశ్చర్యంతో శిలా ప్రతిమలే అయ్యారు, "అదేమిటమ్మా ? కాస్సేపు ఏడ్చి వాడే వూరు కుంటాడు. ఎందుకు నీతో ? " శ్రీదేవి పెద్ద తరహా అధికారంతో ప్రశ్నించింది.

గంభీరంగా నవ్వింది శ్రీలక్ష్మి. " ఎందుకు మీ యింట యిన్ని రోజులు సకుటుంబంగా వుండి సపర్యల నందాము ? అసలు ఎందుకు మనకు స్నేహమైంది ?................వాటికి సమాధానం లేనట్టే దానికీ లేదు. బంధం, సంబంధం, స్నేహబంధం కంటే అనుబంధం బలీయమైనది. అంతే మీ అబ్బాయికి అక్కడైనా ఏమీ లోటు వుండదు. మా తమ్ముడూ చెల్లాయితో పాటే వుంటాడు. మధ్య మధ్యన మీకు మనసైనప్పుడు తీసుకు వచ్చి చూపెడు తూంటాము. "

ఆ వింత వాతావరణంలో ప్రతి ఒక్కరికీ మాటలు కరవై మనసులు వింది పోయి చేష్టలు దక్కి నిల్చుని వుండగా కారు సాగిపోయింది.

ఏదో తెలియరాని అనిర్వచనీయమైన బాధ మనసును కలచి వేయగా శ్రీదేవి మౌనంగా పోయి తన గదిలో పడుకున్నది. అనుకోకుండానే లంకెపడి బంధించి వేస్తున్న ఈ అనుబంధం ఎటువంటి పరిణామాలకు దారి తీస్తుందో తీయగలదో ఊహించు కుంటూ శ్రీనగేష్ తన గదిలో కూర్చుని పోయాడు, కాల గమనాన్నే గమనించ కుండా.

"అబ్బ! మీ అబ్బాయిమీద పర్నాటికే బెంగపుట్టేసిందా?" తమ యింటికి వచ్చిన శ్రీ నగేష్‌ను హాస్యంగా ప్రశ్నించింది శ్రీలక్ష్మి.

ఆమెలాగా నిర్మలంగా నిశ్చింతంగా నవ్వలేకపోయాడు శ్రీ నగష్. "ఏదో పసివాడు అల్లరి చేసినంత మాత్రాన మీపై అంత భారం ఎలా వెయ్యను మరి?"

తండ్రిరాకను గమనించి శ్రీధర్ పోయి, సుశీలా దేవిచాటున దాక్కున్నాడు.

అటుచూచి నవ్వుతూ అన్నది శ్రీలక్ష్మి . "ఇది మాత్రం పరాయిచోటా' ఉండనీయండి. మీకెందుకంత పట్టుదల?"

కొలది క్షణాలు తటపటాయించి కడకు అన్నాడు శ్రీనగేష్. "మీకెలా చెప్పను? అందువల్ల చాలా అనర్థాలెదురౌతాయి. మీరేమీ అనుకోకండి. తీసుకుపోతాను, కాస్సేపు ఏడ్చినా వాడే ఊరుకుంటాడు, అమ్మగారుకూడా మరిమరి చెప్పారు, 'ఎలాగైనా తీసుకు వచ్చేయ' మని".

ఆ స్వరంలోని స్థిరగాంభీర్యాన్ని గమనించిన శ్రీలక్ష్మి మరి తర్కించలేదు. "పోనీ సాయంత్రం వరకూ ఆగండి. పాపం, పిల్లలు మహా సంతోషంగా వున్నారు. ఇవ్వాళ చిన్న పిక్నిక్ ప్రోగ్రాము వేసుకున్నాం వాళ్ళకోసం, అది కానివ్వండి."

కొలది క్షణాలు ఆలోచించిన శ్రీ నగేష్ అన్నాడు; "సరే వెళ్ళరండి, నేను సాయంత్రం రాను. రేపువస్తాను . అప్పుడు మాత్రం మరి అభ్యంతరపెట్టగూడదు."

"ఇవాళ ఏమైనా అర్జంటు పనులున్నాయా మీకు?"

"రేపు, లేవనే చెప్పారే. అందుకే ప్రత్యేకంగా శ్రీధర్ కోసం పని గట్టుకురాగలిగాను."

"అయితే..................చిన్న రిక్వెస్ట్,"

"ఏమిటది?" వెళ్ళిపోవడానికుద్యుక్తుడైన అతడు వెనుదిరిగి ప్రశ్నించాడు.

"మీరు మాతో రండి సరదాగా!"

"నేనా!!"

"ఔను, రావాలి! రావాలి!" శ్రీలక్ష్మి తమ్ముడు, చెల్లెలూ, శ్రీధర్ ముగ్గురూకలిసి శ్రీనగేష్ చుట్టూచేరి గొడవప్రారంభించారు.

"చూశారా, వాళ్ళంతా ఎంత సంతోషంగా ఉన్నారో? నిరుత్సాహపడిపోతారు మీరు కాదంటే,"

సాలోచనంగా తల పంకించాడు శ్రీ నగేష్." నిజమే! ఒకరి ఆనందాన్ని అభ్యర్థనమూ తేలికగా త్రోసిపుచ్చలేను, సరే. నడవండి"

హఠాత్తుగా అతడి స్వరంలో స్థానం చేసుకున్న విషాద విచారాలను చూచి, కారణంతెలియక బాధపడింది శ్రీలక్ష్మి లోలోన.

[యింకావుంది]

# విద్యార్థి లోకంలో అశాంతి

—— ప్రేమ్ ప్రకాశ్

గత పది సంవత్సరాలకు పైగా ప్రతి సంవత్సరం విద్యార్థి లోకంలో అశాంతి సంఘటనలు జరుగుతున్నాయి. సాధారణంగా యీ అశాంతి సంఘటనలు మొదటి టర్మ్‌లో ప్రారంభమై పరీక్షలు సమీపించే సమయానికి క్రమంగా తగ్గిపోతాయి. ఆయేటి కాయేడు యీ అశాంతి సంఘటనలు ఎక్కువ అవుతున్నా వాటికి అలవాటు పడడమే తప్ప వాటి నివారణకు అంతిగా శ్రద్ధవహించడం జరగడంలేదు. అశాంతి సంఘటనలలో దౌర్జన్యం పెచ్చు మీరుతున్నది. వాటికి తగిన కారణాలు కూడ అంతగాలేవు.

అయితే యిటీవలి కాలంలో జరిగిన సంఘటనల మూలంగా ప్రత్యేకంగా ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, పశ్చిమ బెంగాలులలో జరిగిన అల్లరుల తర్వాత యీ విషయంపై శ్రద్ధవహించనారంభించారు. ఈ సంవత్సరం జరిగిన సంఘటనల సంఖ్య మితిమీరి పోవడమేగాక యీ సందర్భంలో దౌర్జన్యకాండ కూడ హద్దుమీరి పోయింది. విద్యా విషయాలతో సంబంధం లేని సంఘటనలు చాలా జరిగినాయి. విద్యార్థులు, పోలీసుల మధ్య జరిగిన ప్రత్యక్ష సంఘర్షణలు యింతకు ముందు ఎన్నడు జరగని విధంగా విస్తృతంగా జరిగినాయి.

ఈ విషయాలు ప్రతివారిని విస్మితులను చేశాయి. రాజకీయ నాయకులు, ప్రభుత్వం, ఉపాధ్యాయులు, ప్రజలు, తల్లిదండ్రులు అందరు ఆందోళన చెందారు. తక్షణం తగిన కట్టుదిట్టమైన చర్యలు తీసుకోని పక్షంలో పరిస్థితులు చేయిదాటిపోవచ్చునని గుర్తించారు. ఈ అశాంతి సంఘటనలను నివారించడానికి తక్షణం విస్తృత ప్రాతిపదికపై సమగ్రమైన, సమర్థనీయమైన చర్యలు తీసుకోవాల్సి ఉంటుంది.

## కారణాలు, నివారణోపాయాలు

విద్యార్థుల అశాంతికి క్లిష్టమైన,లోతైన అనేకమైన కారణాలు ఉన్నాయి. సాంఘిక, సాంస్కృతిక ఆర్థిక, రాజకీయ, విద్యావిషయక కారణాలు అనేకం యీ అశాంతికి దోహదంచేస్తున్నాయి. సాధారణంగా యీ సమస్యలను అతితేలికగా భావిస్తూ, వాటి పరిష్కారానికి సంబంధించిన ఒకటి, రెండు అంశాలకు మాత్రం అధిక ప్రాధాన్యం యివ్వడం జరుగుతున్నది. ఈ విధమైన ధోరణికి స్వస్తిచెప్పాలి. ఇటువంటి అసమగ్రమైన, అసంపూర్ణమైన పరిష్కార ఫలితం మరింత అసంతృప్తికి, అసహనానికి దారి తీస్తున్నది. అశాంతి నివారణకు పరిష్కారం బహుముఖాలుగా ఉండాలని విద్యా కమీషన్ పేర్కొన్నది. ప్రభుత్వం, రాజకీయవాదులు, విశ్వవిద్యాలయాలు, ఉపాధ్యాయులు, సాధారణ ప్రజలు, తల్లిదండ్రులు, విద్యార్థులు మొదలైన వారందరికి సంబంధించిన పరిష్కార మార్గం కనుగొనాలి. ఈ పరిష్కారం అంత సులువైనదికాదు. ఈ సమస్యను కూలంకషంగా పరిశీలించి తాత్కాలిక, దీర్ఘకాలిక చర్యలను తీసుకోవాలి.

విద్యార్థుల అశాంతి దానికదే వ్యాధి కాదని గుర్తించడం చాలా అవసరం. ఈ వ్యాధికి రెండు కారణాలు ఉన్నాయి. ఉన్నత విద్యా పద్ధతిలో గల బలహీనతలు, సాధారణ,సాంఘిక అవ్యవస్థ. మొదటి అంశానికి సంబంధించిన నివారణమార్గం పూర్తిగా కాకున్నా కొంతవరకైనా విద్యాపద్ధతులపై ఆధారపడిఉన్నది. రెండవ అంశానికి నివారణమార్గం, బయటి ప్రపంచానికి సంబంధించినది. తగిన నివారణ ఫలితాలను సాధించడానికి రెండు అంశాలకు సంబంధించి ఒకేసారి చర్యలు తీసుకోవాలి.

## దీర్ఘకాలిక కార్యక్రమం

మన ఉన్నత విద్యా విధానంలోగల లోపాలు, విద్యార్థి అశాంతికి ప్రధానకారణం. అది విద్యార్థి లోకంలో అశాంతిని రేకెత్తించడమేగాక సంఘవ్యతిరేక శక్తులు, అరాచక శక్తులు అవకాశమేర్పడి బలపడడానికి కూడ హేతువు అవుతున్నది. అందువల్ల దీర్ఘకాలిక ప్రాతిపదికపై విద్యార్థుల అశాంతిని నివారించడానికి ఉన్నత విద్యా విధానాన్ని పటిష్ఠంచేసి జాతీయాభివృద్ధికి అనుబంధంగా రూపొందించాలి. ఈ పునర్వ్యవస్థీకరణకు విద్యా విషయక కమీషన్ మూడు కార్యక్రమాలను ప్రధానంగా సూచించింది.

మొదట —— విద్యాస్థాయిని తగినంతగా పెంపొందించాలి. ఉపాధ్యాయుల అర్హతలు, బోధనాశక్తిని అభివృద్ధి పరచాలి. పాఠ్య ప్రణాళికలను సవరించి, అభివృద్ధిచేయాలి. విద్యాబోధన విధానాలలో తీవ్రమైన మార్పులు తీసుకరావాలి. పాఠాలను బట్టీపెట్టడంగా గాక విద్యార్థులలో సృజనాత్మక శక్తిని పెంపొందించే విధంగా చూడాలి. విశ్వవిద్యాలయాలు, కళాశాలలో తగిన సౌకర్యాలు కల్పించాలి. విద్యార్థులు వారంలో 50-60 గంటలకు తక్కువ గాకుండా పరిశ్రమించేటందుకు అవసరమైన కార్యక్రమాలను అమలు జరపాలి. ఈ బృహత్తర కార్యక్రమాన్ని జాగ్రత్తగా రూపొందించి, పటిష్ఠవంతంగా అమలు జరపడానికి వచ్చే పదేళ్లలో ఎక్కువ మొత్తంలో నిధులు కావాల్సి ఉంటాయి.

ఇక రెండవది–సాధారణ విద్యార్థికి కూడ ప్రయోజనకరంగా ఉండే విధంగా ఉన్నత విద్యా విధానాన్ని రూపొందించాలి. విశ్వవిద్యాలయస్థాయి విద్యను పూర్తిచేసిన ప్రతి విద్యార్థికి తగిన ఉపాధి లభించే విధంగానూ, ప్రతిముఖ్యమైన పనికి శిక్షణపొందిన అభ్యర్థి లభించే విధంగాను సౌకర్యాలు కల్పించాలి. విద్య, ఉపాధి కల్పనల మధ్య పూర్తిగా సమన్వయంలేదు. ప్రత్యేకంగా కామర్సు, ఆర్ట్స

డిగ్రీ కోర్సులలో ప్రవేశానికి సంబంధించిన విధానాలలో సక్రమ పద్ధతులులేవు. ప్రస్తుతవువిధానాలకు వెంటనే స్వస్తిచెప్పాలి. శ్రామిక శక్తి అవసరాలను దృష్టిలో ఉంచుకొని మెరిట్ ప్రాతిపదికపై నిర్వహించే విధంగా ఉన్నత విద్యా విధానాలను రూపొందించాలి. జాతీయ ప్రయోజనాలను, ముఖ్యంగా వ్యక్తుల ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని ఒత్తిడులు, పలుకుబడులకు తావులేకుండా వ్యవహరించాలి.

## దేశాభివృద్ధి కృషి

భారత దేశం వంటి వెనుకబడిన దేశం అభివృద్ధిసాధించి మిగతా దేశాలలో సముచిత స్థానాన్ని పొందడానికీ, రక్షణ, దారిద్ర్యం, ఆహార స్వయంసమృద్ధి, జాతీయ, సాంఘిక సమైక్యతా సమస్యలను సమర్థవంతంగా పరిష్కరించడానికీ ఉన్నత విద్య, ఆధునిక జీవన విధానాల పరిచయం, సాంఘిక సేవానిరతి, నిస్వార్థత, దేశభవిష్యత్తు విషయంలో ప్రగాఢమైన విశ్వాసం, సమాజాభివృద్ధికి అంకితమైన యువతరం నాయకత్వం చాలా అవసరం. ఈ కార్యక్రమంలోని మూడవ అంశం, ప్రధానాంశం ఉన్నత విద్యలో భాగంగా జాతీయసర్వీసును చేర్చాలి. జాతి పునర్నిర్మాణం దృష్టిలో యువతీ యువకులు ప్రధాన పాత్ర నిర్వహించే విధంగా ఉండాలి. తత్ఫలితంగా ఈ మహత్కృషిలో తాముకూడా భాగస్వాములమనే భావం వారిలో కలుగుతుంది. ఈ అంశానికి సంబంధించిన సమస్యను యింతవరకు విస్మరించడం జరిగింది.

యువశక్తిని నిర్మాణాత్మక కార్యక్రమాలలో సక్రమంగా వినియోగించడానికి వీలుగా, ప్రాముఖ్యతా ప్రాతిపదికపై ఈ కార్యక్రమాన్ని అమలు జరపడం అవసరం. ఈ కార్యక్రమం అవసరాన్ని గూర్చి ప్రధానమంత్రి పదేపదే నొక్కిచెప్పారు. అవాంఛనీయమైన పరిస్థితులు కొనసాగుతూ విద్యాసంస్థలు మూసి వేసిన సంఘటనలు జరుగుతున్నప్పటికీ ప్రధానమంత్రి పిలుపునందు కొని ఉత్తరప్రదేశ్, బీహారులలోని విద్యార్థులు, కరువు, వరదల పరిస్థితులు ఏర్పడిన ప్రాంతాలకు అధికసంఖ్యలో వెళ్ళి సహాయక కార్యక్రమాలను అమోఘంగా నిర్వహించారు. జాతీయ సర్వీసును, ఉన్నత విద్యలో సక్రమ పద్ధతిలో సమన్వయపరచి, దీర్ఘకాలిక ప్రాతిపదికపై అమలు జరిపినప్పుడు సత్ఫలితాలను సాధించవచ్చునని దీనివల్ల రుజువు అవుతుంది.

## స్వల్పకాలిక చర్యలు

పైన పేర్కొన్నవి దీర్ఘకాలిక ప్రాతిపదికపై అమలుజరిపే కార్యక్రమాలు—ఈ కార్యక్రమాలకు ప్రాధాన్యం యిస్తూనే తక్షణం అమలు జరపాల్సిన కొన్ని స్వల్పకాలిక చర్యల అవసరాన్నికూడ గుర్తించాలి. ఈ విషయంలో అనేక మార్గాలను సూచించవచ్చు. మొదట నాలుగవ ప్రణాళికా కాలంలో దీర్ఘకాలిక కార్యక్రమం అమలును ప్రారంభించాలి. దీనికి అవసరమైననిధులను కేటాయించాలి. విద్యార్థులందరికీ, ఆలస్యం లేకుండా, పాఠ్యపుస్తకాలన్నీ లభించే కనీస సౌకర్యాన్ని కల్పించాలి. దీనికి విశ్వవిద్యాలయాలు, కళాశాలలన్నిటిలో పాఠ్యపుస్తకాల గ్రంథాలయాలను ఏర్పాటుచేయాలి. పెద్దపట్టణాలలో తగిన సంఖ్యలో పఠనాలయాలను ప్రభుత్వంకూడ నిర్వహించాలి.

మూడవది ఇది చాలా ముఖ్యమైనది. ఈ సమస్యపై మనకు గల సంప్రదాయసిద్ధమైన దృక్పథాన్ని పూర్తిగా మార్చాల్సివుంది. గత కొన్ని సంవత్సరాలుగా పెద్దవయస్కులు, చిన్నవయస్కుల మధ్యవున్న అగాధం మరింత విస్తృతం అవుతున్నది. ఉపాధ్యాయ వర్గంలో ఎక్కువభాగం ఉన్నత వర్గాలు, మధ్యతరగతికి చెందినవారు ఉన్నారు. ఇప్పుడు విశ్వవిద్యాలయాలు, కళాశాలల్లో ప్రవేశిస్తున్న యువతరాన్ని అర్థం చేసుకోవడం వారికి క్లిష్టమవుతున్నది. స్వాతంత్ర్యం లభించిన తర్వాత జన్మించిన ఈ యువతీ యువకులు, నూతన వాతావరణంలో పెరిగినారు. నేటి ఉపాధ్యాయులకు అంతగా పరిచయంలేని, సన్నిహిత సంబంధంలేని సాంఘిక వర్గాలు, కుటుంబాలనుండి వచ్చే విద్యార్థుల సంఖ్య అధికంగా ఉంది.

## నూతన దృక్పథం

అంతేగాక విద్యార్థులతో వ్యవహరించటంలో మన సాధారణ దృక్పథం వైరుధ్యమైనది గాను, సాధికారికమైనదిగాను వుంటున్నది. సాధారణంగా ఉపాధ్యాయులు, విద్యార్థులకు ఏది హితమైనదో తమకు తెలిసినట్లుగా భావించుకుంటారు. విద్యార్థుల సంక్షేమం ప్రాతిపదికపైన ఉన్నత విద్యా విధానాన్ని నిర్దేశించడం మంచిదనుకుంటారు. విద్యార్థి ఏమిని కోరుతున్నాడో తెలుసు కోవడానికి ప్రయత్నించడం కంటే దీనిని ఊహించుకోవడానికే వారు ప్రాముఖ్యం ఇస్తారు. సంప్రదాయికమైన ఈ దృక్పథం ప్రాతిపదిక లోపభూయిష్టమైనది. ఆధునిక పరిస్థితులకు ఇది పూర్తిగా అననుగుణ్యమైనది. తండ్రి తన పుత్రుని—అతనికి పదహారు సంవత్సరాలు నిండిన పిమ్మట—'మిత్రుని' గా చూసుకోవాలన్న సూత్రం ఈ నాడు అమలులో పెట్టదగినది. విశ్వవిద్యాలయాలలో వివిధ సాంఘిక వర్గాలకు చెందిన వారుగా విద్యార్థులను, ఉపాధ్యాయులను పరిగణించడం పొరపాటనీ, ఉభయులు ఉన్నత విద్యావిధానంలో ప్రతిఒక్కరూ విద్యార్థియేననీ—విద్యార్థులు 'జూనియర్' విద్యార్థులైతే, ఉపాధ్యాయులు 'సీనియర్' విద్యార్థులనీ విద్యాకమిషను పేర్కొన్నది.

ఈ కొత్త దృక్పథం మేరకు దీనిని విద్యార్థులకు విస్తృతంగా వర్తింపజేసే విధంగా విశ్వవిద్యాలయాలు, కళాశాలల పరిపాలనను చాలా వరకు మార్పుచేయవలసి వుంటుంది. ఉదాహరణకు విద్యా కమిషను సూచించిన విధంగా వివిధ శాఖలలో లేక విభాగాలలో పనిచేసే విద్యార్థి—ఉపాధ్యాయుల సంయుక్త సంఘాలను ప్రతికళాశాలలోనూ, ప్రతివిశ్వవిద్యాలయంలోనూ నెలకొల్పవలసి వుంటుంది. ఉన్నత స్థాయిలో విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు లేక కళాశాల ప్రిన్సిపాలుతో 'ప్లీనరీ కమిటీ' వుండాలి. ఈ కమిటీలు ఉమ్మడి అంశాలను చర్చించి ఉభయ పక్షాలకు ఆమోదయోగ్యమైన మార్గాలను సూచించాలి.

క్రమశిక్షణ నిర్వహణలో విద్యార్థులకు కూడా అవకాశం

ఇవ్వాలి. వ్యక్తిగతంగా క్రమశిక్షణను పాటించడమే ఉత్తమ క్రమశిక్షణ విధానం. విద్యార్థులను మరింత బాధ్యతాయుతులుగా రూపొందించడానికై మనం వారిని 'వయోజనులు' గా పరిగణించాలి. విద్యాసంస్థలు పెరుగుతున్నట్లు "పరస్పర విశ్వాసం ప్రేమానురాగాలు, గౌరవ భావం ప్రాతిపదికపైన సమాజశ్రేయానికై విద్యార్థులు, ఉపాధ్యాయులు మధ్య మైత్రీభావాన్ని పెంపొందించడానికి" మనం కృషిచేయాలి.

## కొత్తవిధానాలు అవసరం

ప్రభుత్వానికీ, విశ్వవిద్యాలయాలకూ చెందిన కొన్ని పరిపాలనా విధానాల్లో మార్పులు అవసరం. అనేక లోపాలు, పొరపాట్లు జరిగినప్పటికీ, ఇటీవల సంవత్సరాలలో ఉద్యమాలూ, హింసాచర్యలవల్ల మరేదీ విషయం సాధించలేమనే అభిప్రాయం నాటుకొని పోయింది. ఇటువంటి వాతావరణం కొనసాగుతున్నట్లయితే ప్రజాస్వామ్యం అస్తిత్వానికే ముప్పు వాటిల్లుతుంది. శాంతి భద్రతలను నెలకొల్పడం, ఉద్యమాలు హింసాచర్యలు నిష్ప్రయోజనమైనవని ప్రజలు గుర్తించడానికి దోహదం చేసే పరిస్థితులను కల్పించడం ప్రభుత్వ ప్రథమ కర్తవ్యం. శాంతియుత మార్గాలను అవలంబించినప్పుడు విద్యార్థుల న్యాయమైన కోర్కెలు కూడా తరచుగా ఉపేక్షించబడడం కద్దు. కాని ఉద్యమం ప్రారంభించి హింసాచర్యలకు పూనుకున్నప్పుడు అసమంజసమైన కోర్కెలను కూడా తొందరపాటుగా మన్నించడం జరుగుతుంది. వివేచన కలిగి, ధైర్యం ప్రదర్శించగలిగి, సానుభూతి వహించగలిగి, అవసరమైనప్పుడు కఠినంగా ప్రవర్తించగలిగిన పరిపాలనా వ్యవస్థ అవసరం.

ఇటువంటి పరిపాలనా వ్యవస్థను రూపొందించడానికి రెండు ముఖ్య కార్యక్రమాలు కావాలి. మొదటిది— విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా, కళాశాలల ప్రిన్సిపాల్స్‌గా యోగ్యులైన వ్యక్తులను ఎన్నిక చేసుకోవాలి. వారికి తగిన అధికారాలను సంక్రమింప చేయాలి. తమ తమ విద్యాసంస్థలలో క్రమశిక్షణను పాటింపచేయడానికీ, మంచి వాతావరణాన్ని కల్పించడానికీ వారిని బాధ్యులను చేయాలి. రెండవది— రాజకీయ నాయకులందరూ హింసాచర్యలను నివారించి ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించడానికి కాయశక్తులా కృషి చేయాలి. విద్యార్థి దశలో హింసా చర్యలకు స్థానం లేదు. కనుక వాటిని తప్పనిసరిగా పరిహరించాలి. అహింసకు కట్టుబడి వుండడానికీ; శాంతియుత విధానాలు, చర్చలు, సంప్రదింపుల ద్వారానే తమ కోర్కెలను నెరవేర్చుకోవడానికి విద్యార్థులు, ఉపాధ్యాయులు ప్రతిన బూనాలి. అహింసా మార్గాలద్వారా సాంఘిక కోర్కెలను సాధించుకునే అద్వితీయమైన విధానాన్ని భారత దేశం ప్రపంచానికి ప్రసాదించింది. అందుచేత ఈ అమూల్య సంప్రదాయాన్ని— వారసత్వాన్ని— పరిపోషించి మార్గదర్శకత్వం వహించవలసిన నైతిక బాధ్యత విద్యార్థులు, ఉపాధ్యాయులపైన వుంది.

ఉన్నత విద్యలో ఉన్నత నైతిక ప్రమాణాలనూ, ఉత్తమ పరిపాలనా విధానాలనూ పరిపోషించడానికై చిత్తశుద్ధిగా కృషి జరగాలి. ప్రవేశాల్లోనూ, పరీక్షల్లోనూ మరింత కఠినత, సంకుచితత్వాల ప్రాబల్యం వుంటుందనీ, విశ్వవిద్యాలయ పరిపాలనలో కొన్ని విషయాల్లో అవినీతికి స్థానం వుంటుందనే భావాలు యువ విద్యార్థిని అన్నింటికంటే అధికంగా కల్లోలపరుస్తాయి. అందుచేత స్వచ్ఛమైన, నిష్పాక్షికమైన, సమర్థవంతమైన పరిపాలన నేడు ముఖ్యావసరం. ఇటువంటి పరిపాలనా వ్యవస్థను ఏర్పరచడం ప్రభుత్వం యొక్క ప్రధాన కర్తవ్యం. విశ్వ విద్యాలయాలు, కళాశాలలు ఉన్నత నైతిక ప్రమాణాలను పాటించడం ద్వారా మార్గదర్శకత్వం వహించవచ్చు.

ఈ సూచనలను ప్రధానంగా విద్యాసంస్థల అధికార్లు అమలు జరపవచ్చు. ప్రభుత్వమూ, ఇతర సంబంధీకులు కూడా తోడ్పాటు చర్యలు గైకొన్నట్లయితే వారికి చేయూత లభిస్తుంది. ఉద్యోగావకాశాలు విస్తృతపడతాయి. ఉన్నత విద్యను అభివృద్ధి పరచేందుకు నిధులు చేకూర్చడం, యోగ్యులైన ఉపాధ్యక్షులను నియమించడం, స్వచ్ఛమైన, సమర్థమైన పరిపాలనా వ్యవస్థను ఏర్పరచడం, ఉద్యమాలు ఆందోళనలు నిష్ప్రయోజనమైనవని ప్రతి ఒక్కరూ గ్రహించి మెలిగేటటువంటి సాంఘిక వాతావరణాన్ని కల్పించడం ప్రభుత్వ కర్తవ్యం అని ఇదివరకే పేర్కొనడం జరిగింది.

## విద్యార్థులు—పోలీసులు

పోలీసుల పాత్రను గురించి కూడా చెప్పవలసివుంది. ఈ విషయం కూడా వివాదగ్రస్తమైనదే. పోలీసుల జోక్యం కల్పించుకునే తీరు, తరుణంలోనూ ఉపాధ్యాయులూ, పోలీసుల బాధ్యత విషయంలోనూ వాదవివాదాలు జరిగాయి. ఒక విధంగా ఈ వివాదాలు అవాస్తవికమైనవి. పోలీసులను విద్యాసంస్థలు, ఉపాధ్యాయులు, విద్యార్థులు మిత్రులుగా పరిగణించాలి. విద్యాసంస్థలలో క్రమశిక్షణనూ, శాంతియుత వాతావరణాన్నీ పరిపోషించవలసిన బాధ్యత ఉభయులపైనా వుంది. విద్యార్థులకు పోలీసులకు మధ్య విరోధభావం పెంపొందుతున్నది. ప్రస్తుత పరిస్థితిని కలవరపరుస్తున్న ముఖ్యాంశం ఇది. ఈ పరిస్థితి అదుపులేకుండా ఇలాగే కొనసాగినట్లయితే పరిణామం విషమంగా వుంటుంది. కనుక, గత సమావేశంలో చేయబడిన ప్రయోజనకరమైన అనేక అధికార సూచనల ప్రకారం, విద్యార్థులు, ఉపాధ్యాయులు, పోలీసుల మధ్య సన్నిహితమైన, సుహృద్భావ పూర్వకమైన సంబంధాలను నెలకొల్పడానికి పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ చర్యలు తీసుకోవాలి. విద్యాసంస్థల ఆవరణ ప్రాంతాలలో క్రమశిక్షణను పరిపోషించవలసిన ప్రాథమిక బాధ్యత విద్యాసంస్థల అధిపతులకు వుండాలి. వారికి సహాయం చేయడానికి, సలహాలివ్వడానికి పోలీసులు సిద్ధంగా వుండాలి. బాహ్యశక్తులు తమ కార్యక్రమాలన్నింటిలోనూ హింసాచర్యలకు తావులేకుండా చేయడం ద్వారా ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించడానికి పాటుపడాలి.

ఈ సమస్యాపరిష్కారాన్ని సులభం చేయడానికి ప్రాముఖ్యంగల ప్రతి సమాజవర్గమూ సహాయపడాలి. ఉపాధ్యాయులపైన గురుతరమైన బాధ్యత వుంది. వారు సక్రమ నాయకత్వంవహించి

తమ విద్యార్థుల సంక్షేమానికి తీవ్రంగా పూనుకున్నట్లయితే ఈ బృహత్కార్యంలో సగం విజయం సాధించినట్లుగానే పరిగణించవచ్చు. విద్యార్థుల తల్లిదండ్రులు కేవలం సందర్శకులుగానే చూస్తూ మౌనం వహించకూడదు. విద్యార్థులకు సక్రమంగా మార్గదర్శకత్వం వహించడంలోనూ, అవాంఛనీయమైన సంఘటనలను నిరోధించడంలోనూ వారు ఉపాధ్యాయులతో కలిసి పని చేయాలి. రాజకీయ పార్టీలుకూడా సముచితమైన పాత్ర వహించాలి. రాజకీయపార్టీలు కలిసి విద్యార్థులకు సంబంధించి ఒక ఉమ్మడి ప్రవర్తనా నిబంధనావళి రూపొందించి దానిని ఖచ్చితంగా పాటించాలి. పెద్దలు దేనిని బోధించినా యువతరం వారు ఆచరణలోనూ, ప్రవర్తనలోనూ, దానిని అనుసరిస్తారనే సత్యాన్ని మనం గుర్తించడం అన్నిటికంటే ముఖ్యమైన అంశం. బాహ్యంగా రాజకీయ జీవితంలోనూ, సాంఘిక జీవితంలోనూ జరుగుతున్నదానికి ప్రస్తుత విద్యార్థుల ప్రవర్తన ఒక విధంగా ప్రతిబింబమేననవచ్చు.

ఈ సమస్య ప్రాధాన్యతను గూర్చిగానీ, తక్షణ అవసరాన్ని గూర్చిగానీ గోరంతను కొండంతగా చెప్పడం అసాధ్యమైన విషయం. అన్ని రంగాలలోని భవిష్యత్ నాయకత్వం నేటి విశ్వవిద్యాలయాలనుండీ, కళాశాలలనుండీ లభిస్తుంది. అందువల్లనే, విశ్వవిద్యాలయాలు తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తే జాతికి, ప్రజలకు క్షేమకరమని పండిత జవహర్‌లాల్ నెహ్రూ అన్నారు. విద్యార్థిలోకంలో అశాంతి పరిస్థితులు ప్రబలడం జాతీయశక్తిని సన్నగిల్లచేయడమేననీ, దానివల్ల జాతి భవిష్యత్తు అస్తవ్యస్తం అవుతుందనీ మనం గుర్తించాలి. ఆధునిక ప్రపంచంలో విద్యార్థులు, శక్తిసామర్థ్యాలుగల సాంఘికవర్గం. తగిన విధంగా శిక్షణయిస్తే వారు భవిష్యత్ నిర్మాతలుగా రూపొందుతారు. తద్భిన్నంగా నేటి పరిస్థితులే కొనసాగితే అరాచకశక్తులు ప్రబలుతాయి. ప్రస్తుత పరిస్థితులలో అన్ని వర్గాలవారు, ప్రత్యేకంగా విద్యావిషయాలతో రాజ్యాంగరీత్యా బాధ్యత వహించే రాష్ట్రప్రభుత్వం విస్తృత ప్రాతిపదికపై తక్షణం పటిష్టవంతమైన చర్యలు తీసుకోవాలి. ఉన్నత విద్యాప్రమాణాలను నెలకొల్పడంలో కేంద్ర ప్రభుత్వం ప్రయోజనాత్మకమైన చర్యలు తీసుకోవాలి.

* * * *

## బాలభారతి

ఆపదలో అసాధారణ ధైర్య సాహసాలను ప్రదర్శించిన బాలురు తొమ్మండుగురికి యీఏడాది జాతీయశిశుసంక్షేమమండలి బహుమతులను ప్రకటించింది. వీరిలో ఎనమండుగురు జనవరి 26వ రాజధానీ నగరంలో జరిగే రిపబ్లిక్ దినోత్సవాలలో పాల్గొని బహుమతులను అందుకుంటారు. వెండిపతకం, సర్టిఫికెట్టు వీరికి యిస్తారు. ఒక బహుమతి-మరణానంతరం యిచ్చే బహుమతి కలకత్తాకు చెందిన అనిమేష్‌కుమార్‌కు లభిస్తుంది. అతడు మునిగిపోతున్న తన మిత్రుని రక్షించబోయి ప్రాణాలు కోల్పోయాడు. అతని ధైర్య సాహసాలకు, మరణానంతరం యిచ్చే బహుమతి ప్రకటించబడింది. కలకత్తాలో ప్రత్యేకంగా ఏర్పాటుచేసే కార్యక్రమంలో రాష్ట్ర గవర్నరు యీ బహుమతిని అతనికుటుంబీకులకు అందజేస్తారు.

## అల్పసంఖ్యాకవర్గాలు

### ఆంధ్రప్రదేశ్‌లో మాతృభాషల వారీగా అల్ప సంఖ్యాక ప్రజలు

(1961 జనాభా లెక్కలు)

| భాష | జనసంఖ్య (లక్షలలో) | మొత్తం జనాభాలు శాతం |
|---|---|---|
| ఉర్దూ | 25.54 | 7.1 |
| తమిళం | 4.35 | 1.2 |
| కన్నడం | 3.82 | 1.1 |
| మరాఠీ | 2.77 | 0.8 |
| ఒరియా | 1.89 | 0.5 |

## గిరిజన సంక్షేమం

నల్గొండ జిల్లాలోని దేవరకొండ తాలూకాలో చెంచులు నివసిస్తుంటారు. నాగార్జునసాగర్ ఆనకట్ట నిర్మాణం వల్ల వీరు నివసించేప్రాంతం జలమయమై పోయింది. అందువల్ల వీరిని చిట్యాల గ్రామానికి వలసపంపి, అక్కడ పునరావాస సౌకర్యం కల్పించబడింది. వారికొరకు అక్కడ పదిహేను ఇళ్ళతో ఒక కాలనీ ఏర్పడింది.

అప్రకటిత జాతుల సంక్షేమానికై ఏటా రూ. 1,40,000లు కేటాయించడం జరుగుతున్నది. ఈ మొత్తాన్నుంచి అప్రకటిత జాతులవారినిమిత్తం పాఠశాలలు, హాస్టలు తెరవడానికి, స్కాలర్‌షిప్పులను యివ్వడానికి, ఎద్దులు సరఫరాచేయడానికి, బావులు త్రవ్వడానికి, గృహనిర్మాణానికి డబ్బును వెచ్చిస్తారు. అప్రకటిత జాతులలో విద్యను బాగా విస్తరింప జేయడానికై జిల్లాలో 21 ప్రాథమిక పాఠశాలలు నడుపబడుతున్నాయి. ఈపాఠశాలల్లో 1,006 మంది విద్యార్థులు చదువు కొంటున్నారు. సాంఘిక సంక్షేమ శాఖనుండి సబ్సిడీ పొందుతున్న బంజారా హాస్టళ్లు ఆరు వున్నాయి.

దళిత జనుల

# షెడ్యూల్డ్ కులాలు - రెండు దశాబ్దాల ప్రగతి

"హరిజనులకు సేవచేయమని మనలను గాంధీజీ ప్రత్యేకంగా ఆదేశించారు. 1969లో గాంధీజీ శతాబ్ద్యుత్సవాలు జరిగేనాటికి ఈ విషయంలో కొంతవరకైనా ప్రగతి సాధించగలిగేటందుకు మనం యిప్పుడు కష్టపడి పనిచేయవలసి ఉన్నది. గాంధీజీ సంస్మరణకూ ఆయన ఆశయాలలో ఒక్కదాన్నైనా పూర్తిచేయగలిగేందుకూ ఇదే ఉత్తమ మార్గం."

—శ్రీమతి ఇందిరా గాంధి.

1947 లో దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి ప్రభుత్వం షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్ తెగలు, ఇతర వెనక బడిన వర్గాల వారి సంక్షేమం విషయంలో ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకుంటున్నది.

క్రిందటిసారి 1961 లో దేశంలో జనాభాలెక్కలు తయారు చేసినపుడు షెడ్యూల్డ్ కులాలకు చెందినవారు దేశంలో 6½ కోట్లు మంది వున్నట్టు తేలింది. మొత్తం జనాభాలో వీరి సంఖ్య నూటికి 15 వంతులు. వీరిలో సుమారు 6 కోట్ల 81 లక్షల మంది గ్రామ ప్రాంతాలలోనూ, 71 లక్షలమంది నగర ప్రాంతాలలోనూ నివసిస్తున్నారు.

గడిచిన రెండు దశాబ్దాల కాలంలోనూ, షెడ్యూల్ కులాల వారి ఆర్థిక, సాంఘికాభివృద్ధి విషయంలో, గణనీయమైన అభివృద్ధి సాధింపబడింది. ఈరోజున దేశంలో డాక్టర్లు, ఇంజనీర్లు, పార్లమెంటేరియన్లు, ప్రొఫెసర్లు మొదలైన వారిలో చాలామంది ఈ వర్గాలకు చెందినవారు వున్నారు.

దేశంలో వివిధ సర్వీసులలో షెడ్యూల్ కులాలవారి ప్రాతినిధ్యం ఆ యేడుకాయేడు పెరుగుతున్నది. 1959లో కేంద్ర ప్రభుత్వం శాఖకు సర్వీసులలో షెడ్యూల్డ్ కులాలకు చెందిన ఉద్యోగులు 2 లక్షల 15 వేల 940 మంది వుండగా, 1967 నాటికి ఆ సంఖ్య 3 లక్షల 11 వేల 425 కు పెరిగింది.

షెడ్యూల్డ్ కులాల వారిని సర్వీసులలో అధికంగా ప్రవేశ పెట్టుకోటానికి ప్రభుత్వం అనేక చర్యలు తీసుకున్నది. అఖిల భారత ప్రాతిపదిక మీద అభ్యర్థులను సరాసరి ప్రవేశపెట్టుకునే ఉద్యోగాలలో నూటికి 12 వంతులు షెడ్యూల్డ్ కులాల వారికి కేటాయించారు. పోటీపద్ధతిని కాకుండా ఇతర విధంగా అభ్యర్థులను ప్రవేశపెట్టుకునే ఉద్యోగాలలో సుమారు నూటికి 17 వంతులు వీరికై ప్రత్యేకించడం జరిగింది. ప్రమోషన్ విషయంలో కూడా నూటికి 12 వంతులు వీరికై కేటాయించారు.

సర్వీసులలో షెడ్యూల్డ్ కులాల వారికి తగినంతగా ప్రాతినిధ్యం వుండేట్టు చేయటానికిగాను ప్రభుత్వం అనేక చర్యలు తీసుకున్నది. వీరికి కేటాయించిన ఉద్యోగాలకు షెడ్యూల్డ్ కులాలకు చెందిన అభ్యర్థులు లభ్యపడక పోయినచో ఇతరులతో పూర్తిచేయకుండా రెండు సంవత్సరాలపాటు వాటిని నిలిపి వుంచటం, ఆ ఉద్యోగాలను ప్రత్యేకంగా షెడ్యూల్డ్ కులాల వారికై కేటాయించినవిగా కాకుండా ఇతరులను కూడా వాటిలో ప్రవేశపెట్టుకోటానికి అవకాశం కల్పించేముందు, అందుకై ముందుగా దేశీయాంగ శాఖ అనుమతి బడయటం, ప్రమోషన్ విషయంలో సౌకర్యాలు కలగచేయటం, కనిష్ఠ వయఃపరిమితిని తగ్గించడం, విద్యార్హతలకు సంబంధించిన నిబంధనలను సడలించటం, విద్యార్థులకుగాను ప్రయాణపు ఖర్చులు యివ్వటం,— ప్రభుత్వం తీసుకున్న చర్యలలో యివన్నీ వున్నాయి.

ప్రభుత్వ రంగంలో యేర్పాటు చేయబడిన సంస్థలు కూడా షెడ్యూల్డ్ కులాల వారికి ఉద్యోగాలను కేటాయించే విషయంలో, భారత ప్రభుత్వ విధానాన్నే అనుసరిస్తున్నాయి. ప్రభుత్వ చట్టం ప్రకారం యేర్పాటైన సంస్థలు ప్రభుత్వరంగంలో యేర్పాటైన సంస్థలు, ఇతర సంస్థలు, మొత్తం 169 సంస్థలలోనూ 113 సంస్థలు, షెడ్యూల్డ్ కులాల వారికి కొన్ని ఉద్యోగాలను కేటాయించాలనే సిఫార్సును, యిప్పటికిప్పుడే ఆమోదించాయి.

షెడ్యూల్డ్ కులాల వారికి, షెడ్యూల్డ్ తెగలవారికి పరీక్షలకు ముందు శిక్షణ యివ్వడానికిగాను రెండు శిక్షణ కేంద్రాలను అలహాబాద్, రాంచీలలో యేర్పాటుచేశారు. యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ నిర్వహించే పోటీ పరీక్షలకు షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగల అభ్యర్థులలో కొంతమందికి వీటిలో శిక్షణ యిస్తారు. ఈ శిక్షణ కేంద్రాలను ప్రభుత్వం యేర్పాటుచేసింది. వీటిలో ఉచితంగా శిక్షణ యివ్వబడుతుంది. శిక్షణ పొందేవారికి ఉచితంగా వసతి సౌకర్యం, భోజన సౌకర్యం కూడా కలుగచేయబడుతుంది. రాష్ట్ర సర్వీసులలో ప్రవేశపెట్టుకోవటానికి జరిగే

# ఇన్నేళ్ళ తర్వాత.....

డాక్టర్ అరిపిరాల విశ్వం

మసక మసక జ్ఞాపకాల ప్రక్కన
ఎవరో బిక్కు బిక్కున నడిచిపోతున్న సవ్వడి-
మంచుకురిసే యీ రాత్రి-
మబ్బువిరిసిన యీ రాత్రి-
గుండెలోయల అంచుల్లో
ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్న ధ్వని-
ఇన్నేళ్ళ తర్వాత
కలలమీద, కన్నీళ్ళమీద
గతం మీద, స్వగతంమీద
ఎవరిదో హస్తస్పర్శ
చీకటిపైన-చిన్నతనంపైన
ఆకటిపైన-ఆలోచనపైన
ఎవరివో వెలుగుల జాడలు!
గదిగుప్పెట్లో రాత్రిని బంధించి
నాకోసం నవ్వే వసంతాల్లోకి
నన్ను నేనే తరుముకొని పోతున్న వేళ
మళ్ళీ పాడమని అడిగే
ఒకే ఒక్క గొంతు కోసం
రచిస్తాను రాగం లేని గీతాన్ని
ఆలాపం లేని సంగీతాన్ని.
ఇన్నాళ్ళ నించీ నన్నే పారేసుకున్న నేను
నిన్నింక ఎప్పుడూ పారేసుకోకుండా
ఏంపాడాలో? ఎలా పాడాలో? నాకేంతెలుసు
పలికించటం చేతగాని నా గొంతులో
నీవే పలికించు
ఏదో ఒక పాటనో-ఒకబాధనో



# చైతన్యమూర్తులు

## ప్రపంచంలోని సువిశాల ప్రజాస్వామిక వ్యవస్థకు అధినేత

శ్రీమతి ఇందిరాగాంధీ అక్టోబరు విప్లవ సమయంలో 1917 నవంబరు 19న జన్మించారు. చాలా చిన్నతనం నుండే రాజకీయాలలో ప్రవేశించారు. స్వాతంత్ర్యానికి పూర్వం, అలహాబాదులోని ఆమె పూర్వీకుల గృహం 'ఆనందనిలయం' అనేక యేండ్లుగా రాజకీయ కార్యకలాపాలకు కేంద్రిగా వుంటూవచ్చింది. తన 21వ యేట ఆమె కాంగ్రెసులో ప్రవేశించారు. స్వాతంత్ర్య పోరాటంలో ఆమె పదమూడు నెలలపాటు కారాగారవాసం అనుభవించారు. మూడు తరాలుగా ఆమె కుటుంబం వారు కాంగ్రెసు అధిష్టానగదె అధిష్టించారు. మోతీలాల్‌నెహ్రూ, వారి కుమారుడు జవహర్లాల్ నెహ్రూ, వారి కుమార్తె ఇందిరాగాంధీ – భారతజాతీయ కాంగ్రెసు అధ్యక్షపదవి నలంకరించారు.



శ్రీమతి ఇందిరాగాంధీ దృఢచిత్త. రెండేళ్ళ కాలంలోనే ఆమె తన నాయకత్వాన్ని సమర్థవంతంగానూ, సుగమంగానూ నిర్వర్తించి, ప్రజల మెప్పు పొందారు.

ప్రజలతో సన్నిహితంగా మెలిగి, వారి కష్టసుఖాలను తెలుసుకోవడం ఆమెలోని విశిష్ట వ్యక్తిత్వానికి నిదర్శనం. ప్రజాభ్యుదయానికీ, దేశప్రగతికీ సక్రమమైన పంథాను అనుసరిస్తూ, సరియైన కార్యక్రమాలను చేపట్టుతూ కోట్లాది ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్న ప్రధాని ఆమె.

సాంఘిక కార్యక్రమాలలోనూ, సహాయక కార్యక్రమాలలోనూ విరివిగా పాల్గొని, క్లిష్టసమయంలో ప్రజల నైతికవిలువలను సమున్నత స్థాయిని నిలుపడంలో అత్యంత ప్రతిభా సమన్వితగా వ్యవహరించిన ఘనత ఆమెది. భారత – పాకిస్తాను ఘర్షణప్పుడు సరిహద్దులలోని జమ్మూ, కాశ్మీరు తదితర సంఘర్షణ ప్రాంతాలలో పర్యటించిన తొలి కేంద్రమంత్రి ఆమె.

## జయప్రకాశ్ నారాయణ్



నాసిక్ సెంట్రల్ జైలుగేట్లు 1933వ సంవత్సరంలో ఒకనాడు పొద్దుగా, ఆకర్షణీయంగా కనిపిస్తున్న ఒక యువకుణ్ణి విడుదల చేయడానికని తెరుచుకున్నాయి. ఆ రోజుతో ఆ యువకుని జైలు శిక్ష గడువు ముగిసింది. భావి కాలపు చరిత్రకారుడు ఈనాటి సంఘటనలను గురించి వ్రాసినప్పుడు పైన పేర్కొన్న విడుదల ఉదంతాన్ని 1933వ సంవత్సరంలో జరిగిన ఒక గణనీయమైన సంఘటనగా ఉదహరించగలడనడంలో ఎంత మాత్రం సందేహం లేదు.

ఆ యువకుని విడుదలతో భారతదేశ రాజకీయాలు ఒక నూతన శక్తినీ, జవసత్వాలనూ సంతరించుకున్నాయి. జయప్రకాశ్‌నారాయణ్ ఒక ఉద్దేశంతో, ఒక దృక్పథంతో, ఒక ప్రయోజనంతో జైలు నుంచి బయటికి వచ్చారు.

ఈ నాడు భారత ప్రజలకు అత్యంత ప్రేమపాత్రులు, గౌరవనీయులు అయిన వారిలో ఆయన ఒకరు.

అయితే జయప్రకాశ్ యొక్క అద్భుతమైన, విశిష్టమైన వ్యక్తిత్వాన్ని గురించి కొద్ది మందికి మాత్రమే తెలుసు.

—యూసుఫ్ మొహారరీ

## ఝాన్సీ లక్ష్మీబాయి



1857 పోరాటంలో అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించిన వీరాంగన ఝాన్సీలక్ష్మీబాయి ఈమె వారణాసిలో జన్మించింది. భారతీయ మహిళలు స్వగృహంలో ఉత్తమ ఇల్లాండ్రు అయితే యుద్ధ రంగంలో ధీరోదాత్తులైన సైనికులు అని ఝాన్సీ లక్ష్మీబాయి ప్రపంచానికి చాటి చెప్పింది. ఆమె జీవితం మహోజ్జ్వలమైనది. తాను జీవించిన 23 సంవత్సరాల స్వల్పకాలంలోనే ఆమె తన పేరును చిరస్థాయిగా నిలిపే అద్భుత సాహసకృత్యాలు చేసింది. బ్రిటిష్ పరిపాలనను కూలద్రోయడానికి సాహసోపేతముగా పోరాడి ఆమె మనకు చిరస్మరణీయురాలైంది ఆంగ్లేయులు ఆమె పరాక్రమానికి ఆశ్చర్యచకితులయ్యారు విప్లవవాదులలో మేటి సైనికురాలుగా ఆమెను పరిగణించారు. లక్ష్మీబాయి బ్రిటిషు పాలననుండి విముక్తి పొంది స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది. తమ ప్రజలకు సుఖశాంతులు కలిగే సమర్థవంతమైన పరిపాలనను కొనసాగించింది.

బ్రిటిష్ సైనికాధికారులు భారత సైనికుల తిరుగుబాటులను అణచివేసి, అంతకు ముందు ఝాన్సీలో 16 రోజులుగా సాగుతున్న పోరాటంవైపు తమ దృష్టిని సారించారు. బ్రిటిష్ సైనికులతో పోల్చినపుడు ఆమెవద్ద సైనిక సామాగ్రి చాలా తక్కువగా ఉంది. ఆమె శత్రువుల బారినుండి తప్పించుకొని గ్వాలియర్ వెళ్ళింది. అశ్వం అధిరోహించి, ఖడ్గధారిణిఅయి ఆమె వీరోచితంగా పోరాడింది.

సాహసవంతంగా పోరాడుతూ 1858 జూన్ 17వ తేదీన ఆమె కన్ను మూసింది. ఝాన్సీ లక్ష్మీబాయి స్మృతి అసంఖ్యాకులైన భారత ప్రజలకు ఉత్తేజం కలిగిస్తుంది. తమ గృహ కృత్యాలలోనేగాక, చెడును నిర్మూలించే కృషిలో ఉత్తమమైన పాత్ర వహించి నిర్వర్తించే మహిళలకు ఆమె మార్గదర్శకురాలు. చరిత్ర పుటలలో ఝాన్సీ లక్ష్మీబాయి జీవిత గాథ ప్రకాశిస్తూ ఉంటుంది.

## గురునానక్ దేవ్



గురునానక్‌ను, ఆయన యుగానికి చెందిన మహాపురుషులలో గొప్ప వ్యక్తిగా పేర్కొనవచ్చు ఆయన శక్తి అజేయమైనది. అభినివేశం తరగనిది. దేశంలోనే కాకుండా విదేశాలలో కూడా ఆయన విస్తృతంగా జరిపిన పర్యటనలే ఇందుకు నిదర్శనం. జీవితపు అద్భుత సత్యాలను ఆయన జనసామాన్యానికి చాలా తేలిక భాషలో బోధించారు ఉత్తర భారతదేశం అంతటా ఇంటింటా ఆయన నీతికథలు చెప్పుకుంటారు.

ఏడవయేట నానక్‌ను గ్రామ బడిపంతులుకు విద్యాభ్యాసానికై అప్పగించారు ఆయన కొంతకాలం వరకు పాఠశాలకు క్రమం తప్పకుండానే వెళ్లాడు. కాని ఆయన పుస్తకాలు చదవకుండా ఉంటున్న సంగతిని పంతులు తెలుసుకున్నాడు. అప్పుడు పంతులు ఆయనను పుస్తకాలు చదవకపోవడానికిగల కారణాన్ని గురించి అడిగాడు. దానికి నానక్, పంతులును 'నాకు విద్యాబోధన చేసేటంత విజ్ఞానం మీకు ఉందా?' అని ఎదురు ప్రశ్న వేశాడు. అంతట పంతులు తాను అన్ని విషయాలు చదివానని చెప్పాడు. అప్పుడు నానక్, దైవికమైన విజ్ఞానమే తనకు ప్రధానమనీ, దానినే తాను అధ్యయనం చేస్తాననీ గట్టిగా సమాధానం చెప్పాడు.

నానక్ సన్యాసి అయినప్పటికీ ఆయన హృదయం మానవ సుఖదుఃఖాలకు నిలయమైఉండేది.

గురు నానక్‌కు గల కొన్ని మహిమలనుగూర్చి నిరాకరించడం చాలా కష్టం. వాటికి కొన్ని ప్రత్యక్ష నిదర్శనాలు ఉన్నాయి. గురునానక్ మహత్యాలు కొన్ని సిక్కుల పవిత్ర గ్రంథమైన గురు గ్రంథ్ సాహేబులో భాగంగా ఉన్నాయి. ఈ విభాగాలను 'జప్జీ', 'ఆసదివార్', 'రాహిరాస్', 'నోహిలా' పేర్లతో వ్యవహరిస్తుంటారు. వాటిలో చేర్చబడిన గీతాలు ఎంతో మృదుమధురంగా, మనోహరంగా ఉంటాయి.

గురు నానక్ తర్వాత తొమ్మిదిమంది గురువులు వచ్చారు. అందులో ప్రతి ఒక్కరు సిక్కుమతాన్ని, విశ్వాసాలను విస్తరింప జేయడానికి కృషిచేశారు. ఐతే గురుగోవింద్ సింగ్ కృషి అపూర్వమైనది. హిందీ కావ్యజగత్తులో అమూల్యమైన గ్రంథ్ సాహెబును ఆయన పూర్తిచేశారు. అందులో కబీర్, రామ్‌దాస్, దాదూ దయాల్ తదితరుల కవితా కుసుమాలను పొందు పర్చారు.

## పండిత మదనమోహన మాలవ్యా



ప్రజాసేవలోకానీ, నిస్వార్థ కృషిలోకానీ ఒక్క గాంధీజీతప్ప మాలవ్యాజీతో సాటివచ్చే వ్యక్తి మరొకరు లేరనడంలో అతిశయోక్తిలేదు.

ఆయన ప్రాపంచికమైన దైనందిన వ్యవహారాలలో నిమగ్నమవుతూనే తన కృషికి ఒక విశిష్టతను సంతరించుకున్నారు. "గౌరవానికి భిన్నంగా ఏమీ ఆచరించకుండా ఆలోచించకుండా" అపూర్వమైన పరీక్షను ఎదుర్కొనగలిగారు. మన ప్రజానాయకులలో గాంధీజీకంటే కూడా మిన్నగా హైందవ సంస్కృతిలోని ఉత్తమ లక్షణాలన్నింటినీ మాలవ్యాజీ పుణికిపుచ్చుకున్నారు. ఆయన హిందూ ధర్మాన్ని గొప్పగా పరిపోషించారు. కీ. శే. చింతామణి ఆయనను ధర్మాత్ముడిగా పేర్కొన్నారు.

పండిత మాలవ్య జాతీయ ఉద్యమాలలో, రంగాలలో ఆరు శతాబ్దాలకు పైగా ప్రముఖపాత్ర నిర్వహించారు. గొప్ప విజయాలు సాధించారు. మాలవ్యాజీ తమ జీవితకాలపు రెండవ దశాబ్ది ఆరంభంలో ద్వితీయ కాంగ్రెసు మహాసభల సందర్భంలో విజ్ఞుల దృష్టిని ఆకర్షించారు. మూడవ దశాబ్దిలో ఉపాధ్యాయుడుగా, న్యాయవాదిగా, పత్రికా రచయితగా గణుతికెక్కారు. నాలుగవ దశాబ్దిలో శాసన సభ్యుడుగా రాణించారు. కాంగ్రెసు అధ్యక్షపీఠాన్ని అలంకరించారు. అయిదవ దశాబ్దిలో స్వయంకృషితో బెనారస్ హిందూ విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. రెండవ పర్యాయం కాంగ్రెసు సంస్థకు సారథ్యం వహించారు. ఆరవ దశాబ్దిలో ఒక ప్రక్క హిందూ సమాజాన్ని వ్యవస్థీకరిస్తూనే మరొకప్రక్క కఠిన కారాగార శిక్షలు అనుభవించారు. ఏడవ దశాబ్దిలో విదేశంలో రౌండుటేబుల్ మహాసభకు హాజరై మాతృభూమి హక్కులకై వాదించారు......

మాలవ్యాజీ వలె మన శాసనసభల్లో అంతటి అధికారికమైనకంఠంతో మరే హిందువూ మాట్లాడలేదు. క్లిష్టసమయాల్లో శాంతిదూతగా ఆయనవలె మరే కాంగ్రెసువాదీ పాటుపడలేదు....... ఇంగ్లీషులో కానీ, హిందీలోకానీ ఆయన అనర్గళంగా భాషించేవారు. ఆయన వాగ్ధోరణి పవిత్ర గంగా ప్రవాహంవలె సాగిపోయేది. కాశీలో విజ్ఞాన మందిరాన్ని నెలకొల్పి ఆ ప్రదేశపు పురాతనప్రాభవాన్ని పునరుద్ధరించిన మహనీయుడాయన.

పండిత మాలవ్యాను అన్ని జాతుల వారూ, మతాలవారూ అభిమానించేవారు. ఆయనను హిందువులు భక్తిభావంతో గౌరవించగా మంత్రులతోసహా ఆంగ్లేయులు ఆయనను ప్రేమించేవారు. నిజాం మొదలుకొని అనేకరు మహమ్మదీయ ప్రముఖులు ఆయనను ఆదరించారు. హిందూ విశ్వవిద్యాలయానికి భూరి విరాళాలు ఇచ్చారు. ఈ విశ్వవిద్యాలయం ఆయనకు శాశ్వతమైన స్మృతి చిహ్నం. నిధులు పేకరించడంలోనూ, దీర్ఘోపన్యాసాలు చేయడంలోనూ మాలవ్యాజీ తనకు తానే సాటి అనిపించుకున్నారు.

— కె. ఈశ్వరదత్తు

(స్వతంత్ర, 1946 నవంబరు 16)

## సరోజినీనాయుడు

భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షపీఠాన్ని అలంకరించిన రెండవ మహిళ సరోజినీదేవి. ఉత్తర ప్రదేశ్ గవర్నరుగాకూడా ఆమె పని చేశారు. ఆమె వ్యక్తిత్వం విశిష్టమైనది. ఆమె స్వతస్సిద్ధమైన కవయిత్రియేగాకుండా స్వాతంత్ర్యయోధురాలుకూడా. 19వ శతాబ్దం చివరి రోజులలో ఆమెలో స్వాతంత్ర్యాభిలాష, దేశభక్తి పరువళ్ళు త్రొక్కాయి. శతాబ్ది ఆరంభంనాటికి రాజకీయ, సాంఘిక సేవారంగాలలో ఆమె ఖ్యాతిలోనికి వచ్చారు. స్వరాజ్యసాధనకై సమైక్యంగా నిలువవలసిందిగా ఆమె దేశస్థులను ఉద్బోధించారు. ఆమె గంభీరవక్త, మృదుభాషిణి.



మహిళా దాస్య విమోచనోద్యమం ఆరంభమైనప్పుడు కూడా ఆమె అగ్రాసనాధిపత్యం వహించి ఉద్యమాన్ని నడిపించారు. మహిళలు తమతమ గృహాంతర్భాగాల నుంచి వెలుపలికి

వచ్చి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనేట్టు చేయడానికి అనవరతమూ శ్రమించింది.

గాంధీజీతో ఆమెకుగల సన్నిహిత పరిచయము ఆమెను ఎంతగానో ప్రభావితం కావించింది. ఆయన పరిచయ సంపద ఆమెకు అపూర్వానుభవాలను సంతరింపజేసింది. సహాయ నిరాకరణోద్యమంలోనూ, అహింసాయుత పోరాటంలోనూ ఆమె పాల్గొనేట్టు చేసింది. చివరికి కారాగారవాసంలో కూడా ఆమె అడుగుపెట్టింది. భారత జాతీయ కాంగ్రెసులో ఉత్సాహవంతురాలైన కార్యకర్తగా ఆమె దేశానికి అగణితమైన, అపారమైన సేవ చేసింది.

రోజినీ నాయుడు అతి నిరాడంబరమూర్తి. భారతీయ సాంప్రదాయాన్ని ప్రీతికి పుచ్చుకున్న మహిళ. ఉత్తరప్రదేశ్ ప్రజలు ఆమెను తల్లిగా భావిస్తారు. ఆ యోగ్యతను నిలుపుకోడానికి ఆమె తన శాయశక్తులా కృషిచేసింది.

## ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు



ఆంధ్ర రాజకీయ రంగంలో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు సుదీర్ఘ కాలంపాటు జరిపిన వీరవిహారం బహుశా మరొకరెవరూ చేసివుండరు.

అతి పేద కుటుంబంలో పుట్టి, కష్టాలలో పెరిగి, స్వశక్తితో అత్యంత ఉన్నతమైన స్థానానికి చేరగలిగారు. గుంటూరు జిల్లా ఒంగోలు తాలూకాలోని కనుపర్తి గ్రామంలో 1872 ఆగష్టు 23 వ తేదీన వీరు జన్మించారు. నెల్లూరు, నాయుడుపేట, ఒంగోలు, రాజమండ్రిలలో విద్యాభ్యాసం చేశారు. మద్రాసు న్యాయకళాశాల నుండి న్యాయశాస్త్రంలో సెకండ్ గ్రేడ్ డిప్లొమా పొంది మొదట్లో ఒంగోలులో ప్రాక్టీసు పెట్టి ఆ తర్వాత రాజమండ్రికి మార్చివేశారు. తమ 29 వ ఏటనే పంతులుగారు రాజమండ్రి పురపాలక సంఘానికి అధ్యక్షులయ్యారు.

న్యాయశాస్త్రంలో ఉన్నత విద్యాభ్యాసానికై 1904 లో వీరు ఇంగ్లండు వెళ్ళి అయిదేళ్ళ అనంతరం బారిష్టరు పట్టా పుచ్చుకుని స్వదేశం తిరిగి వచ్చారు.

శాసనోల్లంఘన ఉద్యమం సందర్భంగా గాంధీజీపిలుపుతో, 1921 లో అతి ఉజ్వలంగా వున్న తన ప్రాక్టీసును కూడా వదులుకున్నారు. నాటినుండి ప్రకాశం జీవిత చరిత్రే దక్షిణాది స్వాతంత్ర్య పోరాటం చరిత్రగా రూపొందింది.

ప్రకాశం పంతులుగారు 1928 లో సైమన్ కమిషన్ ప్రతిఘటనోద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు.

1937-39 రాజాజీ మంత్రివర్గంలో రెవిన్యూ మంత్రిగా పంతులుగారు జమీందారీ రద్దు శాసనం చేశారు. 1946 ఏప్రిల్ 30 వ తేదీన మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి అయ్యారు.

1953లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికి ముఖ్యమంత్రిగా అనేక ఘనకార్యాలు సాధించారు. రాష్ట్రావతరణోత్సవ సందర్భంలో 2 వేల మంది ఖైదీలను విడుదల చేయించారు. దీనినొక ఘనమైన ప్రయోగంగా సాంఘిక శాస్త్రవేత్తలు ప్రశంసించారు.

## అమరజీవి పొట్టి శ్రీరాములు

*జననం : 1901          మరణం : 15-12-1952*



అది 1951 ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేసే సమస్య అనిశ్చితంగా ఉంది. వివిధ పార్టీలకు చెందిన రాజకీయ నాయకులలో ఏకాభిప్రాయం కుదరలేదు. 10 సంవత్సరాలుగా జరుగుతున్న ఆంధ్రరాష్ట్ర ఉద్యమం ఒక దశలో సమసిపోయే పరిస్థితి ఏర్పడింది.

జన బాహుళ్యానికి అంతగా తెలియని గాంధీవాది— శ్రీ పొట్టి శ్రీరాములు రంగంలోకి దిగారు. ఏ ఆడంబరాలు, ఆర్భాటం

లేకుండానే 1952 అక్టోబరు 19వ తేదీనుండి ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించారు. రోజులు వారాలుగాను, వారాలు నెలలుగాను మారుతున్నాయి రాజకీయ పరిస్థితులు ఉధృతంగానే ఉన్నాయి 58 రోజుల నిరాహార దీక్ష తర్వాత 1952 డిసెంబరు 15వ తేదీన శ్రీ శ్రీరాములు అసువులు కోల్పోయారు. భారతదేశమంతటా గగ్గోలు ప్రబలింది

ఆయన నిర్యాణం జరిగిన నాలుగు రోజులకు ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు గూర్చి అప్పటి ప్రధాన మంత్రి కీ శే జవహరు లాల్ నెహ్రూ చరిత్రాత్మకమైన ప్రకటన గావించారు అనిశ్చిత వాతావరణం తొలగిపోయింది మహోన్నతమైన ఆత్మ బలిదాన ప్రక్రియతో ప్రజలు ఎంతో కాలంనుండి కంటూవచ్చిన కలలు వాస్తవ రూపాన్ని పొందాయి అమరజీవి పొట్టి శ్రీరాములు, చరిత్ర పుటలనే మార్చివేశారు.

శ్రీ శ్రీరాములు మద్రాసులో జన్మించారు నెల్లూరు జిల్లా జువ్వెల దిన్నెలో పెరిగారు ఆయన అనేక సార్లు జైలు శిక్షలు అనుభవించారు ఉప్పు సత్యాగ్రహంలోను, వ్యక్తి సత్యాగ్రహంలోను ప్రముఖంగా పాల్గొన్ని జైలు శిక్ష అనుభవించారు.

"క్విట్ ఇండియా" మహోద్యమం ముమ్మరంగా సాగుతున్న కాలంలో 1942 ఆగస్టులో ఆయనను తిరిగి అరెస్టు చేశారు. 1952 సెప్టెంబరులో ఆయన బాల్య మిత్రుడు, మద్రాసు బార్ సభ్యులు, శ్రీ వి. లక్ష్మినారాయణకు నెల్లూరు నుండి ఒక ప్రత్యేకతను సంతరించుకున్న లేఖను ఆయన వ్రాశారు ఆ లేఖలో ఇలా వ్రాశారు." ఆంధ్ర రాష్ట్రం సమస్యపై అనేక అభిప్రాయాలు ఉద్భవించాయి ప్రతివారు తమ ధోరణిలోనే ఆలోచిస్తున్నారు అందరు ఒకేవిధంగా, ఒక్క తీరుగా ఆలోచించనంతవరకు ఒక పరిష్కారానికి రాలేరు అధికారంలో ఉన్నవారి మనస్సులను మార్చడం సులభం కాదు. దానికి ఒక్కటే మార్గం నాకు కనిపిస్తున్నది కోరిక, ద్వేషం లేకుండా దృఢ సంకల్పంతో నా ప్రాణాలను అంకితం చేయడమే ఆ మార్గం. ఇంకా ఆలస్యం చేయడం అపచారమే అవుతుందని నిన్నటి నుండి నేను భావిస్తున్నాను. ఈ అగ్ని పరీక్షను ఎదుర్కొ-దానికి నేను సిద్ధంగానే ఉన్నాను. కార్య సాధనకు నా ప్రాణాలను అర్పిస్తాను."

ఈ త్యాగశీలికి ఎందరో జోహార్లు అర్పించారు. శ్రద్ధాంజలి ఘటించిన ఆంగ్లేయ పత్రికా రచయిత శ్రీ వి. ఎ. హెయిల్స్ వాక్యాలు, చరిత్ర యిచ్చిన పవిత్ర తీర్పుగా భావించదగినవి. "క్రుసిఫిక్షన్ తర్వాత మహత్తరమైన ఆత్మార్పణం"గా ఆయన అభివర్ణించాడు.

## రఘుపతి వెంకటరత్నం నాయుడు

ప్రస్తుత తరానికి చెందిన ప్రజలకు యీ పేరు కొత్తగా వినిపించవచ్చు. అయితే అనాటి సంఘ వ్యవస్థను రూపు దిద్దడంలో యీ నామధేయుడు ప్రముఖ పాత్ర నిర్వహించడమే గాక, ఆనాటి సమాజాన్ని ప్రభావితం చేశారు. నవ్యాంధ్ర దేశంలో సమాజ వ్యవస్థ మార్పులకు లోనైన తరుణంలో నాయుడుగారు ప్రజలకు ప్రబోధించడమేగాక వారిలో చైతన్యం పూరించారు. ఆధునిక ఆంధ్రదేశ నిర్మాతలలో ఆయన ఒకరుగా ఖ్యాతి గాంచారు.



వెంకటరత్నం నాయుడు, మచిలీపట్నంలోని నోబుల్ కళాశాలలోను, మద్రాసులోని క్రిష్టియన్ కళాశాలలోను ఉన్నత విద్య నభ్యసించారు ఆయన స్వస్థలంలో తాను చదివిన విద్యాసంస్థలోనే లెక్చరర్‌గా కొంతకాలం పనిచేశారు తర్వాత సికింద్రాబాదులోని మహబూబు కళాశాల ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు తర్వాత కాకినాడలో పి ఆర్ కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేశారు ఇక్కడే తన లక్ష్యసాధనకు తీవ్రంగా కృషి చేశారు. మద్రాసు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా ఎన్నిక అయ్యారు.

కార్యదీక్ష, ఉత్సాహం, ఉద్రేకం ఉప్పొంగుతున్న రోజులవి. ఆ రోజులలో వీరేశలింగం, వెంకటరత్నం ఆంధ్రదేశ ఆశాజ్యోతులుగా, మార్గదర్శకులుగా మన్ననలందారు. శ్రీ నాయుడుగారు బాల్య వివాహాలను తీవ్రంగా ప్రతిఘటించారు. వ్యభిచార నిర్మూలనకు తీవ్రంగా కృషి చేశారు.

ఆయన కాకినాడ కళాశాలలో హరిజన బాలబాలికలకు, యితర వర్గాల బాల బాలికలకు ఉచిత విద్యాసౌకర్యం కల్పించారు. పేద విద్యార్థులకు తన డబ్బుతో ఫీజులు చెల్లించారు.

ఆయన పండితుడు, విద్యావేత్త, వక్త, ప్రబోధకుడు, అన్నిటినిమించి సంఘసంస్కర్త. భగవద్భక్తుడు. నిరాకారుడైన భగవంతుని పూజించడమేగాక, మానవులలోనే భగవంతుని దర్శించి వారి సేవ చేసిన వ్యక్తి.

## సి. వై. చింతామణి

పత్రికా ప్రపంచంలో సుప్రసిద్ధులైన ఆంధ్రులలో శ్రీ సి. యజ్ఞేశ్వర చింతామణి సముచితమైన గౌరవస్థానాన్ని ఆక్రమిస్తారు. సంపాదకుడుగా, పార్లమెంటేరియన్‌గా, మంత్రిగా ఆయన విజ్ఞాన సంపదతో యు.పి. ప్రజలను ఆశ్చర్యచకితులను చేయడమేగాక తన జీవిత కాలంలోనే ఒక యితిహాసంగా నిలిచిపోయారు.

చింతామణి విశాఖజిల్లా విజయనగరంలో జన్మించారు. విజయ నగరంలోని మహారాజ కళాశాల నుండి ఉత్తమ శ్రేణిలో పట్టభద్రు లయ్యారు. 1898 సంవత్సరంలో ఆయన ప్రజాజీవితం ఆరంభ మైంది. చాలామంది తన సహచరులవలే ఆయన కూడా కొత్త జీవితాన్ని వెతుక్కుంటూ ఉత్తర భారతదేశానికి వలస పోయారు. ఉత్తర ప్రదేశ్‌లోని ఒక ప్రముఖ రాజకీయవేత్త అయిన శ్రీ నాగేంద్రనాథ గుప్త 'ది ఇండియన్ పీపుల్' అనే ఆంగ్ల వార పత్రికను 1903లో ప్రారంభించగా చింతామణి అందులో సహాయ



సంపాదకుడుగా చేరారు. చాలా కాలంగా యు.పి.లో జాతీయభావాలు ప్రచారం చేయగల చక్కటి ఇంగ్లీషు వార పత్రిక లేదు. ఈ లోటును భర్తీ చేయడానికై పండిత మదన మోహన మాలవీయ 1909 అక్టోబరులో అలహాబాదు నుంచి 'లీడర్' అనే ఆంగ్ల దిన పత్రికను తన సంపాదకత్వం క్రింద ప్రచురించడం ప్రారంభించారు. ఆ వెంటనే చింతామణి ఆ పత్రికలో చేరారు, కొన్నాళ్ళు దానికి సంపాద కుడిగా కూడా వున్నారు.

పుట్టుకతోనే పాత్రికేయుడు ఆయన. జాతీయ భావాలు చిన్న నాటనే ఆయనలో మొగ్గతొడిగి పుష్పించాయి. ఆయనే ఒక విజ్ఞాన ఖని. సమకాలీనులలో సమున్నత స్థానాన్ని అలంకరించ గలిగిన అపూర్వ ప్రతిభా సంపదను తన సొత్తు చేసుకున్న వ్యక్తి. బహుముఖ ప్రతిభాశాలి. ఆయన సంపాదకత్వం క్రింద అలహాబాదు నుంచి ప్రచురించబడే ఆ చిన్న పత్రిక 'లీడర్' అనతికాలంలోనే అగణితమైన పేరు ప్రతిష్ఠలను ఆర్జించుకుని దేశంలోని ప్రసిద్ధ పత్రికలలో ఒకటిగా వాసికెక్కింది.

చింతామణి మితవాద రాజకీయ ధోరణికి కట్టుబడిన వ్యక్తి. గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమంతో ఆయన ఏకీభవించలేదు. ఆ విషయాన్ని ఆయన బహిరంగంగానే ప్రకటించారు. ఒక్క సహాయ నిరాకరణోద్యమం మినహా మిగిలిన కాంగ్రెసు ఆశయాలన్నింటికీ తమూ, తమ అభిమానించే మితవాద రాజకీయ ధోరణిగల అనుయాయులూ బద్ధులైవున్నట్టు ఆయన స్పష్టం చేశారు.

## భమిడిపాటి కామేశ్వరరావు

(1958 ఆగస్టు29వ తేదీన తమ 61వ ఏట స్వర్గస్థులయ్యారు:—)

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు హాస్య బ్రహ్మ. ఆయన తన హాస్యాన్ని ఏ ఒకే తరహా యితివృత్తానికో పరిమితం చేయ లేదు. మన నిత్య జీవితంలో తారసిల్లే అనేకానేక సమస్యల్ని తీసుకుని, సునిశితమైన హాస్యాన్ని మేళవించి, వ్యంగ్యంగా విసుర్లు విసురుతూ మన స్మృతిలో శాశ్వతంగా నిలిచిపోయే రచనలు కావించారు. తమ ప్రహసనాల ద్వారా, వ్యాసాల ద్వారా, తదితర రచనల ద్వారా నిత్యజీవితంలోని హాస్యాన్ని మన కళ్ళ ముందు వుంచారు.

మన సమాజాన్ని వేరుపురుగులా తొలిచివేస్తూ మన ప్రశాంత జీవితాన్ని కలుశితం చేసే ఆంధ్రులలోని అసూయలనూ, స్పర్థలనూ, కాపట్యాలను, సంకుచిత మనస్తత్వాన్ని; మనలో కరుడుగట్టుకుపోయిన దోషాలను తన రచనల్లో బట్టబయలు చేశారు.

పాత్ర చిత్రణలో, శిల్పంలో శ్రీ కామేశ్వరరావు 17వ శతాబ్దపు ఫ్రెంచి హాస్య రచయిత మొలైర్‌ని దృష్టిలో పెట్టు కున్నారు. సమకాలీన సమాజంలో నెలకొన్న కుళ్ళునంతటినీ అతి నిర్దయంగా, వ్యంగ్యంగా విమర్శిస్తూ మొలైర్ రచనలు చేశారు. అదే ధోరణిలో శ్రీ కామేశ్వరరావు కూడా తన నాటకాలలో సమాజ వ్యవస్థలోని కుచ్ఛితం మీద కలం యుద్ధం ప్రకటించి వ్యంగ్యంగా వ్యాఖ్యానిస్తూ మన అల్పత్వాలను మనకే చూపించారు. తెలుగు నాటకం వున్నంత కాలం ఆయన 'సానయ్య' పాత్ర జీవించే వుంటుంది. బారిస్టర్ పార్వతీశం, గిరీశం సరసన కూర్చోదగ్గ వ్యక్తి 'సానయ్య'.

శ్రీ కామేశ్వరరావు సంగీతాభిమాని, విమర్శకుడు. సంగీత శాస్త్రాన్ని మధించినవారు, ఆయన వ్రాసిన 'త్యాగరాజు ఆత్మ విచారం' అందుకు సాక్షి. త్యాగరాజు కీర్తనలలోని కవితా సోయగాన్నీ, హృదయ వికాస మాధుర్యాన్నీ అతి సరళంగా, సామాన్యుడుసైతం ఆ కీర్తనలలో సుధారసాన్ని ఆస్వాదించే విధంగా వివరిస్తూ వ్రాసిన గ్రంథమది.

'వీరి ఆంధ్ర నాటక పద్య పఠనం' అనే గ్రంథం హరి ప్రచురణల్లో కడపటిదైనప్పటికీ నిజానికి వారు దానిని 1924లోనే వ్రాశారు. పద్యాలను రాగయుక్తంగా పాడడం వల్ల దానిలోని కవితాశక్తి నశిస్తుందని హృదయానికి సన్నిహితంగా అర్థం చేసుకోరాదని గట్టిగా నొక్కిచెబుతూ ఆ విషయమై సమగ్రంగా ప్రామాణికంగా వారు వ్రాసిన యీ గ్రంథం విజ్ఞుల మెప్పులనే గాక రసజ్ఞుల హృదయాలను సహితం దోచుకో గలిగింది.

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు చక్కటి వక్త. అంతేకాదు మంచి నటుడు కూడా. వృత్తి రీత్యా ఆయన ఉపాధ్యాయుడైనా ప్రతిభచేత రచయితగా రాణించారు.

## కల్నల్ సి. కె. నాయుడు

సుప్రసిద్ధ క్రికెట్ ఆటగాడు కల్నల్ సి.కె.నాయుడు తమ 72 వయేట ఇండోర్‌లో నవంబరు 14న మరణించారు. భారతీయ క్రికెట్ క్రీడారంగానికి ఆయన చేసిన అసమాన సేవకు గుర్తింపుగా వీరికి 'పద్మభూషణ్' బిరుదు యివ్వబడింది. 1932లో ఇంగ్లాండులోని లార్డ్సులో జరిగిన క్రికెట్



అధికారిక టెస్ట్ మేచ్‌లో తొలిసారిగా భారతదేశం పాల్గొంది. ఆనాటి భారతీయ క్రికెట్ బృందానికి కల్నల్ నాయుడు నాయకత్వం వహించారు. ఇంగ్లాండులో జరిగే అనేక అధికార పూర్వకమైన టెస్టుమేచ్‌లలో వీరుపాల్గొన్నారు. చక్కటి ఆల్ రౌండర్. ప్రధానంగా, ప్రతిభగల బేట్స్‌మన్‌గా పేరు కెక్కారు. ఆయన మొత్తం ప్రథమశ్రేణి క్రికెటులో 78 ఇన్నింగ్స్ ఆడారు. ఆయనచేసినగరిష్ట స్కోరు 200.

సి. కె. గా క్రికెట్ ప్రపంచానికి ప్రసిద్ధుడైన శ్రీ కొటారి కనకయ్య నాయుడు 1895 అక్టోబరు 31 న జన్మించారు తమ 62 వ ఏటవరకు క్రికెట్ విషయకంగా భారతదేశమంతటా పర్యటించారు. క్రికెట్ క్రీడగల దేశాలలో ఆయన అత్యంత పేరు ప్రతిష్ఠలు గడించుకున్నవ్యక్తి. సి. కె. అమోఘమైన బేట్స్‌మన్‌గా సుప్రసిద్ధుడు. సి. కె. చరిత్ర భారతీయ క్రికెట్ చరిత్ర. భారతీయ క్రికెట్‌పై ఆయన ప్రభావం యింతింతని చెప్పలేము. ఈ క్రీడలోని వివిధ విభాగాలలో అత్యంత ఉన్నతమైన ప్రమాణాన్ని ఆయన సృష్టించారు.

ప్రధాని తమ సానుభూతి సందేశంలో ఇలా అన్నారు– క్రికెట్ ప్రపంచానికి సి. కె. చేసిన సేవ అపారమైనది. స్వతహాగా ప్రతిభావంతుడైన క్రికెట్ ఆటగాడు ఆయన. అనేక మంది యువక్రికెట్ ఆటగాళ్ళకు ఆయన ఆదర్శప్రాయుడు. ప్రతిభను గుర్తించే నేర్పు ఆయనకు వున్నది. నేటి ప్రతిభావంతులైన ఆటగాళ్ళను అనేకులను ఆయన తీర్చిదిద్దారు. ఆయన మరణంతో దేశం ఒక చక్కటి క్రీడాకారుని కోల్పోయినట్టయింది"

## శ్రీమతి కృష్ణ హఠీసింగ్

శ్రీమతి కృష్ణ హఠీసింగ్ కూడ, తన సోదరుడు జవహర్ లాల్ నెహ్రూవలనే ఎల్లప్పుడు యువతరానికి ప్రాతినిధ్యం వహించారు. ఆమె కుటుంబంలోని శ్రీమతి విజయలక్ష్మి పండిట్ వంటి మిగతా సభ్యులు రాజకీయ రంగంలో తమ ప్రభావాన్ని ప్రసరింపజేసి అంతర్జాతీయ ఖ్యాతినార్జించగా శ్రీమతిహఠీసింగ్ మాత్రం రాజకీయంకన్నా సాహిత్యానికే ప్రాధాన్యం యిచ్చింది.

విరివిగా విక్రయించబడిన 'విత నో రిగ్రెట్స్' ఆత్మకథ, ఆమె రచించిన ప్రథమ గ్రంథం. ఈ గ్రంథంలో నెహ్రూ కుటుంబానికి చెందిన గృహ విషయాలను వివరించింది. సరోజినీ నాయుడు యీ గ్రంథాన్ని ఎంతో మెచ్చుకున్నారు. ఆమె రచించిన మరో పుస్తకం "షాడోస్ ఆన్ ది వాల్"లో జైళ్ళలోని స్త్రీలనుగూర్చిన కథలను రచించారు శాసనోల్లంఘన ఉద్యమం సందర్భంగా 15 రోజులు జైలులో గడిపిన అనుభవాలతో యీ పుస్తకాన్ని రచించారు.

ఆగర్భ శ్రీమంతుల గృహంలో జన్మించి, కాలు కదపకుండా పెరిగినా, యితరులతో చాలా కలివిడిగా తిరిగేవారు. సోదరునితోనూ, మేనకోడలు శ్రీమతి ఇందిరాగాంధితో పాటుగా ఆమె దేశ వ్యవహారాలలో ఎన్నో మార్పులను చూచారు.

సాంఘిక సేవాకార్యక్రమాలలో, ముఖ్యంగా బాలనేరస్థుల వికాస కార్యక్రమాలలో ఎంతో ఉత్సాహం, చొరవతో కృషి చేశారు. బొంబాయిలో పోలియో క్లినిక్‌ను నెలకొల్పడంలోను; మురుగు పేటల నిర్మూలన కార్యక్రమంలోను కృషి చేశారు.

సీరియల్

# మహాభారతము

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 12

ఒకనాడు సుందోపసుందులు త్రిలోక విజయమును సాధించుటకు మంత్రులతో ఆలోచించి మఘానక్షత్రయుక్త రాత్రియందు యుద్ధ యాత్రకై వెడలిరి. వివిధాయుధములను ధరించి తొలుత స్వర్గ లోకముపైననే దాడిచేసిరి. వారికి లభించిన వరములను పూర్వమే తెలిసికొనిన దేవతలు భయపడి స్వర్గమునువీడిపోయి బ్రహ్మ దేవుని శరణువేడిరి. సుందోపసుందులు స్వర్గమును స్వాధీన పరచుకొనిరి. అలాగే నాగలోకమును, సమస్త ప్రపంచమును స్వాధీనము చేసికొనిరి. రాజర్షులు, బ్రహ్మర్షులు హోమాదులు చేసి దేవతల బలమును పెంచుచున్నారని వారిని ధ్వంసము చేయ వలసిందని సైనికులకు ఆజ్ఞాపించిరి. వారు సముద్రపు తూర్పు తీరములో సంచరించి యజ్ఞయాగాదులుచేయు మునీశ్వరుల నంద రను బాధించుచు ధ్వంసము చేయుచుండిరి. వారు పారిపోయి దుర్గమస్థానములలో దూరి దాగియుండిరి. అప్పుడు సుందోప సుందులు మదపుటేనుగుల రూపమును, సింహ వ్యాఘ్ర రూపము లను ధరించి వారిని పట్టి చెండి చంపుచుండిరి. ఈ విధముగా భూమండలమంతయు ధర్మకార్యశూన్యమై యెక్కడజూచినను అస్థిమయమై యుండజూచి వారు సంతసించి కురుక్షేత్రమునందు స్థిరనివాస మేర్పరచుకొనిరి.

ఇట్లు గగ్గోలుపడి మునీశ్వరులందరు బ్రహ్మలోకమునకు పోయి బ్రహ్మదేవుడు నిండుసభలో కూర్చొనినప్పుడు సుందోప సుందుల క్రూరకర్మలను ఆయనకు నివేదించిరి. అక్కడివా రందరుగూడ అవిధముగానే మొరపెట్టుకొనిరి. బ్రహ్మదేవుడు కొంచెము యోచించి యేలాగైనను సుందోపసుందుల వధోపాయ మును చూడవలెనని విశ్వకర్మను పిలిపించి, 'అతిలోక సౌందర్య వతియైన యొక కాంతను సృజింపుము' అని ఆతనికి ఆజ్ఞాపిం చెను. విశ్వకర్మ అట్టి సుందరిని నిర్మించి, మూడులోకముల లోని స్థావర జంగమములలోనున్న అందమైన సారాంశముల నన్నింటిని గైకొని ఆమె శరీరములో నింపెను. అనేక కోటి రత్న కాంతులను ఆమెయెడ ప్రసరింపజేసెను. ప్రతి అవయవ మునుగూడ అతిదర్శనీయముగ నిర్మించి చతుర్దశ భువనములలో నామెకు ఈడైన వడతి లేదనిపించెను. ఆమె సమస్తలోకవాసుల దృష్టిని, మనస్సును ఆకర్షించునట్లుగా నుండెను. ఉత్తమరత్నముల నన్నింటినుండియు తిలప్రమాణమును తీసికొని ఆమె శరీరమును

విశ్వకర్మ నిర్మించినందుచేత బ్రహ్మదేవుడామెకు 'తిలోత్తమ' యని పేరు పెట్టెను. ఆమె బ్రహ్మకు నమస్కరించి "నాకు ఏమి యాజ్ఞ నిచ్చెదరు?" అని అర్థించెను. అమాటకు బ్రహ్మదేవుడు, నీవు పోయి సుందోపసుందులకు లోభనీయమైనరూపములను ధరించి వారిరువురు నీపై మోహముచేత పరస్పరము ద్వేషించుకొనునట్లు చేయుము, అని తిలోత్తమతో చెప్పెను. ఆమె దేవగణ మునకు ఋషిగణమునకు ప్రదక్షిణము చేసి పోవుచుండెను. అప్పు డామె తిరిగినవైపున నామెను చూచుటకుగాను, అక్కడ ఉన్న శివుడు పలువైపులను నాలుగుముఖములను అధికముగా ఉత్పత్తి చేసికొని తానుకూర్చొనినచోటినుండియే కదలక ఆమెశరీరసౌందర్యమును సమగ్రముగా చూచెను. ఇంద్రుడు గూడ అలాగే శరీర మంతయు విశాలమైన నేత్రపంక్తి నికల్పించుకొని ఆమె సౌందర్యమును ఆశతో చూచెను. అందుచేత శివునకు ఐదుముఖములు, ఇంద్రునకు సహస్ర నేత్రములు ఏర్పడెను. ఆమె సౌందర్యమును చూచి ఋషీశ్వరు లందరుగూడ ఇక నీమె తప్పక సుందోపసుందులను సాధించి మన కార్యమును అవశ్యముగ నెరవేర్చగలదు! అను విశ్వాసము గలవారైరి.

సమస్తభూమండలమును జయించి సుందోపసుందులు తమకు ఎదురులేకయుండిరి. శత్రువనువాడే వారికి లేనప్పుడు నిరుద్యోగముగా కూర్చొని విషయసుఖము లన్నియు ననుభవించుచు యథేచ్ఛముగ స్త్రీలతో విహరించుచుండిరి. ఒకనాడు వారు వింధ్య పర్వతసాను వులందు స్త్రీలతో విహరించు చుండగా తిలోత్తమ వారికి గోచరించెను. ఆమె అక్కడ పువ్వులు గోయుచు మిక్కిలి ఆకర్షణీయమైన వేషమును ధరించి వారికి కనపడెను. మద్యపాన మత్తులైన సుందోపసుందు లామెను చూచి మోహితులైరి. ఇరువురును ఆమె కడకు పోయి ఆమెను కోరిరి. చెరియొకచేయి పట్టుకొని ఆమెను లాగిరి. వరప్రాప్తిమదము, స్వాభావికముగా వారికి గల మదము, ధనమదము, సురాపానమదము ఈమొదలైన మదము లన్నిటిచేత వారు మిక్కిలి ఉన్మత్తులై ఒండొరులను చూచుకొని కనుబొమలు ముడి పెట్టుచు 'నాభార్య యీమె కనుక నీకు తల్లివంటిది' అని సుందుడు 'కాదు నాభార్య కినీది కోడలి వంటిద' ని ఉపసుందుడును పలు కుచు పరస్పరము గదా యుద్ధము చేసి ఒకరి నొకరు చంపికొనిరి. అక్కడికి బ్రహ్మదేవుడు దేవగణముతో వచ్చి తిలోత్తమను సంభా వించెను. సూర్య చంద్రులు ప్రసరించు ప్రతిస్థలమునకు గూడ నీవు

నిరాటంకముగ పోవ గలవు. నీతేజస్సును ఎవరుగూడ కన్నెత్తి చూడ జాలరు–అనువరమును బ్రహ్మతిలోత్తమ కిచ్చి, ఇంద్రునకు తిరిగి స్వర్గరాజ్యమును ఇచ్చి తనలోకమునకు పోయెను.

పైకథను నారదుడు పాండవులకు చెప్పి. "సుందోపసుందులు అంత స్నేహముతో నేకముగా నున్నప్పటికిని తిలోత్తమ కారణముగా నశించిరి. మీకుగూడ ద్రౌపదికారణముగా అటిభేదము కలుగకుండ మీరుగూడ ఒక నియమమును చేసికొనుడు." అని చెప్పెను. ఆ ముని యాజ్ఞప్రకారమే వారు ఆయన సమక్షములోనే 'మిమలో నొక్కొకరి వద్ద ద్రౌపది ఒక సంవత్సరము ఉండు నట్లును, అపుడు మరియొక సోదరుడు వచ్చి చూచినచో నతడు పన్నెండు సంవత్సరములు బ్రహ్మచర్యముతో వనవాసము చేయు నట్లును నియమము చేసికొనిరి. అది విని నారదుడు వారిని ఆశీర్వదించి వెడలి పోయెను. వారును ఆ యొడంబడికప్రకారమే నడచుకొను చుండిరి.

## అర్జున వనవాసము

పాండవులు నియమమును పాలించుచు తమశౌర్యముచేత రాజులను వశపరచుకొని యింద్రప్రస్థములో నుండిరి. ద్రౌపది పంచపాండవులయెడ సమానగౌరవముతో మెలగుచు నుండెను. వారి పాలనలో కురుదేశము సుభిక్షముగ నుండెను. ఇట్లుండగా కొంత కాలమునకు ఒక బ్రాహ్మణుని గోవులను దొంగలు అపహరించుకొని పోయిరి. ఆయన ఇంద్రప్రస్థమునకు వచ్చి పాండవులవద్ద మొరపెట్టెను. "దేశాదాయములో ఆరవభాగము పన్నుగా పుచ్చుకొనుచున్నరాజు ప్రజారక్షణమును, ప్రజాధనరక్షణమును చేయనియెడల అట్టిరాజు అన్నిలోకములలో పాపిష్ఠుడుగా నిందింపబడుచున్నాడు. కనుక గోధనమును రక్షించి నా నిత్యకృత్యములను యథాస్థితిగా సాగునట్లు చేయుటకు పాండవులారా! అస్త్రగ్రహణము చేసి దొంగలను వెన్నంటుడు." అని ఆ బ్రాహ్మణుడు వేడుకొనెను. ఆ మొరను విని అర్జునుడు అతనికి అభయ మిచ్చెను. అప్పుడు ఆయుధాగారములో ద్రౌపదితో యుధిష్ఠిరుడు శయనించి యుండెను. కనుక తమ నియమ ప్రకారము ఆ గదిలోనికి అర్జునుడు పోవ జాలకుండెను. అప్పుడు 'బ్రాహ్మణగోధనరక్షణము చేయుట అవశ్యకర్తవ్యము. అట్లు చేయనిచో యుధిష్ఠిరరాజునకు ధర్మోపేక్షచేసిన దోషము అంటును. కురువంశమునకే అధర్మదోషము కలుగును. అస్త్రములకొరకై అన్నగారు, ద్రౌపదియు నున్నఆయుధాగారములోనికి పోయినచో మేము చేసికొనిన ఒడంబడికకు భంగము వాటిల్లును. ఆ గదిలో ప్రవేశించినచో నాకు వనవాసము తప్పదు. నాకు వనములో శరీరనాశ మైనను చింత లేదు కాని ధర్మనాశము కాగూడదు.' అని నిశ్చయించుకొని అర్జునుడు, అన్నగారి యాజ్ఞ గొని ఆయుధాగారములో ప్రవేశించి తన ధనుర్బాణమును తీసికొని వచ్చి బ్రాహ్మణుని వెంట పోయి చోరులను సంహరించి గోవులను తెచ్చి బ్రాహ్మణుని సంతోషపరచెను.

తరువాత అర్జునుడు యుధిష్ఠిరునివద్దకు సభాంగణములోనికి పోయి తాను చేసిన నియమభంగమునకు వనవాసవ్రతమును ఆదేశింపు మని కోరెను. అప్పుడు యుధిష్ఠిరుడు అర్జునునితో "నీవు నాగదిలో ప్రవేశించుట నా రాజధర్మమును కాపాడుటకొరకే కనుక అది నాకు ప్రియమే యగును. నాకు అప్రియకార్యమును నీవు చేసి యుండినచో నేను నీకు వనవాస నియమమును విధింప వలెను గదా! కనుక ఇది నాయాజ్ఞ. నీవు వ్రతాచరణము చేయ నక్కర లేదు. నామాటపైన నీకు ప్రమాణబుద్ధి యున్నచో నామాటప్రకారము నడచుకొనుము ఇదిగాక, ఇందులో నొకధర్మసూక్ష్మముకలదు. ఏమనగా అన్నగారు తనస్త్రీతో ఒంటరిగా గదిలో నున్నప్పుడు తమ్ముడు ఆ గదిలోనికి పోవుట దోషముకాదు అది ధర్మభంగముగూడ కాదు ఒకవేళ తమ్ముడు స్త్రీతో నున్నయింటిలోనికి అన్న పోయినచో నది దోష మగును. అది ధర్మనాశకర మగును. కనుక నాయనా! ఈప్రయత్నమును మానుకొనుము. నీకు ధర్మలోపముగాని, నాకు నీవలన తిరస్కారముగాని జరుగ లేదు." అని చెప్పెను. ఆమాటకు అర్జునుడు అన్నతో, "ధర్మాచరణము చేయ వలసి వచ్చినపుడు ఏదోయొకసాకును చూపి ధర్మభంగము చేయ కూడదని మీరే లోగడ చెప్పి యుంటిరి కనుక నేను సత్యముపైన ఒట్టు పెట్టుకొని నా ఆయుధములపైన చేయి ఉంచి అవియే సాక్షిగా "సత్యమునుండి తప్పను" అని శపథము చేయుచున్నాను " అని చెప్పి అన్నయాజ్ఞను గొని దీక్ష గొని పన్నెండుసంవత్సరముల వనవాసమునకై వెడలి పోయెను.

అర్జునుడు వనవాసమునకు వెడలుచుండగా పురజనులు బ్రాహ్మణులు ఆతని వెంట కొంతదూరము పోయిరి అర్జునుడు అనేక వనములను, సరస్సులను, పుణ్యతీర్థములను గడచిపోయి గంగాద్వారము (హరిద్వారము)ను చేరి అచట నివాస మేర్పరచుకొనెను అర్జునునితో వచ్చిన బ్రాహ్మణులు చేయు హోమాదుల చేత హరిద్వారక్షేత్రము మిక్కిలి శోభిల్లెను. ఒకనా డర్జునుడు స్నానార్థము గంగలో దిగెను స్నానసంధ్యాదుల నాచరించి తీరమునకు వచ్చు చుండగా నాగరాజకన్య యైన ఉలూపి అతనిని కామించి నీటిలోపలికి లాగెను. అర్జునుడు నాగలోకమునకు, పోయి అచట నుండుచున్న అగ్నిలో అగ్నికార్యములను చేసెను. దానిచేత అగ్నిదేవుడు సంతుష్టుడాయెను అప్పు డర్జునుడు ఉలూపిని జూచి" ఇంత సాహసమును నీ వేల చేసితివి! ఈ దేశ మెవరిది! నీ వెవతవు?" అని ప్రశ్నించెను. ఆమాటకు ఉలూపి "నేను ఐరావతుడు అను నాగరాజు కులములో పుట్టిన కౌరవ్యుని కూతురను. నాపేరు ఉలూపి నేను గంగలో దిగిననిన్ను జూచి కామించి నీకు దప్ప ఎవరికిఁగూడ నన్ను అర్పింప నని నిర్ణయించు కొంటిని" అని యనెను. అది విని అర్జునుడు ఉలూపితో కాంతా! బ్రహ్మచర్యముతో నేను పన్నెండుసంవత్సరములు వనవాసము చేయవలెనని ధర్మజుని ఆదేశము. దానిని పూర్తి చేయుటకు నేను స్వతంత్రుఁడను కాను అయినను నీకుఁగూడ ప్రీతిని గలిగింప దలఁచుచున్నాను నే నెప్పుడును అబద్ధమును చెప్ప లేదు నాకు అసత్యదోష మంటకుండగ నీకు ప్రియము గలిగించి నాధర్మమునకును హాని కలుగని ఉపాయ మేదైన నున్నచో చెప్పు"మని అడిగెను. ఆ మాటకు ఉలూపి "అర్జునా నీవు నియమభంగము చేసి అన్నగారి యాజ్ఞపై బ్రహ్మచర్యముతో పన్నెండు

వర్షములు వనములో తిరుగుచుండుటను నే నెఱుగుదును. ఇందు ఒక ధర్మసూక్ష్మమును చెప్పెదను. మీ యన్న ద్రౌపదిని నిమిత్తముగజేసి ధర్మ రక్షణమై నిన్ను అడవికి పంపెను. ఇప్పుడు నన్ను చేపట్టుటచేత నీకు ధర్మలోపము గలుగునని సందేహించకుము. నన్ను తిరస్కరించితివో నేను ప్రాణత్యాగమును జేసెదను. స్త్రీహత్యాదోషము అధర్మము కాదా! దానినుండి నన్ను కాపాడుకొనుటగూడ ధర్మమే యగును. కనుక నాకు ప్రాణదానము చేయుటగూడ ధర్మమే. ప్రాణరక్షణముకన్న వేరు ఉత్తమధర్మము లేదు కదా! నిన్ను కామించి దుఃఖించుచు నిన్ను శరణు వేడిన నన్ను కాపాడి శరణాగతరక్షకుడ వను నీ బిరుదమును రక్షించుకొనుము.'' అని యనెను. ఆమాటలు విని అర్జునుడు ధర్మమును ఎదుటబెట్టుకొని ఆమె యిచ్చను పూర్తి చేసెను. ఆ రాత్రి నాగలోకమున గడపి అర్జునుడు తెల్లవారగనే కౌరవ్యుని ఇంటిని వీడి ఉలూచితో హరిద్వారమును చేరెను. ఆమె అతని నచట విడిచి తనయింటికి తిరిగి పోయెను. పోవునపుడు 'నీకు జలములో నంతటను జయము గలుగుగాక. జలచరము లన్నియు నీవశములో నుండుగాక." అని అర్జునునకు వరమిచ్చెను. అర్జునునకు ఉలూపిగర్భమునందు మహాబలపరాక్రమ సంపన్నుడైన "ఇరావంతుడు" అను పుత్రుడు పుట్టెను.

అర్జునుడు గతరాత్రి జరిగిన సమాచారమును అచటి బ్రాహ్మణులకు జెప్పి అచటినుండి హిమాలయప్రాంతమునకు వెడలిపోయెను. అక్కడివనములలో స్నానశౌచాదికములు చేసెను. అనేకతీర్థములలో స్నానదానాదులు చేయుచు బ్రాహ్మణులతోపాటు తూర్పుదిశగా వెడలెను. ఆ వైపున నున్న తీర్థము లన్నింటిలో స్నానము చేసి ఆశ్రమముల దర్శించి పవిత్రుడయ్యెను. అచటినుండి కళింగదేశమును దాటి మహేంద్ర పర్వతమును సందర్శించి మణిపురమునకు పోయెను. ఆ నగరపతి యైన చిత్రవాహనుని చూచెను. అతనికి 'చిత్రాంగద' అను పేరుగల అందకత్తె యైన కూతు రుండెను. ఆమె పురములో సంచరించుచున్న అర్జునుని జూచి కామించెను. అతడును ఆమెపై మోహము కలవాడై రాజువద్దకు పోయి "నేను క్షత్రియుడను. నాకు నీకూతురునిచ్చి వివాహము చేయుము" అని కోరెను. తాను పాండుపుత్రుడ ననియు, తన పేరు అర్జునుడనియు తెలిపెను. ఆ మాటలకు చిత్రవాహనుడు అర్జునునితో 'పూర్వము మా కులములో ప్రభంజనుడు అనురాజు ఉండెను. అతనికి సంతతి లేకుండెను. అతడు పరమశివుని గూర్చి తపస్సు చేసెను. ఆదేవుడు మావంశములో నొక్కొక్కనికి నొక్కొక్క సంతతిని మాత్రమే అనుగ్రహించెను. నాపూర్వులందరకు ఒక్కొక్కపుత్రుడు జనించెను. నాకు మాత్ర మొకకూతురు కలిగినది. ఆమెనే నేను పుత్రునిగా భావించి పెంచుకొనుచున్నాను. ధర్మశాస్త్రప్రకారముగా ఈమెకు జనించు ప్రథమపుత్రుడు నా పుత్రుడుగానే భావింపబడును. అట్టి పుత్రికా పుత్రుడు రాజ్యాధికారమునకు అర్హుడు. ఆకారణముచేత ఈమెకు నేను "పుత్రుడు" అని పేరిడినాను. ఇట్టిదానికి 'హేతువిధి' అని అందురు. నీవు ఈ కన్యను పెండ్లియాడ దలచితివో ఈమెకు జనించబోవు ప్రథమపుత్రుని నా కొసంగవలయును. ఇదియే నేను నీకు విధించునట్టి శుల్కము. ఈ ఒడంబడికతో నీ వీమెను పరిగ్రహింపుము" అని చెప్పెను. ఆ నియమమునకు అర్జునుడు ఒప్పుకొని ఆమెను వివాహమాడెను. ఆమెకు పుత్రుడు జనించిన పిదప రాజువద్ద అనుమతి గొని అర్జునుడు తీర్థయాత్రలకై ముందుకు సాగిపోయెను.

అటుతరువాత అర్జునుడు దక్షిణసముద్ర తీరమునందలి పుణ్యతీర్థములను సేవించెను. అక్కడి ఐదు తీర్థములను మాత్రము తపస్విజనము సేవించుచుండిరి. ఆ తీర్థములను పూర్వకాలము అనేకమునులు సేవించుచుండిరి. అవి, 'అగస్త్య, సౌభద్ర, పౌలోమ, కారంధమ, భారద్వాజ' తీర్థములు. ఆ యైదు తీర్థములను అర్జునుడు చూచెను. అవి యేకాంతస్థలములో నుండి ఋషులచే పరిత్యజించబడి యుండెను. 'ఆ తీర్థములను మునీశ్వరు లెందుకు పరిత్యజించిరి?' అని అక్కడి మునులను అర్జునుడు అడిగెను. ఆమాటకు మునులు, "ఆ తీర్థములలో నైదు మొసళ్లు నివసించి యుండును. మునులను అవి జలములోనికి ఈడ్చుకొని పోవును. అందుచేత తాపసులు తీర్థము లైదింటిని విడిచిరి." అని చెప్పిరి. వారిమాటలను అర్జునుడు వారించుచున్నప్పటికిని వినక, ఆ తీర్థములను చూచుటకు పోయెను. సుభద్ర మహాతీర్థమగు సౌభద్రములోనికి దిగి స్నానము చేసెను. వెంటనే మొసలి అర్జునుని పాదము పట్టుకొనెను. అతడు దానిని పట్టి పైకిలాగెను. వెంటనే ఆ గ్రాహము స్త్రీ యయ్యెను. 'నీ వెవ్వతెవు? ఎందుకీ జలములో గ్రాహరూపమున నున్నావు? ఏల ఈ పాపకార్యమును చేయుచున్నావు?' అని అర్జునుడా స్త్రీని అడిగెను. ఆమాట కామె, 'వీరశేఖరా! నేను దేవారణ్యమున విహరించు అప్సరసను. నాపేరు 'వర్గ'. నేను కుబేరుని ప్రియురాలను. నాకు ఇంకను నలుగురు 'సఖురాండ్రు' ఉన్నారు. మే మైదుగురము. కామగమనము గలవారము. కుబేరునిగృహమునకు ఒకనాడు పోయి అక్కడ వ్రతనిష్ఠలో నున్న యొక బ్రాహ్మణుని జూచితిమి. అతడు మిక్కిలి సౌందర్యము గలవాడు. ఏకాంతమునందు వేదాధ్యయనము చేయుచుండెను. తేజోమయమైన అతని తపస్సుచేత ఆ వనమంతయు ప్రకాశించుచుండెను. అతని తపస్సును రూపమును చూచి మేము మోహించి తపోవిఘ్నము చేయ నారంభించితిమి. నేను, సౌరభేయి, సమీచి, బుద్బుద, లత, ఈ యైదుగురము ఒకేసారి ఆ బ్రాహ్మణుని సమీపమునకు పోయితిమి, పాడుచు ఆడుచు నవ్వుచు అతనిని ప్రలోభపెట్టుట కారంభించితిమి. అతడు అకలంకమైన తపోదీక్షలో ఉండి ఏమాత్రము చలించక 'మీ రైదుగురు మొసళ్లై నీటిలో నూరుసంవత్సరములు ఉందురుగాక' అని మమ్ము శపించెను. మేము చాల వ్యథచెంది ఆ బ్రాహ్మణుని శరణు వేడితిమి. 'స్త్రీవధ ధర్మవిరుద్ధ' మంటిమి. 'శరణాగత రక్షణము సర్వధర్మములలో నుత్తమము గదా! మమ్ము క్షమించి రక్షింపు' మంటిమి. అప్పు డాతడు, "శత, సహస్రశబ్దములు లోకములో అనంతములు' అని అర్థము నిచ్చును. మీకు నూరేండ్లు అనుశాపకాలము అనంత కాలము కాదు. అది కేవలము నూరు మాత్రమే యగును. మొసళ్ళ రూపములలో నున్న మిమ్ము

జలమునుండి నేలపైకి ఏ పురుషుడు ఈడ్చునో వానివలన శాప విముక్తి కలిగి తిరిగి స్త్రీ రూపములను ధరించగలరు. నామాట తప్పదు. మీరు గ్రాహరూపములతో ప్రవేశించిన తీర్థములు 'నారీ తీర్థములు' అని నేటినుండి అనబడును. అవి అత్యంత పుణ్య తీర్థము లగును." అని చెప్పెను. అక్కడినుండి మేము పోయి 'మాకు శాపవిముక్తిని త్వరలో కలిగించు పురుష దెవరు లభించునా'యని చింతించుచుంటిమి. మాకడకప్పుడు నారదుడు వచ్చెను. అతనికి నమస్కరించి తలవంచి నిలుచుంటిమి. 'మీ దుఃఖమునకు కారణమేమి?' అని నారదుడు మమ్మడిగెను. మేము జరిగిన సంగతి యతనికి చెప్పితిమి. 'దక్షిణ సముద్ర తీరము నందలి యైదు పుణ్యతీర్థములలో మీరు ప్రవేశించి యుండుడు. అక్కడికి అర్జునుడు తీర్థయాత్రకై వచ్చి మీకు శాపవిముక్తి కలిగించగలడు.' అని నారదుడు మాతో చెప్పెను. ఆయనచెప్పిన ప్రకారమే నీవలన నాకు శాపమోక్షము కలిగినది. నా సఖురాండ్రను నన్నువలెనే యీవలికిలాగుము అని ఆమె చెప్పిన మాటనువిని అర్జునుడు తక్కినవారలనుగూడ ఆమెకువలెనే శాప విముక్తి కలిగించెను. అక్కడినుండి అర్జునుడు తిరిగి చిత్రాంగద వద్దకు పోయెను. ఆమెయందు 'బభ్రువాహనుడు' అను పుత్రుని గనెను. అప్పుడు మామగారైన చిత్రవాహనునితో 'మీకు కన్యాశుల్కమును చెల్లించి ఋణవిముక్తుడనైతిని.' అనిచెప్పి చిత్రాంగదితో 'పుత్రుని రక్షించుకొనుచు నిచటనే యుండుము. సమయము వచ్చినపుడు ఇంద్రప్రస్థమునకువచ్చి నాతో నుండువు గాక. మా అన్నగారుచేయు రాజసూయయాగమునకు మీతండ్రితో నీవు నాకడకురమ్ము' అనిచెప్పి అర్జునుడు పరమేశ్వరుని ఆది స్థానమైన గోకర్ణ క్షేత్రమునకు పోయెను. ఆ క్షేత్రమును చూచి నంత మాత్రముననే మోక్షమును పాపాత్ముడుగూడ సాధించగలడు.

ఆతరువాత అర్జునుడు పశ్చిమసముద్ర తీరమునందలి తీర్థములను సేవించి, ప్రభాస క్షేత్రమునకు పోయెను. ఆ సంగతి తెలిసి కృష్ణుడక్కడికి పోయెను. ఇరువురు మహానంద భరితులై పరస్పరము ఆలింగనముచేసికొని ఆ వనమునందు 'నరనారాయణ ఋషులు' అనుపేరుతో నుండిరి. కృష్ణుడడుగగా, అర్జునుడు తనతీర్థయాత్ర కారణమునుచెప్పెను. వారిరువురు విహరించుచు 'రైవతకము' అను పర్వతమును చేరిరి. అంతకు పూర్వమే కృష్ణుడు పర్వతమును అర్జునునకు వాసయోగ్యముగా, సమస్త వస్తువులను చేకూర్చి అలంకరింప జేసియుండెను. అర్జునుడు వాటి నన్నిటిని అనుభవించి నట నర్తకుల నృత్య వినోదములను చూచి కృష్ణునితో ఇష్టా గోష్ఠి సలుపుచు నిద్రించెను. ఉదయమే లేచి వారిరువురు ద్వారకకు పోయిరి. ద్వారకా వాసులందరు అర్జునుని చూచి యానందించి యతనినెదుర్కొని గౌరవించిరి. అర్జునుడు కృష్ణునియింటిలో చాలానాళ్లు ఉండెను.

(సశేషము)

# ప్రజలకు సహాయం

## భారత సైనిక పరిషత్తులో ప్రవేశం

డెహ్రాడూన్‌లోని భారత సైనిక పరిషత్తులో 27 వ పట్టభద్రుల కోర్సు, 1968 జూలై నెలలో ప్రారంభమౌతుంది. ఇది ఒక ఏడాది కోర్సు.

భారత సైనిక పరిషత్తులో ఉచితంగా శిక్షణ యివ్వబడుతుంది. విద్యార్థి సైనికుల తల్లిదండ్రుల, లేదా గార్డియన్ల నెలసరి ఆదాయం 350 రూపాయలకు మించకుండా వుంటే, అటువంటివారికి ఆర్థిక సహాయంకూడా యివ్వబడుతుంది

ఇంజనీర్స్ దళం, సిగ్నల్సుదళం, ఎలెక్ట్రికల్ అండ్ మెకానికల్ ఇంజనీర్స్, సైనిక సర్వీస్‌దళం (ఆహార తనిఖీ వ్యవస్థ) సైనిక విద్యాదళం మొదలైనవాటిలో శాశ్వత కమిషన్లు మంజూరు చేసేందుకై కొన్ని ఖాళీలు యేర్పడి వున్నాయి వీటికిగాను భారతీయులలో పురుషులను ఎన్నిక చేస్తారు

ఇంజనీరింగ్‌లో తగిన అర్హతలుగల అభ్యర్థులకు, శిక్షణ కాలానికిగాను 2వ లెఫ్టినెంట్ హోదాలో తాత్కాలిక స్వల్పకాలిక కమిషన్ మంజూరు చేస్తారు నిర్ణీత నిబంధనలననుసరించి శాశ్వత కమిషన్ మంజూరు చేసినప్పుడు, అది అంతకు రెండేళ్ళకు ముందునుంచి మంజూరు చేసినట్టుగా పరిగణిస్తారు

### అర్హతలు

సైనిక విద్యాదళంలో ప్రవేశంకోరు అభ్యర్థులు ఎం. ఎ. పరీక్షలో కానీ లేదా ఎం. ఎస్. సి. పరీక్షలో కానీ మొదటి విభాగం కానీ లేదా రెండో విభాగంలోగానీ ఉత్తీర్ణులై వుండాలి. గణిత శాస్త్రం, సాంఘికశాస్త్రం, భౌతిక విజ్ఞానశాస్త్రం, గ్రంథాలయ విజ్ఞానశాస్త్రం, రసాయనికశాస్త్రం, నిరూపక సంఖ్యాశాస్త్రం వీటిలో ఒకటి వారి పాఠ్యాంశమై వుండాలి. ఇంతేగాకుండా, విద్యాబోధనలో డిగ్రీవి కానీ లేదా డిప్లొమాను కానీ వారు కలిగివుండాలి ; ఉన్నత పాఠశాల హయ్యర్ సెకండరీ పాఠశాల, కళాశాల లేదా విశ్వ విద్యాలయంలో విద్యాబోధనలో రెండు, మూడేళ్ల అనుభవం వుండాలి.

ఇంజనీర్స్ దళం, సిగ్నల్సుదళం, ఎలక్ట్రికల్ అండ్ మెకానికల్ ఇంజనీర్స్, సైనిక సర్వీస్ దళం (ఆహార తనిఖీ వ్యవస్థ), వీటిలో ప్రవేశంకోరు అభ్యర్థుల వయస్సు 1968జూలై 1 వ తేదీనాటికి 20 సంవత్సరాలకు పైగాను 27 సంవత్సరాలకు లోపుగాను వుండాలి. అదేవిధంగా సైనిక విద్యాదళంలో ప్రవేశంప కోరువారి వయస్సు, 1968 జూలై 1 వ తేదీనాటికి, 23 ఏళ్లకు పైగానూ 27 ఏళ్ళకు లోపుగానూ వుండాలి.

ఈ దేశంలో నివసిస్తున్న అభ్యర్థులు 1968 జనవరి 1వ తేదీలోగా చేరేట్టుగా దరఖాస్తులు పంపాలి. అదేవిధంగా, ప్రభుత్వ ఉద్యోగులు 1968 జనవరి 15 వ తేదీలోగా చేరేటుగాను విదేశాలదర నివసిస్తున్నవారు 1968 జనవరి 31వ తేదీలోగా చేరేట్టుగాను లో ఖాస్తులు పంపాలి

ఆర్మీ హెడ్‌క్వార్టర్సు, అడ్జుడెంట్ జనరల్స్ బ్రాంచ్, వెస్టుబ్లాక్ III, ఆర్. కె పురం, న్యూఢిల్లీ — 22 చిరునామాకు వ్రాసి దరఖాస్తు ఫారాలను ఉచితంగా తెప్పించుకోవచ్చును. దరఖాస్తు ఫారాలకొరకు పంపే అభ్యర్థనలలో అభ్యర్థి వయస్సు, విద్యార్హతలు, సాంకేతిక అర్హతలు, మొదలైనవి తెలియచేయాలి, అభ్యర్థి చిరునామాతో కూడిన కవరును కూడా దానికి జతపరచాలి.

## కాకినాడ మత్స్య పారిశ్రామికుల శిక్షణ సంస్థ

మత్స్య పరిశ్రమలోని బెస్తవారికి ఆధునిక పద్ధతులతో శిక్షణ యివ్వడానికి రాష్ట్ర మత్స్యశాఖ కాకినాడలో మత్స్య పారిశ్రామికుల శిక్షణ సంస్థను నెలకొల్పింది. 1966_67 సంవత్సరం నుండి 12 నెలల పాటు 20 మంది బెస్తవారికి యీ సంస్థలో శిక్షణ యిస్తున్నారు. శిక్షణ కాలంలో అభ్యర్థులకు నెలకు రు. 15/_ల చొప్పున భోజనపు అలవెన్సుతోపాటు రు. 50/_ల స్టయిఫండు కూడ యిస్తున్నారు. శిక్షణ పూర్తి అయిన తర్వాత వారు సబ్సిడీ రేటుపై యంత్ర పరికరాలుగల పడవలనుపొంది చేపలుపట్టే కార్యక్రమాన్ని నిర్వహిస్తారు ఈ పరిశ్రమలోని వివిధ రంగాలలో మత్స్యశాఖకు చెందిన అధికారులకుకూడ యీ సంస్థలో శిక్షణ యిస్తారు. ఈ సంస్థను అప్ గ్రేడ్ చేశారు. 1966_66 విద్యా సంవత్సరంలో పోస్టు గ్రాడ్యేటు డిప్లొమా కోర్సును యిక్కడ ప్రారంభించారు మొదటి బ్యాచీలో చేరిన 18 మంది విద్యార్థులు త్వరలోనే యీ కోర్సును పూర్తిచేయనున్నారు. రెండవ బ్యాచికి చెందిన 19 మంది విద్యార్థులు 1966_67 లో ఒక సంవత్సరం కోర్సు (ప్రీవియస్‌ను) పూర్తిచేశారు.

## గుంటూరులో పాలిటెక్నిక్

స్త్రీలకు సాంకేతిక విద్య గరపే ప్రయత్నాలు యిటీవల ఎక్కువగా కొనసాగుతున్నవి. హైదరాబాదులో ప్రైవేటురంగంలోనూ, కాకినాడలో ప్రభుత్వ రంగంలోనూ గరల్స్ పాలిటెక్నిక్ సంస్థలు పనిచేస్తున్నవి. ప్రభుత్వం స్థాపించిన సాంకేతిక పాఠశాలలు కాక ప్రైవేటు మేనేజిమెంటు క్రింద నడుపబడుతూ, ప్రభుత్వంచే గుర్తించబడిన సాంకేతిక పాఠశాలలు వున్నవి. ఒక్క గుంటూరు జిల్లాలోనే యిటువంటివి 18 పాఠశాలలు వున్నవి. "వుమన్ వెల్‌ఫేర్ టెక్నికల్ టీచర్స్ అండ్ క్రాఫ్ట్స్ ట్రైనింగ్ స్కూలు" అనే పేరుతో 1955 జూన్ నుండి గుంటూరులో ఒక ప్రైవేటు పాఠశాల నడుస్తున్నది. దీనిలో టైలరింగ్, ఎంబ్రాయిడరీ, డ్రెస్ మేకింగ్, సంగీతం, భరత నాట్య , డ్రాయింగ్ మొదలగునవి నేర్పుతున్నారు. ఒక్కొక్కటి రెండేడ్ల కోర్సు. ఈ పాఠశాలను ప్రభుత్వం గుర్తించింది. బాలికలు ఏదో ఒక సాంకేతిక విద్య నేర్చుకుని తమ జీవనోపాధికి వసతి ఏర్పాటు చేసుకుని, కుటుంబములకు సహాయకారులుగా వృద్ధి కావడం దేశ పురోగతికి ఎంతో అవసరం. ✱

# సమాధాన వేదిక

బి. వెంకటేశ్వరరావు, కొమ్మినిపల్లి, ఖమ్మంజిల్లా.

ప్రశ్న: ఆ మధ్య దానిమ్మ చెట్టు ఒకదానిని నాటాము. రెండు ఏళ్ళాది అది పూతకు వచ్చింది. అయితే మొగ్గలు నిలువ డంలేదు. పురుగులు కొట్టేస్తున్నాయి. దీని నివారణోపాయం తెలియ జేయండి?

సమా. సాధారణంగా దానిమ్మ పూలను పురుగులు రంధ్రాలు చేసి లోపలికి దూరడంవల్ల మొగ్గలు రాలిపోతుంటాయి రెండు రకాలుగా వీటిని అరికట్టవచ్చు.

ఒకటి : దానిమ్మ మొగ్గచుట్టూ కాగితం సంచినిగాని, గుడ్డను గాని చుట్టితే పురుగుల నుంచి రక్షణ కలుగుతుంది.

రెండు : ఎండ్రినుగాని డి. డి. టి ని గాని చల్లితే పురుగులు దరిచేరవు.

ఎం. రంగనాథరావు, జగన్నాధపురం, మచిలీపట్నం.

ప్రశ్న: మరణ దండనను అమలు పరిచే విషయములో మన రాష్ట్రములో అమలులోవున్న విధానం ఏమిటో తెలియజేయండి. భారత దేశమంతటా యిదే విధానాన్ని అమలు పరుస్తున్నారా ?

సమా. సెషన్స్‌కోర్టు మరణశిక్ష విధించిన ఖైదీలను జైలులో వుంచుతారు. వారిని విడిగా బంధిస్తారు. సెషన్స్‌జడ్జీలు విధించిన మరణ దండనను హైకోర్టు ఖాయపరచ వలసి వుంటుంది. హైకోర్టు కూడా మరణ దండనను ఖాయ పర చిన తర్వాత సెషన్స్‌కోర్టు, ఆ వ్యక్తిని ఉరి తీయవల సిందిగా వారంటును జారీ చేస్తుంది. వారంటు అందిన వెంటనే ఆ విషయాన్ని జైలు సూపరింటెండెంటు ఖైదీకి తెలియజేసి, భారత రాజ్యాంగచట్టంలోని అతనికి వర్తించే ఏ అంశం క్రిందనైనా సుప్రీం కోర్టుకు తన కేసును నివే దించు కోదలిస్తే సుప్రీంకోర్టు 1950 సం.పు నిబంధనల్లో సూచించిన వ్యవధి లోపల నివేదించు కోవచ్చని తెలియ జేస్తారు.

అపరాధి, సుప్రీంకోర్టుకు చేసుకున్న అపీలును సుప్రీం కోర్టు త్రోసి వేసినా, లేదా అతను అపీలు చేసుకోవడానికి స్పెషల్‌లీవు నిమిత్తం సుప్రీంకోర్టుకు అతనుగాని, అతని తరఫున మరొకరుగాని చేసిన దరఖాస్తును సుప్రీంకోర్టు త్రోసివేసినా— యింతకు ముందు అపరాధి తనను దయ దలచమని దరఖాస్తు చేసుకోనట్టయితే— అలాంటిది పెట్టుకోదలిస్తే వారం రోజులలోగా దరఖాస్తు చేసుకోవల సిందిగా జైలు సూపరింటెండెంటు ఆ అపరాధికి తెలియ జేస్తారు. ఈ దరఖాస్తుల్ని రాష్ట్ర గవర్నరుకు, రాష్ట్రపతికి ఉద్దేశిస్తూ పెట్టుకోవలసి వుంటుంది. జైలు సూపరింటెం డెంటు ఆ దరఖాస్తుల్ని జైళ్ళశాఖ కార్యదర్శికి పంపిస్తారు. దానితోపాటు ఉరి తీయడానికై నిర్ణయించిన తేదీని తెలియ జేస్తూ ప్రభుత్వంవద్ద నుంచి ఆ దరఖాస్తుకు సమాధానం వచ్చేవరకు ఉరి తీయడాన్ని నిలిపివుంచుతామని ధృవ పరుస్తూ లేఖ కూడా జతపరుస్తారు. రాష్ట్ర ప్రభుత్వంద్వారా రాష్ట్రపతి ఉత్తరువు అందడంతోనే అపరాధిని ఉరితీస్తారు.

ఈ విధానమే భారత దేశమంతటా అమలులో వుంది.

శ్రీ కె. శ్రీరాములు, రాయుడుపాలెం, చింతలపూడి తాలూకా ప. గోదావరి జిల్లా.

ప్రశ్న: ప్రస్తుతం పౌష్టిక పదార్ధాల అవసరం చాలా ఎక్కువయ్యింది. ఎలాంటి చర్యలు తీసుకోవాలో కాస్త తెలియ జేయండి?

సమా. 1. ఆహారాన్ని వృధా పరచకండి. అన్నం తినేవాళ్లు గోధుమ రొట్టెలు తినడం అలవాటు చేసుకోవాలి. దీనివల్ల విదేశీ మారక ద్రవ్యాన్ని దేశానికి ఆదాచేసిన వారవుతారు.

2. విందులు, వినోదాల్లో ఎక్కువగా ఖర్చు చేయకండి. పెద్ద ఆడంబరాలతో పెళ్ళిళ్ళు చేయడం తగ్గించండి.

3. ఉక్కు, సిమెంటు, కలప, లోహాలు, కిరసనాయిలు, కాగితం, విద్యుచ్ఛక్తి మొదలైన కొరతగల వాటి విని యోగంలో అతిగా ఖర్చు చేయకండి.

4. ఇతర దేశాలకు ఎగుమతిచేస్తుండే వస్తువుల వంటి వాటిని తక్కువగా కొనండి.

5. తక్కువదూరం ప్రయాణించండి.

శ్రీ నన్నూరు మల్లారెడ్డి, గుడపూర్, నల్గొండ జిల్లా.

ప్రశ్న: భారత దేశంలో మొట్ట మొదటిసారిగా రేడియో స్టేషను ఎక్కడ నెలకొల్పారండి?

సమా. ఇండియన్ బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీ 1927 జూలై 23వ తేదీన మొట్ట మొదటి సారిగా బొంబాయిలో రెగ్యులర్ బ్రాడ్ కాస్టింగ్‌ను ప్రారంభించింది.

ప్రశ్న: ఆకాశవాణిని ఎప్పుడు ఏర్పాటు చేశారు?

సమా. 1936 జూన్ 8వ తేదీన ఇండియన్ స్టేట్ బ్రాడ్ కాస్టింగ్ సర్వీసు పేరును ఆకాశవాణిగా మార్చారు.

# పండుగలూ పర్వదినాలూ

## క్రిస్మస్

బెత్లెహేము నగరంలో సామాన్య మానవుడుగా పశువుల పాకలో మరియమ్మ కడుపున ఒక బాలుడు జన్మించాడు. ఆకాశంలో నక్షత్రం ఒకటి వెలిసింది. పశువుల కాపరులు ఆ నక్షత్రాన్ని చూశారు. దేవదూత వారికి కనిపించి దైవ తనయుడు పుట్టాడని తెలియజేసింది. వారు వెతుక్కుంటూ వెళ్ళి ఆ బాలుని కనుగొన్నారు. భక్తితో నమస్కరించారు. ఆ బాలకుడు పెరిగి పెద్దవాడై దేవుని సందేశాన్ని వినిపించాడు. పాపులకొరకు తన జీవితాన్ని బలి యిచ్చాడు.

ఆయనే ఏసుక్రీస్తు.

ఆ క్రీస్తు జన్మదినోత్సవమే క్రిస్మస్. యెహోవా కుమారుడయిన క్రీస్తు ప్రభువు భూలోకంలో పాపుల తరఫున తన రక్తాన్ని చిందించాడు. పరమ దారుణంగా సిలువ వేయబడ్డాడు.

ప్రయాసపడి భారము మోయు జనులారా నావద్దకు రండి-అని అభయ హస్తాన్ని పట్టిన దయామయుడు ఆయన. దరిద్రులను, పాపులను చిరునవ్వుతో దరిచేర్చుకున్నాడు. పతితురాలిపై రాళ్లు రువ్వుతున్న సంఘాన్ని గర్హించి మానవత్వాన్ని బోధించాడు. భగవత్ సందేశాన్నే గాదు మానవత్వాన్ని కూడా ప్రబోధించాడు నీతిమార్గాన్ని బోధించి. రోగులకు సేవచేసి, పరిత్యజించబడిన అదృష్టహీనులను సైతం దరణతో దగరకు చేర్చుకుని వారిని సంఘంలో మనషులుగా నిలిపాడు.

యెహోవా పుత్రుడు ఆయన. తన తండ్రి తనను పంపిన కార్యాన్ని భూమి మీద ఆయన నిర్వర్తించాడు. తండ్రి సందేశాన్ని ప్రేమామృతాన్ని. సేవాభావాన్ని. జాలి, దయ క్షమాది గుణాలను ఆచరణ పూర్వకంగా చేసిచూపి మార్గదర్శకమయ్యాడు. చివరకు ప్రజలకొరకు తను సైతం ప్రాణాలు విడిచాడు. అట్టి దైవపుత్రుడైన ఏసుక్రీస్తు జన్మదినమే క్రిస్మస్.

క్రిస్మస్ పండుగను ప్రతి సంవత్సరం డిశంబరు 25 వ తేదీన జరుపుతుంటారు. ఆ పండుగకు నెలరోజుల ముందునుంచీ తెల్లవారుఝామున క్రీస్తు సందేశాన్ని మోసుకుని, భజన పాటలు పాడుకుంటూ క్రైస్తవులు యింటింటికి వెళ్తారు. 24 వ తేదీ రాత్రి క్రిస్మస్ చెట్టును పాతి. దాన్ని శోభాయమానంగా అలంకరించి భగవంతుని కొలుస్తారు. ప్రార్థనలు చేస్తారు. వివేదనలు యిస్తారు. క్రిస్మస్‌నాడు చర్చి గంటలు కళ్యాణ కింకిణులై వినిపిస్తాయి.

## రంజాన్

మహమ్మదీయులు ఉపవాసాలతో, ఖురాన్ పఠనంతో, దాన ధర్మాలతో గడిపే నెల రంజాన్ నెల. మహమ్మదీయుల పండుగలన్నింటిలో అతి ముఖ్యమైనది. వారి హిజ్రీ సంవత్సరంలో తొమ్మిదవ నెల రంజాన్.

రంజాన్ నెల పొడవునా ప్రతి మహమ్మదీయుడూ అల్లాకు ప్రీతిపాత్రమైన పనులు చేస్తూ ఆయనను హృదయాన ప్రతిష్ఠించుకొని ముక్తికై ప్రయత్నిస్తుంటాడు.

ఇస్లాం పవిత్ర గ్రంథమైన ఖురాన్‌ను మహమ్మద్‌కు అల్లా అందజేశాడనీ, దానిని మహమ్మదు ఈ భూలోకంలో వ్యాప్తి చేశాడని ఒక ప్రతీతి. అట్టి పవిత్ర గ్రంథం లభించిన యీ కాలాన్ని అతి పవిత్రంగా భావిస్తారు.

ఈ నెలలో మహమ్మదీయులు అయిదు నియమాలను పాటిస్తారు. ప్రతిరోజు తమ పవిత్ర గ్రంథమైన ఖురాన్‌ను పఠిస్తారు. రోజుకు అయిదుసార్లు అల్లాను ప్రార్థిస్తారు. బీదబిక్కజనానికి దాన ధర్మాలను విరివిగా చేస్తారు. పగలంతా ఉపవాసాలతో ఏకభుక్తాన్ని పాటిస్తారు. అవకాశం వున్నవారు మక్కాయాత్రకు, లేదా మసీదుకు వెళ్తారు. ఇస్లాం మత పవిత్ర గ్రంథమైన ఖురాన్‌లో ఈ అయిదు విధులను పాటించవలసినవిగా పేర్కొనబడివుంది. ఖురాన్ రెండవ ప్రకరణం 'బకర్' లో ఉపవాసకాలాన్ని ఏ విధంగా గడపాలో వివరింపబడింది. రంజాన్ నెలలో కొత్త చంద్రుడు కనిపించే రోజుతో వీరి ఉపవాసం ప్రారంభమౌతుంది. ఆ నెల పొడవునా వారు దాన్ని పాటిస్తారు. ఒకవేళ పాటించలేనప్పుడు ఆ నెలలో కొన్ని ముఖ్యమైన తేదీలలో దాన్ని పాటించవలసిందిగా ఖురాన్ పేర్కొంది.

రంజాన్ నెల 27 వ రోజు అలాంటిది. 26—27 రాత్రిని 'లైలతుల్ ఖదర్' అంటారు. ఆరోజు, వెయ్యి నెలలకన్న ఉత్తమమైనదిగా ఖురాన్ ప్రస్తావించింది. ఆ రాత్రినాడే ఇస్లాం ప్రవక్తకు భగవత్ సందేశం అందింది.

రంజాన్ నెల ప్రతి భక్తుని హృదయంలోనూ భక్తి కవాటాలను తెరుస్తుంది. జాలి దయాది గుణాలను నింపుతుంది.



# ఉత్సవాలు

నవంబరు నెల మొత్తం రాష్ట్రానికంతటికీ పండుగల నెల. నవంబరు ఒకటిన దీపావళి పండుగను జరుపుకున్నాం. ఈ ఏడాది యీ పండుగ ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవంతో కలిసి పోయింది. ఇంత ఆర్భాటంగా, ఇంత ఉత్సాహంతో, ఇంత ఘనంగా ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవాన్ని యింతకు ముందెప్పుడూ జరుపుకోలేదు. అనేకచోట్ల పెద్ద పెద్ద ఊరేగింపులు, సాంస్కృతిక కార్యక్రమాలు, కవి సమ్మేళనాలు ' ¯యి. నవంబరు ఒకటిన



లాల్‌బహదూర్ స్టేడియంలో నవంబరు 1వ తేదీన అతి ఘనంగా జరిగిన ఆంధ్రప్రదేశ్ అవతరణదినోత్సవ సభలో రాష్ట్ర గవర్నరు శ్రీ పట్టం ఎ. థానుపిళ్ళై ప్రసంగిస్తున్న దృశ్యం.

పండుగ సంరంభం మధ్య కొత్తరోజా రేఖలు విచ్చుకుంటున్న సమయంలో లాల్‌బహదూర్ స్టేడియంలో బ్రహ్మాండమైన విన్యాస ప్రదర్శన జరిగింది. దీనిలో ఎన్. సి. సి., హోంగార్డులు, గరల్ గైడ్‌లు, బాలభటులు పాల్గొన్నారు. ఇంకా అనేక మతాలవారు, అల్పసంఖ్యాక వర్గ ప్రతినిధులు, సినీతారలుకూడా పాల్గొన్నారు. సువిశాలమైన గద్దె, ఆ గద్దె ముందు పెద్ద భారత దేశపు పటం, ఆ పటం మధ్య చిరునవ్వులు చిందిస్తూ అభయహస్తంపట్టి కరుణార్ద్ర దృక్కులతో జాతిపిత_ దూరంలో గేలరీ నుంచి చూసే వారికి ఆ దృశ్యమంతా జాతీయ సమైక్యతా కృషిలో ఆంధ్రప్రదేశ్ అవిరళ కృషిని స్ఫురణకు తెస్తుంది.

జన సంబంధ శాఖా మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ అధ్యక్షులుగాగల ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ నిర్వహణ కేంద్ర సంఘం ఈ ఉత్సవాలను అతిఘనంగా జరిపించింది. జంట నగరాలలోని అన్ని ప్రాంతాలలోనూ, రాష్ట్రంలోని జిల్లా, బ్లాకు కార్యస్థానాలలోనూ అసంఖ్యాక ప్రజానీకాన్ని ఆకర్షిస్తూ ఆడంబరంగా యీ ఉత్సవాలను జరిపించింది. ఈ సందర్భంలో విరివిగా జనాన్ని సమావేశ పరచడమే గాక, సమాజంలోని బీద ప్రజానీకానికి సుప్రసిద్ధ కళాకారుల సాంస్కృతిక కార్యక్రమాలను దర్శించే అవకాశాలను కల్పించడం ఈ కార్యక్రమాల ప్రత్యేకత. సాంఘిక జీవితంలో ఆనందావకాశాలను సర్వులు సమానంగా పంచుకునేందుకు అవకాశాన్నిచ్చే కార్యక్రమం యిది. ఈ కార్యక్రమాలన్నీ అతి హుందాగా, క్రమశిక్షణకు ఎక్కడా భంగం వాటిల్లకుండా చక్కగా జరిగాయి.



ముఖ్యమంత్రి ప్రసంగిస్తున్న దృశ్యం

లాల్‌బహదూర్ స్టేడియంలో జరిగిన బ్రహ్మాండమైన విన్యాసాన్ని ఉద్దేశిస్తూ రాష్ట్ర గవర్నరు శ్రీ పట్టం ఎ థానుపిళ్ళై, స్పీకర్ శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, శాసన మండలి అధ్యక్షుడు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, ప్రధాన న్యాయమూర్తి శ్రీ జగన్మోహనరెడ్డి, ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రసంగించారు.

పరిపాలన, న్యాయ, శాసన రంగాలలో ప్రధానాధిపతులు ఒకేసారి యీ విధంగా ఈ కార్యక్రమాలతో సంబంధం కలిగి వుండడం యిదే ప్రథమం. జంట నగరాలలో పదహారు ప్రాంతాలలో పెద్ద ఎత్తున జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల్ని తిలకించడానికి ప్రతిచోట వేలాది ప్రజలు సమావేశం కావడం కూడా యిదే ప్రథమం. ఈ పదహారు చోట్ల కూడా సుప్రసిద్ధ చలన చిత్ర తారలు, గాయకులు పాల్గొన్నారు.



అఫ్జల్‌గంజ్ కేంద్రంలో ఘంటసాల పాడుతున్న దృశ్యం



దారుసలామ్ కేంద్రంలో వైద్యశాఖామంత్రి మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ, అక్కినేని, గుమ్మడి, శ్రీమతి అంజలీదేవి

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాన్ని జాతీయ ఉత్సవంగా భారీ ఎత్తున నిర్వహించాలనే నిర్ణయాన్ని సియాసత్ (నవంబరు 1) ఉర్దు దినపత్రిక హర్షించింది. రాష్ట్ర ప్రగతిని సమీక్షిస్తూ రాష్ట్ర ఉన్నత సంప్రదాయాలను పటిష్ఠం చేయడానికి యీ ఉత్సవాలు దోహదం చేస్తాయనే ఆశాభావం వ్యక్తంచేసింది. ఈ దినోత్సవాన్ని కొత్త పంథాలో నిర్వహించడానికి చొరవ తీసుకున్నందుకు జన సంబంధ, శ్రామిక మంత్రిని యీ పత్రిక అభినందించింది.

అంగారె (నవంబరు 3) మరో ఉర్దు దినపత్రిక, మంత్రిని, ఉత్సవ నిర్వాహకులను అభినందించింది, "రాష్ట్రంలోని వివిధ భాషా వర్గాల మధ్య సంపూర్ణ సమైక్యత, సత్సంబంధాలు నెలకొని ఉన్నట్లు యీ ఉత్సవాలు వ్యక్తం చేస్తున్నాయి."

## గో సంవర్ధన వారోత్సవం

మర్నాడు_అంటే నవంబరు రెండవ తేదీన గోసంవర్ధన వారోత్సవం ప్రారంభమైంది. జనసంబంధ శాఖ యీ సందర్భంలో ఏర్పాటు చేసిన పశు ప్రదర్శన, ఊరేగింపు కన్నుల విందు చేకూర్చింది. దీనికి జనసంబంధ శాఖా మంత్రి శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ అధ్యక్షత వహించారు. గోసంవర్ధన అంటే గోవులనేకాక బలహీనులను, అసహాయులను సంరక్షించడం అని శ్రీ బాపూజీ పేర్కొన్నారు. పశుప్రదర్శనలో 150 పశువుల్ని ప్రదర్శించారు. రాణీ సరళాదేవికి చెందిన ఆవును ఉత్తమ గోవుగా నిర్ణయించారు. వ్యవసాయ, పశు సంవర్ధక శాఖా మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి పశు ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు.

## సహకార వారోత్సవం

నవంబరు 4 వ తేదీన అఖిలభారత సహకార వారోత్సవం ప్రారంభమైంది. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర సహకార యూనియన్ కార్యాలయ ఆవరణలో యీ వారోత్సవానికి ప్రారంభోత్సవం జరిగింపె. రాష్ట్రంలో సహకార సంఘాలు బాగా ఎక్కువయ్యాయి. ప్రజల మధ్య అన్ని స్థాయిలలోనూ సహకారం విస్తరించింది.

## స్త్రీ, శిశు సంక్షేమ సప్తాహం

రాష్ట్ర చరిత్రలో మొట్టమొదటి సారిగా 'స్త్రీ, శిశు సంక్షేమ సప్తాహం' రాష్ట్రమంతటా జరుపబడింది. నవంబరు 14 నుంచి 20 వరకు వారం రోజులపాటు యీ ఉత్సవాన్ని జరిపారు. స్వచ్ఛంద మహిళా సంస్థల ప్రోత్సాహ, సహకారాల వల్లా, జన సంబంధశాఖామంత్రి శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ మార్గదర్శకత్వం వల్లా ఈ సప్తాహం అత్యంత విజయవంతంగా జరిగింది.

స్త్రీ, శిశు సంక్షేమానికి ప్రత్యేక కృషి అవసరం. అందుకే వారి విద్యాభివృద్ధితోపాటు ఎప్పటికప్పుడు వారి సంక్షేమానికై నేడు అనేక యితర చర్యలు తీసుకొంటున్నారు. బాలల సంక్షేమం



బాలల దినోత్సవసభలో ఉపన్యసిస్తున్న జనసంబంధ శాఖ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ

యొక్క అవసరాన్ని సర్వత్రా గుర్తించేటట్టుచేయడానికై నవంబరు 14 న బాలల దినోత్సవంగా నిర్ణయించారు

పబ్లిక్ గార్డెన్స్‌లో ఏర్పాటు చేసిన బాలల పంతిలోకం, బాలల విన్యాసం నిజంగా చూసితీరవలసిందే. జవహర్ బాలభవన్ ముందు సుదీర్ఘమైన బాలలవిన్యాసాన్ని ఉద్దేశిస్తూ రాష్ట్ర జనసంబంధ శాఖ మంత్రి మాట్లాడుతూ, బాలల వికాసానికి, సంక్షేమానికి నిరంతర కృషి జరపాలనీ, ఆ కార్యక్రమాలను తీవ్రతరంచేసే బాధ్యత ప్రజల భుజస్కంధాలమీద వున్నదనీ పేర్కొన్నారు. సాంఘిక శాఖా మంత్రి శ్రీ అరిగె రామస్వామి అధ్యక్షత వహించారు విజిలెన్స్ కమీషనర్ శ్రీ కె ఎన్ అనంతరామన్, ఐ సి ఎస్, ఆకాశవాణి బాలల కార్యక్రమ నిర్వాహకుడు శ్రీ ఎన్. రాఘవరావు, తదితరులు కొందరు బాలలను ఉద్దేశించి ప్రసంగించారు. ఈ ఉత్సవంలో వేలాది బాల, బాలికలు పాల్గొన్నారు ఈ ఏడాది జరిగినంత పెద్ద ఎత్తున మునుపెన్నడూ బాలల ఉత్సవాలు జరిగలేదు.

బాలల వికాసానికి సంబంధించిన సంస్థలను నెలకొల్పడంలో స్వచ్ఛంద సంస్థల పాత్రను గూర్చి ఆంధ్రమహిళా సభ వ్యవస్థాపకురాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ తమ ప్రారంభోపన్యాసంలో పేర్కొన్నారు. బాలల వ్యాసరచనా పోటీలో గెలుపొందిన వారికి బంగారు పతకాలను బహూకరించారు.

స్త్రీ, శిశు సంక్షేమానికి విశేషంగా సేవచేస్తున్న ప్రముఖులను సంప్రదించి ఈ సప్తాహంలో ఒక్కొక్క రోజు ఒక్కొక్క అంశానికి ప్రాధాన్యతనిస్తూ కార్యక్రమాలు ఏర్పాటుచేయబడ్డాయి. నవంబరు 15 వ తేదీన 'ఆరోగ్యం, పౌష్టికాహారం,' మర్నాడు 'ఆనందప్రదమైన గృహం,' ఆ తర్వాత 'కుటుంబంలో పిల్లలు' 'స్త్రీ ప్రతిపత్తి'—యిలా ఒక్కొక్క ప్రత్యేక అంశం ఒక్కొక్క రోజుకు ప్రత్యేకించి ఆయా కార్యక్రమాలను ఏర్పాటుచేశారు.

నవంబరు 18 వ తేదీన రాష్ట్ర సహకార యూనియన్ హాలులో ఝాన్సీలక్ష్మీబాయి జన్మదినోత్సవం జరుపబడింది. ఈ సందర్భంలో శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రసంగించారు ఝాన్సీ లక్ష్మీబాయి జన్మదినోత్సవంగా నవంబరు 16ను స్థిరీకరించడంలో ఒక ప్రత్యేకత వున్నదని శ్రీ బాపూజీ పేర్కొన్నారు.

నవంబరు 19 న భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ జన్మదినోత్సవం. లేడీ హైదరీ క్లబ్బు ఆవరణలో ప్రధాని జన్మదినోత్సవం ఘనంగా జరిగింది జంట నగరాలలోని మారుమూలల్లోంచి కూడా మహిళలు యీ ఉత్సవానికి హాజరయ్యారు కన్నుల పండుగా జరిగిన ఈ ఉత్సవానికి గవర్నరు సతీమణి శ్రీమతి పొన్నమ్మ ఖాసుబ్రహ్మ అధ్యక్షత వహించారు.



లేడీ హైదరీక్లబ్‌లో ఇందిరాగాంధి జన్మదినోత్సవం జరిగినప్పటి దృశ్యం

మహిళలు అనేక ఉత్తమ గుణాలు కలిగి వుంటారనీ, వారే కుటుంబాలనూ, సంఘాలనూ, దేశాన్ని తీర్చిదిద్దవలసిన వారనీ జనసంబంధ శాఖామంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ అన్నారు. అసభ్యత అనేది ఏ ధోరణిలోవున్నా అది సహించరాదనీ, బహిరంగ స్థలాలలో అసభ్యపోస్టర్లను తొలగించడంలో మహిళలే ఒక ఉద్యమాన్ని లేవదీయాలని కూడా శ్రీ బాపూజీ పేర్కొన్నారు. లేడీ హైదరీ క్లబ్బు ఆవరణలో జరిగిన ఈ ఉత్సవానికి అసంఖ్యాకంగా

మహిళలు పాల్గొన్నారు. శిబిరాన్ని విజయవంతం చేయడంలో అన్ని స్వచ్ఛంద సంస్థల సహకారాన్ని సమీకరించి ఘనంగా కన్నులకు విందు కూర్చుతూ బహుళ సంఖ్యలో ప్రజలను ఆకర్షిస్తూ కార్యక్రమాలను జరిపించినందుకు శ్రీ వై. ఎస్. రావు, శ్రీ ఆమిద్యాల శ్రీరాములు అభినందనీయులు. మహిళా కార్యక్రమాన్ని దిగ్విజయం చేసినందుకు మహిళా కార్యక్రమ నిర్వహణ సంఘం అధ్యక్షురాలు శ్రీమతి ఎ. శ్యామలాదేవిని అభినందించక తప్పదు

## అఖిల భారత సహకార వారోత్సవం

అఖిలభారత సహకార వారోత్సవాలకు సంబంధించి 'వ్యవసాయ ఉత్పత్తుల దినోత్సవం' సందర్భంగా నవంబరు 5 వ తేదీన, ఆంధ్రప్రదేశ్ కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకు మేనేజింగ్ డైరెక్టరు ప్రసంగిస్తూ, చిరదెం, కె సి. కాలువ, నాగార్జునసాగర్ ప్రాజెక్టుల (దాదాపు 3 లక్షల ఎకరాల ఆయకట్టు అభివృద్ధి) క్రింద భూముల అభివృద్ధికి బ్యాంకు సహాయ పడవచ్చునని అన్నారు. ఎం. టి రాజు సంఘం సిఫార్సుల అమలు ఫలితంగా ప్రభుత్వ శాఖల యితోధిక సహాయంతో భవిష్యత్తులో అధిక వ్యవసాయోత్పత్తులను సాధించవచ్చునని ఆయన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

అఖిలభారత సహకార వారోత్సవాల సందర్భంగా నవంబరు 7 వ తేదీన జరిగిన 'మహిళలు, యువత' దినోత్సవంలో స్త్రీలు, బాల బాలికలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార సంఘం మహిళా విభాగం యీ దినోత్సవాన్ని నిర్వహించింది. హైదరాబాదు మహిళా పారిశ్రామిక సహకార సంఘం అధ్యక్షురాలు, డా. ద్వారకాబాయి యీ దినోత్సవానికి అధ్యక్షత వహించారు. డా. ద్వారకాబాయి ప్రసంగిస్తూ, సహకారోద్యమం ద్వారా ప్రజలకు సేవచేయడానికి మహిళలు ముందుకు రావాలని ఆమె ఉద్బోధించారు. మన సాంఘిక, ఆర్థిక లోపాలను సరిదిద్దడానికి యిదే తగిన సాధనమని ఆమె అన్నారు. అఖిల భారత సహకార వారోత్సవం సందర్భంగా మూడవ రోజున "వినియోగదారుల రక్షణ దినోత్సవం" నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార సంఘం అధ్యక్షులు, శ్రీ జి. చంద్రశేఖరం ఆ సందర్భంలో ప్రసంగిస్తూ, దేశంలో వినియోగదారుల మహోద్యమం అభివృద్ధి చెందుతున్నదని ప్రత్యేకంగా పేర్కొంటూ, వినియోగదారుల సహకార సంఘాలలో సభ్యులుగా చేరి, అక్రమ విల్వదారులనుండీ, అక్రమ లాభార్జనపరులనుండీ వినియోగదారులు తమను తాము రక్షించుకోవాలని ఆయన అన్నారు.

1967 నవంబరులో అఖిల భారత సహకార వారోత్సవాల సందర్భంగా మహబూబ్‌నగర్‌లో జరిగిన "వినియోగదారుల రక్షణ దినోత్సవంలో" జన సంబంధ, శ్రామిక మంత్రి, శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రసంగిస్తూ, వినియోగదారులలో సహకార భావం పెంపొందించినప్పుడే వారి సంఘాలు విజయవంతంగా నిర్వహించ బడతాయని అన్నారు.

నవంబరు 9 వ తేదీన రాష్ట్ర పరిశ్రమల మంత్రి, శ్రీ బి. వి. గురుమూర్తి ప్రసంగిస్తూ, సహకార సంఘాలను వాణిజ్య మార్గాలలో నిర్వహించాలని అన్నారు. అఖిల భారత సహకార వారోత్సవాల సందర్భంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార సంఘం కార్యాలయంలో జరిగిన "చేనేతలు, వృత్తి పనివారల దినోత్సవం"లో పరిశ్రమల మంత్రి ప్రసంగిస్తూ, సహకార ఉద్యమం పటిష్ఠం కావడానికి కొన్ని సూచనలు చేశారు. సహకార రంగం ద్వారా స్వలాభార్జన చేసే దృష్టిగల వ్యక్తులను, సహకార సంఘాలలో చేరకుండా నివారించాలని ఆయన అన్నారు. సహకార ఉద్యమ కార్యకర్తలలో చొరవ, ఉత్సాహం, నిజాయితీ ఉన్నప్పుడే యీ రంగంలో విజయం సాధించడం జరుగుతుందనీ, సంఘాలను సమర్థవంతంగా నిర్వహించడానికి సంబంధించిన ముఖ్యమైన సమస్యను నేడు ఎదుర్కొంటున్నామనీ ఆయన అన్నారు.

## రాష్ట్రపతి సందేశం

దేశ ఆర్థిక అభివృద్ధిలో సహకార రంగం నిర్వహించే ప్రముఖమైన పాత్రను గూర్చి రాష్ట్రపతి డా. జాకిర్‌హుస్సేన్ చెప్పారు. జాతీయ సహకార వారోత్సవం సందర్భంగా తమ సందేశమిస్తూ మన దేశంలో మున్నెన్నడూ లేనంతగా, సహకార వ్యవస్థ అవసరం యీనాడు చాలా ఉన్నదని రాష్ట్రపతి అన్నారు.

రాష్ట్రపతి సందేశం పూర్తి పాఠం ఈ దిగువ యివ్వడం జరిగింది

"జాతీయ సహకార వారోత్సవం సందర్భంగా సహకార ఉద్యమంలో పాల్గొనే కార్యకర్తలందరికీ నా సుహృద్భావ శుభాకాంక్షలు అందజేస్తున్నాను.

'మన దేశంలో మున్నెన్నడు లేనంతగా సహకార వ్యవస్థ అవసరం యీనాడు చాలా ఉన్నది. ప్రతి ఒక్కరు అందరికొరకు అందరు ప్రతిఒక్కరి కొరకు – అనేదే మన ధ్యేయం. ఈ ధ్యేయాన్ని సరిఅయిన పద్ధతిగా అనుసరించినప్పుడు, దేశం అన్ని రంగాలలో అభ్యుదయాన్ని సాధించ గలగడంలో నాకు సందేహం లేదు.

మన ఆర్థిక అభివృద్ధి రంగంలో సహకార వ్యవస్థ ప్రముఖ పాత్ర నిర్వహించింది, భవిష్యత్తులో ఘన విజయాలను సాధించాలని ఆకాంక్షిస్తున్నాను"

సామాజిక రంగంలో సహకార వ్యవస్థ అంతటా వ్యాపించిన విడదీయరాని అంశమని ఉప రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి, తమ సందేశంలో అన్నారు. ఈ ఉద్యమ నిర్వహణకు చైతన్యపూరితమైన నాయకత్వం, నిజాయితీ, ఉత్సాహం, అనుభవం, సంపూర్ణ పరిజ్ఞానంగల కార్యకర్తలు కావాలని పేర్కొన్నారు.

ప్రధానమంత్రి సందేశమిస్తూ, వ్యక్తి గౌరవానికి భంగం కలిగించకుండానే సహకారవ్యవస్థ మంచిని చేకూరుస్తుందని అన్నారు. "అభివృద్ధికి సాధనగా ఉపయోగపడుతూ గుత్తాధికారాన్ని నిర్మూలించే వ్యవస్థగా నిరూపితమైనది. వ్యవసాయ ఉత్పత్తుల్ని అధికం చేయాలనే మన ప్రస్తుత కార్యక్రమాలు సహకారఉద్యమం

పైననే ఎక్కువగా ఆధారపడి ఉన్నాయి. అఖిలభారత సహకార వార్షికోత్సవం విజయవంతం కావాలని నేను కాంక్షిస్తున్నాను".

ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షులు, డా. డి. ఆర్. గాడ్గిల్ తమ సందేశంలో, దేశం ఎదుర్కొంటున్న పెక్కు క్లిష్ట సమస్యలను పరిష్కరించడంలో సహాయపడే విధంగా దేశమంతటా సహకార ఉద్యమాన్ని పటిష్ఠం చేయడానికి నిజాయితీగల నాయకత్వం కావాలని అన్నారు.

## చేతిపరిశ్రమల వారోత్సవం

1967 నవంబరులో అనంతపురంలో చేతిపరిశ్రమల వారోత్సవాన్ని నిర్వహించారు. ఈసందర్భంగా ఏర్పాటు చేసిన వస్తు ప్రదర్శనకు జిల్లా కలెక్టరు శ్రీ డి. అరోరా ప్రారంభోత్సవం చేస్తూ చేతి పరిశ్రమలలో ఉత్పత్తి అయిన వస్తువులలో నిజమైన కళ ఉట్టిపడుతూ ఉంటుందని, పారిశ్రామిక వస్తువులలో అదిశూన్యమని ఆయన అన్నారు.

నెల్లూరు కలెక్టరు, శ్రీ ఎన్. కె. మురళీధరరావు, నెల్లూరులో జిల్లాపరిషత్తు విక్రయశాలలో 13వ అఖిలభారత చేతి పరిశ్రమల వారోత్సవానికి ప్రారంభోత్సవం చేశారు.

ఆ సందర్భంలో వాకాడు ఎన్.బి.కె.ఆర్. ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల ప్రిన్సిపాల్, శ్రీ జె. బి. విలియమ్స్ ప్రసంగిస్తూ, చేతి పరిశ్రమల వస్తువులలో మన సంస్కృతి యిమిడి ఉన్నదనీ, ప్రజలు వాటిని ప్రోత్సహించాలనీ అన్నారు.

నెల్లూరు సహకార స్పిన్నింగ్ మిల్లు అధ్యక్షుడు, శ్రీ ఎన్. గోపాలకృష్ణయ్య ప్రసంగిస్తూ, మనదేశ సాంఘికార్థిక వ్యవస్థలో చేతి పరిశ్రమలు ప్రముఖపాత్ర వహించాయనీ, సాధ్యమైనన్ని విధాల వాటిని పరిరక్షిస్తూ ప్రోత్సహించాలనీ అన్నారు.

## తంతితపాలా వారోత్సవం

నవంబరు 12 నుండి 20 వ తేదీ వరకు తంతి,తపాలా వారోత్సవాన్ని నిర్వహించారు. ఆ సందర్భంగా జంటనగరాలలోని వివిధ సాంస్కృతిక, విద్యా సంస్థలలో తంతి తపాల సేవలను గూర్చిన చర్చలను, ఫిల్ము ప్రదర్శనలను ప్రత్యేకంగా నిర్వహించారు. తంతి, తపాలా కార్యాలయాలను దర్శించిన ప్రజలకు కార్యాలయమంతా చూపి, వారి విధి నిర్వహణనుగూర్చి వివరించారు.

## గనుల రక్షణ వారోత్సవం

1967 ఆగస్టులో నెల్లూరు మైకాగనుల రక్షణ వారోత్సవ నిర్వహణ సంఘం ఆధ్వర్యాన, గూడూరుకు 15 మైళ్ల దూరాన ఊటుకూరులో మీనాక్షి సుందరం మైకాగనిలో ఐదవ వార్షిక రక్షణ వారోత్సవం జరిగింది. ఈ ఉత్సవం ఆఖరురోజున గనుల రక్షణ డైరెక్టరు జనరల్, శ్రీ జి. ఎస్. జబ్బీ ముఖ్య అతిథిగా వచ్చారు.

## ఘనపురంలో గోసంవర్ధన వారోత్సవం

వరంగల్లు జిల్లా ఘనపురం బ్లాకు హెడ్‌క్వార్టర్సులో గోసంవర్ధన వారోత్సవాన్ని నిర్వహించారు. వారోత్సవం ఆఖరు రోజున "ఉత్తమ పశువుల ద్వారా అధికాహారోత్పత్తి" నినాదానికిగల ప్రాముఖ్యతను గూర్చి బి. డి. ఒ. వివరిస్తూ పశువులను లాభదాయకంగా వినియోగించాలని రైతులకు విజ్ఞప్తి చేశారు.

## నుస్తులాపూర్‌లో పశు ప్రదర్శన

గోవసంవర్ధన వారోత్సవాల సందర్భంగా, కరీంనగర్ జిల్లాలోని నుస్తులాపూర్ గ్రామంలో జిల్లా పశు ప్రదర్శనను ఏర్పాటు చేశారు. ఈ ప్రదర్శనలో 300 కు పైగా ఆవులు, ఆవుదూడలు ప్రదర్శించబడినాయి. బహుమతి పొందిన పశువులకు చెందిన యజమానులకు 17 బహుమతులను యివ్వడం జరిగింది.

## జిల్లాల్లో ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం

గుంటూరులో 11 వ ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాన్ని ఘనంగా నిర్వహించారు.

ఆ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో జిల్లా కలెక్టరు శ్రీ ఎం. వెంకటరత్నం, శాసన సభ్యులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, సినీకళాకారుడు శ్రీ ధూళిపాళ సీతారామశాస్త్రి, పరిషత్తు అధ్యక్షులు, శ్రీ మేదూరి నాగేశ్వరరావు, శాసన సభ్యులు, శ్రీ ఎస్. అంకమ్మ, తదితరులు ప్రసంగించారు.

కరీంనగర్‌లో ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవానికి జిల్లా కలెక్టరు శ్రీ ఎల్. మాలకొండయ్య అధ్యక్షత వహిస్తూ, ప్రాంతీయ తత్వ ప్రచారానికీ, వర్గతత్వానికీ లొంగిపోకుండా జాగ్రత్త వహించాలని ప్రజలను ఉద్బోధించారు. సర్వశ్రీ సి.హెచ్. రాజేశ్వరరావు, ఎం. ఎల్. ఎ; సి. ఆనందరావు, ఖాజీ బషీరుద్దీన్ యీ సందర్భంలో జాతీయ సమైక్యతను గూర్చి ప్రసంగించారు.

హోంగార్డ్సు, ఎన్. సి. సి. కెడెట్లు, బాలభటులు, గరల్ గైడ్లు, వివిధ వర్గాల ప్రతినిధులు సామూహిక విన్యాసాలలో పాల్గొన్నారు.

## ప్రాంతీయ సైన్యం దినోత్సవం

నవంబరు 18 వ తేదీన 125 వ ఇన్ఫెంట్రీ బెటాలియన్ (ప్రాంతీయసైన్యం) వందన విన్యాసం జరపడంద్వారా ప్రాంతీయ సైన్యం 18 వ వార్షికోత్సవాలను జరిపారు. సర్దార్ పటేల్ విగ్రహానికి ఎదురుగా ప్రత్యేకంగా నిర్మించబడిన వేదిక పైనుండి మేయరు, శ్రీ కొండారెడ్డి సైనిక వందనం స్వీకరించారు. మేజరు జయంతి రామయ్య నాయకత్వం నిర్వహించారు. ఇన్ఫెంట్రీ బెటాలియన్ (ప్రాంతీయ సైన్యం) యిప్పుడు శాశ్వతంగా సికింద్రాబాదులో ఉంటుంది. 1959 లో ప్రథమంగా యీ బెటాలియన్ను వరూన్



వందన స్వీకారం చేస్తున్న మేయర్

125 ఇన్ఫేంట్రీ బెటాలియన్

కోటలో ఏర్పాటు చేశారు. 1962 లో చైనాతో జరిగిన సంఘర్షణలో యీ బెటాలియన్ పాల్గొన్నది. 1965 లో పాకిస్తాన్‌తో జరిగిన సంఘర్షణలో కూడా యిది ముఖ్యమైన పాత్ర నిర్వహించింది. జమ్మూ, కాశ్మీరుతో గల మన ముఖ్యమైన కమ్యూనికేషన్స్‌కు ఆధారమైన మధోపూర్ రైల్వే-రోడ్డు వంతెనను సంరక్షించింది.

అనేకమంది పాక్ పారాట్రూపర్లను యీ బెటాలియన్ బంధించి శత్రువులకు చెందిన మందుగుండు సామాగ్రి, ఆయుధాలను స్వాధీనం చేసుకున్నది.

## మ్యూజియంల ఉద్యమం



అక్టోబరు 18 న మ్యూజియంల ఉద్యమానికి ప్రారంభోత్సవం చేస్తున్న ముఖ్యమంత్రి

హైదరాబాదులో సాలార్‌జంగ్ మ్యూజియం, రాష్ట్ర పురావస్తుశాఖ ఆధ్వర్యంలోని రాష్ట్ర వివిధ వస్తు ప్రదర్శనశాలలు కలిపి ఇరవయ్యవ అంతర్జాతీయ మ్యూజియంల ఉద్యమాన్ని జరుపుతున్నాయి. అక్టోబరు 18 న ఉద్యమానికి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. డిసెంబరు 31 వరకు ఈ ఉద్యమం కొనసాగుతుంది. ఈ సందర్భంలో సుప్రసిద్ధుల ప్రసంగాలు, చర్చలు ఏర్పాటు చేయబడ్డాయి. సాలార్‌జంగ్ మ్యూజియంలో ప్రజలకు విద్యా విషయక, చారిత్రక, సాంస్కృతిక విషయాలకు సంబంధించిన సినిమాలు ప్రదర్శించారు. మ్యూజియం కార్యకలాపాలకు సన్నిహిత పరిచయం కలిగించే వుద్దేశంతో సుప్రసిద్ధ సాంఘిక కార్యకర్తలతో, ప్రముఖ విజ్ఞాన వేత్తలతో ఒక మ్యూజియం స్నేహార్థి సంఘాన్ని ఏర్పాటు చేయాలని ఆలోచిస్తున్నారు. బాల బాలికలకు బాల భవన్‌లో రెండు మ్యూజియంల ఆధ్వర్యంలో వ్యాస రచన పోటీ జరిగింది. ఇటీవలి కాలంలో ఈ రెండు మ్యూజియంలు సేకరించిన కళా ఖండాల ప్రదర్శనకు రాష్ట్ర జనసంబంధ శాఖా మంత్రి నవంబరు 4 న ప్రారంభోత్సవం చేశారు.



ఇటీవల సేకరించిన కళాఖండాల ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేస్తున్న జనసంబంధ శాఖ మంత్రి

ఈ ఉత్సవం కన్నుల పండువుగా జరగడమేగాక ప్రస్తుత కాలంలోని తీరికలేని జీవన సరళిలో మనోల్లాసానికి, విజ్ఞాన పరిధి విస్తరణకూ మ్యూజియంలు విశేషంగా తోడ్పడతాయి అని తెలియజెప్పే విధంగా యీ కార్యక్రమాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఇవి వెనకటి తరాలవారు సాధించిన అపూర్వ విషయాలను మనకు బహిర్గతం చేస్తాయి. మనిషిలోని సృజనాత్మక శక్తి మీద కాంతిని కుమ్మరిస్తాయి.



# ఆదర్శఘట్టాలు

## అభివృద్ధి పన్ను చెల్లింపుకు స్వచ్ఛందంగా ముందుకు వచ్చిన రైతులు

భద్రాచలం తాలూకాలోని చర్లపల్లి గ్రామరైతులు తిలిపేరు వాగుమీద బారేజి నిర్మించడానికై ఎకరానికి రూ. 100 చొప్పున అభివృద్ధి పన్నును స్వచ్ఛందంగా తమంతట తామే చెల్లించ దలచుకున్నారు. ఈ వాగు భద్రాచలం, వెంకటాపురం రోడ్డుమీద వున్నది. ఈ బారేజి నిర్మాణం పూర్తయ్యాక 10,000 ఎకరాలకు సేద్యపునీరు లభిస్తుంది.

## కర్తవ్య దీక్ష

హైదరాబాద్‌లోని సెంట్రల్ టెలిగ్రాఫ్ కార్యాలయానికి చెందిన శ్రీ ఎ. ఎ. ఆండర్‌సన్ తన విధి నిర్వహణలో చూపించిన శ్రద్ధ, కర్తవ్యదీక్షవల్ల రాజమండ్రి సెంట్రల్ జైలులో కొద్ది గంటల్లో ఉరితీయబడనున్న ఒకస్త్రీ ప్రాణం కాపాడబడింది. గత జూన్‌నెలలో 17వ తేదీ అర్ధరాత్రి శ్రీ ఆండర్‌సన్ రాష్ట్రపతి వద్దనుంచి ఒక టెలిగ్రాము ను అందుకున్నారు. మరణ శిక్ష విధించబడిన ఒక నేరస్తురాలు శిక్షను జీవితాంతపు ఖైదుశిక్షకు తగ్గిస్తూ రాష్ట్ర హోంశాఖ సంయుక్త కార్యదర్శిని ఉద్దేశిస్తూ భారత రాష్ట్రపతి పంపిన టెలిగ్రాం అది. ఆ నేరస్తురాలును మర్నాటి తెల్లవారుఝామున రాజమండ్రిలో ఉరితీయవలసి వుంది. టెలిగ్రాఫిస్టు ఆండర్‌సన్ వెంటనే హోం శాఖ సంయుక్త కార్యదర్శికి ఫోను చేశారు గాని ఆ సంయుక్త కార్యదర్శి బదలీ కావడంవల్ల అతనికి ఏ విధమైన సమాధానం రాలేదు. అయితే ఆండర్‌సన్‌కు ఒక ఆలోచన వచ్చింది. ఈ విషయం ప్రధాన కార్యదర్శికి తెలియజేస్తే ఒకప్రాణం రక్షింపబడుతుందని అతనికి తట్టింది. వెంటనే అతను ప్రధానకార్యదర్శికి ఫోనుచేసి చెప్పారు. ఉరితీయబడనున్న నేరస్తురాలి ప్రాణం రక్షింపబడింది.

ఆ టెలిగ్రాఫిస్టు సమయోచిత చర్యకు, విధి నిర్వహణకు మెచ్చి ప్రధాన కార్యదర్శి ఆ టెలిగ్రాఫిస్టు ఆండర్‌సన్‌ను అభినందిస్తూ మర్నాడే ఒకలేఖ వ్రాశారు. అతని విధి నిర్వహణకుమెచ్చి తంతి, తపాలాశాఖ రూ. 20 లను శ్రీ ఆండర్‌సన్‌కు బహూకరించింది.

## భారతదేశానికి సింహళం బహూకరించిన నేత్రాలు

కొత్త ఢిల్లీలోని జాతీయ నేత్రనిధికి సింహళ గవర్నరు జనరల్ శ్రీ విలియం గోపల్లవ సింహళ ప్రజల తరపున అక్టోబరు 25న రెండు కళ్ళను సౌహార్ద్ర బహుమతిగా దానం చేశారు. సూరదాస్ అనే గ్రుడ్డివానికి ఈ కళ్ళను అమర్చుచారు. సింహళం నూటయాభై కళ్ళను పద్నాలుగు దేశాలకు బహూకరించింది. గత మూడేళ్ళుగా సింహళనుంచి భారతదేశం అయిదువందల కళ్ళను బహుమతిగా పొందింది. మరణానంతరం తమకళ్ళను బహూకరించడానికి వాగ్దానం చేసినవారి సంఖ్య సింహళంలో 2,50,000 దాటింది.

## మంత్రుల కళ్ళదానం

కేంద్ర ఆరోగ్యశాఖ స్టేట్ మంత్రి డా. ఎస్. చంద్రశేఖర్, రాష్ట్ర ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు తమ కళ్ళను సరోజినీదేవి కంటి ఆసుపత్రిలోని నేత్రనిధికి దానం చేస్తున్నట్టు అక్టోబరు 19న నేత్రనిధి కమిటీ వారికోత్సవ సమయంలో ప్రకటించారు. వైద్య, ఆరోగ్యశాఖ డైరెక్టరు శ్రీ డి. భూషణ్‌రావు, నగరపరిరక్షకుడు శ్రీ జి. పుల్లారెడ్డి, ఆయన సతీమణి కూడా తమ కన్నులను నేత్రనిధికి దానంచేసినట్టు ప్రకటించారు.

## రాష్ట్రంలో గ్రంథాలయోద్యమం

దేశంలోని వ్యవసాయ విశ్వవిద్యాలయాలకు అనుబంధంగా వున్న గ్రంథాలయాల పని తీరునుగూర్చి పరిశీలించే నిమిత్తం వ్యవసాయపరిశోధక భారతీయ మండలి ఏర్పాటుచేసిన ఇండో-అమెరికన్ పరిశీలక బృందం ఆంధ్రప్రదేశ్‌లో ఆధునిక పద్ధతుల్లో జరుగుతున్న గ్రంథాలయాభివృద్ధిని శ్లాఘించింది. న్యూయార్క్‌లోని రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ అసోసియేట్ డైరెక్టర్ డా. డరోతీ పార్కర్ ఈ బృందానికి నాయకత్వం వహించారు. ఇక్కడి లైబ్రేరియన్‌లతో జరిపిన చర్చల్లో యునెస్కో-నిపుణుడూ, కొత్త ఢిల్లీలోని గ్రంథాలయాల డైరెక్టరూ అయిన శ్రీ డి. ఆర్. కాలియా ఈ విషయాన్ని తెలియజేస్తూ గ్రంథాలయోద్యమంలో ఆంధ్రప్రదేశ్ యితర రాష్ట్రాలకు ఆదర్శప్రాయంగావున్నదని పేర్కొన్నారు.



# గ్రంథ సమీక్ష

బిగుసుకున్న పారతంత్ర్య కవాటాలు
పగిలి బద్దలై పడిపోయేదెప్పుడో?
చెరలో మాగి మాగి చివికి పోయిన మావులు
చిగుళ్లువేసే వసంత వా రాదెప్పుడో?
ముచ్చటైన పచ్చని బయళ్ళలో
పిచ్చుల విడిగా తిరిగేదెప్పుడో?

యావద్భారత జాతి స్వేచ్ఛావిహారం కోసం ఉవ్విళ్ళూరుతున్న రోజులవి. ఇనుప కటకటాలను సంకల్ప బలంతో త్రెంచుకుని బైటపడి స్వేచ్ఛా వాయువులు పీల్చాలని తపన పడుతున్న రోజులు. ఈ భారతీయ స్వాతంత్ర్యేచ్ఛా సంగీతంతో శ్రుతి కల్పుతూ కవి నారాయణరెడ్డి పండిత జవహర్‌లాల్ అలీపూర్ జైలులో మ్రగ్గుతున్న రోజుల్లో ఆయన మనోగత భావాలను వర్ణించిన తీరుయిది. కావ్యం "జాతిరత్నం", ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీవారు; వెల, సాదా ప్రతి నాలుగు రూపాయలు.

శ్రీ నారాయణరెడ్డి కవితలో ఒక ముఖ్యమైన విశేషము దాని అభ్యుదయ శీలము. ఈ నాడు తెనుగు సీమను సస్యశ్యామలం చేసి, తెనుగు వారి జీవితాలను యితోధిక శోభాయమానం చేయడానికి సిద్ధంగా వున్న నాగార్జునసాగరం పది పన్నెండేండ్ల క్రితమే ఆయనకు కథావస్తువైంది. "నాగార్జునసాగరం" కావ్యంలో పూర్వ చరిత్ర, ప్రేమ కథా వస్తువులలో చేరి వున్నప్పటికీ కథ జరిగిన ప్రదేశము నాగార్జునసాగర ప్రదేశమైనందువల్ల ఆంధ్రుల దృష్టిని ఆ కావ్యము ఆకర్షించినది. అదే విధంగా "ఋతుచక్రము" లో తెలుగువారి జీవితము సూక్ష్మముగా వర్ణించబడినది. ఆయన యిటీవలి కావ్యము యీ "జాతిరత్నము", స్వర్గీయ పండిత నెహ్రూ జీవితగాథ. జవహర్ శబ్దమునకు రత్నమనే అర్థమున్నందున జాతిరత్నము అనే పేరు యీ కావ్యానికి సార్థకమైనది.

పద్యమును పూర్తిగా వదలి మాత్రాచ్ఛందోబద్ధమైన గేయ కావ్య మార్గమును చేపట్టి పట్టుదలతో నిర్వహిస్తున్న కవుల్లో నారాయణరెడ్డిగారు అగ్రేసరులు. సహజ సిద్ధమైన మార్పును అంగీకరించే స్వభావము కలవారగుటచే, మాత్రాచ్ఛందోనంతర పరిణామమైన వచన కవితనుగూడా వారు నిరాదరించలేదు. ప్రస్తుత కావ్యములో దాదాపు సగభాగము ఆ పద్ధతిలో వ్రాయబడినది. ఈ విధముగా మిశ్రకావ్య నిర్మాణము చేయుటవలన కేవల మాత్రాచ్ఛందస్సులనే ఆద్యంతము నడిపినందువల్ల కలిగే విసుపు పరిహరింపబడి, రచనా వైవిధ్యము వలన కావ్యమునకు ఒక నిండుదనము వచ్చినది. మాత్రాచ్ఛందోమార్గము నుండి వారి మనసు వచన కవితవైపు ఆకర్షింపబడుతున్నదనుటకు యీ కావ్యమే నిదర్శనము.

సత్యాగ్రహ చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించదగిన మహాత్ముని దండి యాత్రను వర్ణించు సందర్భము సాగిన రచన చక్కగా పాడుకొనుటకు కూడా యోగ్యమైన గేయ లక్షణము కలిగి ఎంతో ఉత్తేజకరంగా నడిచింది.

"సాగెను మహామాంత్రికుండు
వెన్నంటి
సాగె సత్యాగ్రహుల దండు
పుడమి నిలువున పులకరింపగా
కడలి రమ్మని కబురు పంపగా
స్వాతంత్ర్య కేతనమ్మాడగా
సామ్రాజ్య భూతమల్లాడగా
సాగెను మహా యాత్రికుండు
అంత చెల
రేగినది "శ్రీరామదండు"
మనతల్లి కన్నీళ్లు తుడువగా
మహనీయుడే ముందునడువగా
గట్టుమీదనె నిలిచినారా,
కదలండి ఓ అన్నలారా!"

ఈ కావ్యంలో నవమ ఖండమంతా వచన కవితలో నడిపారు కవి గారు. దీనిలో నెహ్రూ జీవితానుభవాలు కూలంకషంగా వర్ణించబడినవి. కేవల వర్ణనకే కాక కథాకథనానికి కూడా వచన కవిత యోగ్యమైనదేనని యీ ఖండికలో ఋజువైనది. నెహ్రూ పొందిన విచిత్రానుభూతులలో "జలదరింపు కలిగించేవి కొన్ని, మొలక నవ్వు మొలిపించేవి కొన్ని, కురిసిన విషాద మేఘాల వెనుక హరివిల్లు విరియించేవి కొన్ని". ఉద్వేగం పడగవిప్పుతున్న ఖైదీల మధ్య, విద్వేషం బుసకొడుతున్న 'కేడీ'ల మధ్య నివసిస్తున్న ఆ సత్యాగ్రహ తపస్వి సహనానికి నికషోపలంగా వున్నాడని వర్ణించడం హృదయంగమంగా వుంది. దేరాడూన్‌లో ప్రవాసం గడుపుతున్న సమయాన చేసిన ఋతువర్ణనలోని వ్యంగ్య వైభవం గమనించదగినది.

"చెంసాలలో శిరపెత్తిన రావిచెట్లు
శిశిర రాక్షసిని ఎదిరించి నిలిచేవి
విషవాత శరాఘాతాలు సైచి
వసంతుణ్ణి ఎలుగెత్తి పిలిచేవి
దమననీతి సాగదని తెలుసుకుని
దారిపట్టేది విషమ శిశిరం
కొనవ్రేళ్ళతో విషణ్ణ తరువులను
స్పృశించేది వసంత సమీరం"

ఇందులోని శిశిర రాక్షసి ఎవరో వసంత సమీరమెవరో రావిచెట్టు ఎవరో వ్యాఖ్యానించి చెప్పడం అనవసరం గదా

ఈ కావ్యంలో చాలా ఘట్టాలలో కథనం క్లిష్టంగా నడపడం వల్ల పాఠకునకు ఆశాభంగం కలుగుతుంది. ముఖ్యంగా కమలా నెహ్రూ మరణ సందర్భం "కిట్టె, కొట్టె, తెచ్చె" నన్నట్లుంది.

మన పురాణ కథలు "శుకుండు పరీక్షన్నరేంద్రునకు" "వైశంపాయనుండు జనమేజయునకు" ఒకరు మరొకరికి చెప్పినట్లుగా కూర్చబడినవి ఆసంప్రదాయాన్ని అనుసరించి నారాయణరెడ్డి గారు తమకు యీ కథను ఒక గులాబీ పూవు చెప్పినట్లు కల్పించడం ఉచితంగా వుంది.

---

ప్రసిద్ధ భారతీయ కథలు—రామాయణ, భారత కథలను తత్సమకాలీనులైన మహర్షులు గ్రంథస్థముచేశారు సమకాలీన సంఘటనలకు కావ్యత్వము కల్పించు ప్రయత్నము రానురాను మృగ్యమై పూర్వకథలే కావ్యములందు చోటుచేసుకున్నవి ఆధునిక కాలములో సమకాలీన సాంఘిక చైతన్యము కావ్యములలో ప్రతిఫలించవలెననే సిద్ధాంతము మరల బైలుదేరిన కారణంగా, కేవలము సమకాలీనములు కాకపోయినను, యిటీవలి చరిత్రలోని కథాభాగములకు కావ్యగౌరవము చేకూరినది అటువంటి గొప్ప కావ్యములలో గడియారం వెంకటశేషశాస్త్రిగారి శివభారతము, దుర్భాక రాజశేఖర శతావధానిగారి రాణాప్రతాప్, విశ్వనాథవారి ఝాన్సీలక్ష్మిబాయి మొదలగునవి పేర్కొనదగినవి ఆ కోవకు చెందిన వీర కావ్యమే శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు రచించిన భారత స్వాతంత్ర్య సంగ్రామము (వెల 3 రూ. ప్రతులకు ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్‌బజార్ హైద్రాబాద్) ఇది "సిపాయిపితూరీ" అని పిలువబడిన 1857నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర. నానా సాహెబు, ఝాన్సీలక్ష్మీబాయి వంటి త్యాగమూర్తులను, విప్లవకారులను సృష్టించిన స్వాతంత్ర్య సమరము. బ్రిటిష్ సామ్రాజ్యవాదమును మొట్ట మొదటిసారిగా గడగడలాడించిన చరిత్రాత్మక సంఘటన.

వీరభద్రమూర్తిగారు పద్యరచనలో సిద్ధహస్తులు. బహుగ్రంథకర్తలు. వీరి కామాక్షీ పంచశతి లోని పద్యములు వీరే స్వయముగా చదువునప్పుడు వినితీరవలయును. సువర్ణధార, మహామరకతము, వేణుగోపాల శతకము, మల్లికార్జున పండిత విజయము మొదలగు ననేకకావ్యములు వీరిలేఖిని నుండి వెలువడినవి. స్వర్గీయ టంగుటూరి ప్రకాశం పంతులుగారి స్వీయ చరిత్రను వీరభద్రమూర్తిగారు పద్యకావ్యముగా తీర్చిదిద్దినారు వీరభద్రమూర్తిగారు శైవమత సంప్రదాయమునకు చెందినవారు సంస్కృతాంధ్రభాషలయందునూ. తర్కసాహిత్యకవితా సంప్రదాయములందునూ అధికారము కలిగినవారు.

ఈ కావ్యము "ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్" అనులక్షణములో మూడవ దానిననుసరించి

"తెమ్మెపూదోట సిరులపై దొమ్మసేతి
రత్నగర్భకు తెల్ల వస్త్రంపు ముసుగు
రాజహంసల మ్మురెల మెత్తరాని యటుల
మంచు భరితఖండమ్మును ముంచివైచె"

నని భారతదేశముపై శ్వేతజాతీయుల పెత్తనమును వ్యంగ్యవైభముతో స్ఫురింపజేయుచూ ప్రారంభమైనది. ఆ విధంగా మంచు ఆక్రమించిన సందర్భంలో స్వాతంత్ర్యముపోయినదని దేశీయులే కాక ప్రకృతిమాతకూడ దుఃఖాక్రాంతయైనదని చెప్పుటకు "ఆక్రులం బిట్టువెలార్చెనో తుహిన బిందువులన్ గిరిసెన్‌లతల్ తరుల్" అని రెండవ పద్యములో ఉత్ప్రేక్షించినారు. వీరభద్రమూర్తిగారు పద్యరచనలో ప్రధానముగా రసవాదులు ఒక్కొక్కచో పద్యము కుంటుపడిననూ లెక్కచేయక రసోన్ముఖమైన ప్రయాణము సాగించు నుత్సాహము కలవారు, ఆరంభములోనే చారులు బుడబుక్కలవారుగా గంగిరెద్దును ఆడించే దృశ్యంలో "ఎంతయున్నది ధర్మమిప్పుడు బసవన్న? నడిమికి నొకకాలు మడచిచూపె"—అసలే కలిలో ధర్మదేవత ఒంటికాలుతో నడుస్తుంది. అందు తెల్లదొరల పరిపాలనలో సగం కాలుతోనే నడుస్తుంది. ఈ విధమైన రమణీయార్థభరితములైన పద్యాలు యీ కావ్యంలో ఎన్నయినా చూపవచ్చు. పదునెనిమిది రోజులుమాత్రమే జరిగిన భారతయుద్ధము మహాకావ్యముగా తీర్చిదిద్దబడినట్లు, ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామమును ఒక మహాకావ్యముగా రూపొందించినారు కవిగారు. అరువది ఏండ్ల స్వాతంత్ర్య సంగ్రామము, తత్ఫలసిద్ధియగు స్వరాజ్య సాధనముకూడా యిట్టి మహాకావ్య నిర్మాణమునకు తగిన కథావస్తువులే.

—"చైతన్య"

---

# స్వీకారం

**మానవుడే మా సందేశం**
(26 మంది కవుల సంకలనం)
సంకలనం : జలజశ్రీ
ప్రచురణ : చైతన్య సంస్కృతి, జడచర్ల
93 పేజీలు వెల 2 రూ. లు

**చేతనా వర్తం**
సంపాదకుడు : సుప్రసన్న
ప్రచురణ : సాహితీ బంధు బృందం
వరంగల్లు
96 పేజీలు వెల 2 రూ. లు.

# గృహిణి

పిలకా గణపతిశాస్త్రి

మొట్టమొదటి నుంచి ఆశించినట్టే కృష్ణమూర్తికి పార్థసారథి ఉంటున్న పట్టణంలో హైస్కూలులోనే ఉద్యోగం దొరికేటట్టు కనబడింది. కాని అతడనుకున్నంత త్వరగా ఆర్డరు చేతికందలేదు. అదిగో, ఇదిగో అని ఆ వ్యవహారం జూలై నెలాఖరుదాకా జరిగింది. చిట్ట చివరి క్షణందాకా ఉద్యోగం దొరుకుతుందా? దొరకదా? అని అదేపనిగా ఆందోళన పడడంవల్ల ఆ శుభవార్త తెలియగానే అతడు పట్టరాని సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయినాడు! కాని ఆ తరవాత అయిదారు రోజులదాకా ఆర్డరు చేతికందలేదు! కృష్ణమూర్తి ఆ ఉత్తర్వు ఏడెనిమిదిసార్లు చదువుకున్నాడు! అప్పటికయినా తనజీవితానికొక దారిదొరికిందికదా – అని సుదీర్ఘ నిశ్వాసం విడిచిపెట్టాడు.

వెంటనే ఒక ఉత్తరం ద్వారా ఆ సంగతి పార్థసారథికి తెలియజేసి, ఆ పట్టణంలో ఒక చిన్న ఇల్లు ఏదయినా కుదిర్చిపెట్ట వలసిందని అర్థించాడు. భార్య సావిత్రితో కలిసి త్వరలోనే అక్కడ మకాం పెట్టబోతున్నట్టు దానిలో వెల్లడించాడు. తిరుగుటపాలోనే పార్థసారథి అతనిని అభినందించి, భార్యతో కలిసి మున్ముందుగా తమఇంటికే రావలిసిందని ఆహ్వానించి రెండు మూడు రోజులలోనే ఇల్లు ఒకటి కుదుర్చబోతున్నట్టు తెలియజేశాడు.

కృష్ణమూర్తీ, అతనిభార్యనూ విజయలక్ష్మి పార్థసారథు లిద్దరు కాదు కూడదని బలవంతం పెట్టడంవల్ల ఏడెనిమిది



## జరిగిన కథ

పార్థసారధికి నాటకాలపిచ్చి. రాఘవ నాట్యకళామండలి ద్వారా నాటకాలు వేస్తుండేవాడు. సరోజ అనే అమ్మాయి వాళ్ళ నాటకాల్లో హీరోయిన్‌గా వేస్తుండేది. నాటకాల పిచ్చిలోపడి పార్థసారథి సరిగా యింటిపట్టున ఉండేవాడుకాదు. అతని భార్య విజయలక్ష్మికి అది చాలా బాధగా వుండేది. ఆమె బావ కృష్ణమూర్తి పెళ్ళికివెళ్ళి, బంధువులంతా నాలుగు రోజులు వుండమన్నా వుండకుండా తిరిగి వచ్చేసింది ఆమె.

---

రోజుల పాటు వాళ్ళ ఇంట్లోనే ఉండిపోయారు. ఆపైన పార్థసారథి కుదిర్చిన అద్దె ఇంటికి తమ మకాం మార్చుకున్నారు. అది అతని మేడ వెనక వీధిలోనే ఉంది. అద్దె అంత ఎక్కువ కాదు. అన్నీ కలిపి పాతిక రూపాయలే! చిన్న పెరడు మంచినీళ్ళ బావికూడ ఉన్నాయి. గదులు మూడే అయినా బాగా విశాలమయినవే. అటక, అలమారలు మొదలయిన హంగులన్నీ గమనించి, ఆ ఇల్లు తమకన్నివిధాల సమ్మగా ఉన్నదని భార్యాభర్తలిద్దరు సంతృప్తి పడ్డారు.

తనచేతి కందే నూట పాతిక రూపాయల జీతంలోను, పాతిక రూపాయలు అద్దెకింద ఖర్చయినా మిగిలిన సొమ్ముతో హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చునని కృష్ణమూర్తి కనిపించింది. కొన్నాళ్ళు గడిచిన తరవాత రెండు మూడు ట్యూషన్లు కుదుర్చుకుంటే ఇంటికి కూడా కొంత డబ్బు పంపించవచ్చునని ఆశించాడు. పెళ్ళికి వచ్చినప్పుడు విజయలక్ష్మి సావిత్రి ఇంట్లో అడుగు పెట్టిన వేళా విశేషం చాలా మంచిదని అభినందించింది. అది అక్షరాల నిజమయినదని కృష్ణమూర్తి మాటిమాటికి మురిసిపోయాడు! వివాహమయిన కొన్ని నెలలలోనే చక్కని ఉద్యోగం దొరికింది. ఆపైన కొంత తక్కువ అద్దెలోనే అన్ని హంగులు అమర్చినట్టున్న ఇల్లుకూడా కుదిరింది. ఒక ఉద్యోగ పరిస్థితులు కూడా అనుకూలంగానే ఉన్నాయి. తన కంతకన్న కావలసినదేమి లేదని కృష్ణమూర్తి ఎంతో సంతోషించాడు.

విజయలక్ష్మి కూడా అతని కొత్త సంసారానికి అనేకవిధాల సాయపడింది. తన వంట సాలవఉన్న ఊరగాయలు, అప్పడాలు, ఒడియాలు మొదలయినవి కొన్ని సావిత్రికిచ్చింది. ఇంకా పనిముట్టు వస్తువులేవయినా అవసరమయితే మొహమాట పడకుండా అడిగి తీసుకుని వెళ్ళ వలసినదని బలవంత పెట్టింది. ఒక్కొక్కప్పుడు సావిత్రి అడగక పోయినా తానే కావలసిన నిత్యావసర వస్తువులందించి తీసుకువెళ్ళ వలసిందని ప్రోత్సహించింది. అప్పుడప్పుడా అమ్మాయిని తన ఇంటికి తీసుకువెళ్ళి ముచ్చటగా పువ్వులు ముడిచి వాలుజడ అల్లింది. సినిమాలకి, నాటకాలకి, పేరంటాలకి స్వయంగావచ్చి వెంటబెట్టుకు వెళ్ళింది.

అలాగలాగ మరికొన్నాళ్ళు గడిచిన తరువాత భార్యాభర్త లిద్దరిని భోజనానికి పిలిచి ఆత్మీయమయిన అభిమానంతో ఆదరించింది. ఒక సారి భోజనాలయిన తరువాత సావిత్రికొక జరీఅంచు కంచిచీర, పట్టు జాకెట్టు బహూకరించింది ఆమె. అపూర్వాదరణ కృష్ణమూర్తి కెంతో ఆశ్చర్యం కలిగించింది. సావిత్రి అంతకన్న విస్తుపోయింది! కాస్త కలిగిఉన్నవాళ్ళు లేమితో బాధలనుభవిస్తున్న బంధువులంటే చిరాకుపడ ఈసడిచుకుంటారని కృష్ణమూర్తి అనుకున్నాడు కాని పార్థసారథిలోగాని, విజయలక్ష్మిలోగాని అటువంటి మిడిసిపాటు చూచాయగానయినా స్ఫురించలేదు. అందులోను విజయలక్ష్మికి తన యడల, భార్య యెడల ఏర్పడిన అభిమాన దృష్టి అతనినెంతో కదిలించివేసింది.

ఒకసారి ఆమె కృష్ణమూర్తి, చేతుల దగ్గిర చిరిగినకోటు వేసుకుని స్కూలుకి వెడుతూంటే చూసింది. సావిత్రి కూడా అప్పుడప్పుడు మాసిన చీరలతోనే కాలక్షేపం చేస్తున్నట్టు కనిపెట్టింది. ఒకసారి వాళ్ళయింటికి వెళ్ళినప్పుడు ఏవో మాటల సందర్భంలో చల్లగా కృష్ణమూర్తిని అడిగింది.

'బావా! నేనొకమాట అడుగుతానుగాని ఏమి అనుకోకేం? వచ్చేజీతం తిన్నగా సరిపోతుందా? లేకపోతే ఏమైనా ఇబ్బందులు పడుతున్నారా?'

కృష్ణమూర్తి ఆ ప్రశ్న కేవిధంగాను సమాధానం చెప్పలేదు గాని సావిత్రి తల వంచుకుని సన్నగా నవ్వింది.

'ఆ' సరిపోకేం? మహా బాగా సరిపోతుంది! ఇంతకీ మాకు ఖర్చులేమి ఉన్నాయి? ఊరగాయల దగ్గిరనించి అన్నీ మీ ఇంట్లోనించే పట్టుకు వెడుతున్నాముగా!'

కాని విజయలక్ష్మి కంతగా సంతృప్తి కలగలేదు! తిరిగి కృష్ణమూర్తి ముఖంమీద దృష్టినిలిపింది. దానిమీద అతడు మొలకెత్తుతున్న చిరునవ్వుతో యాథాలాథంగా అన్నాడు.

'ఏదో ఇబ్బంది లేకుండా బండి నడిచిపోతూందిలే! నీదయవల్ల ఇంతవరకు ఎక్కడా అప్పు చెయ్యవలసిన అవసరం కలగలేదు! ఇంతకీ జీతం అంతా పట్టుకవచ్చి మా ఆవిడ చేతుల్లోనే పోస్తున్నాను! సరిపోతున్నదీ లేనిదీ ఆవిడగారికే తెలియాలిమరి!'

సావిత్రి భర్త కేసి చూసి కొంచెం కొంటెగా నవ్వింది.

'సరిపోకేం? బాగానే సరిపోతూంది అక్కయ్యా! ఈ నెల ఆయన రిస్టు వాచీ కూడా కొనుక్కోవాలని అనుకుంటున్నారు.'

విజయలక్ష్మి బాగా ఆశ్చర్యపడింది. 'నిజమేనా? బావా? నాతో చెప్పావు కాదే! మీ అత్తవారిచ్చిన వాచు మతిలా ఉందే! అవునా?'

సావిత్రి ముఖం వేరొకవైపు తిప్పివేసుకుని కిలకిల నవ్వడం మొదలు పెట్టింది. కృష్ణమూర్తి భార్యావైపు బెదిరిస్తున్నట్టు చూస్తూ అందుకున్నాడు.

'ఆఁ! అంతా ఉత్తది! రిస్టులేదు! వాచీలేదు, సావిత్రి వేళాకోళానికని అలాగ కల్పించింది. అంతే! మా ఆవిడ సంగతి నీకింకా పూర్తిగా తెలియలేదు! మహా కొంటెది!'

విజయలక్ష్మి ఆ దంపతుల అన్యోన్యత గమనించి ఎంతయినా ముచ్చటపడింది. రవంతసేపు మాట్లాడకూరుకుని కృష్ణమూర్తి కె.తో ఆప్యాయతతో నచ్చజెప్పింది 'బావా నీ కప్పుడైనా సొమ్ము అవసరమయితే అనవసరంగా ఇబ్బంది పడకు. కాస్త సావిత్రిచేత కబురు పంపిస్తే కొద్దో గొప్పో ఇవ్వగలను. ఆ తరవాత జీతం వచ్చిన తరవాత సర్దుబాటు చేసుకుందువుగాని! ఇంత మాత్రానికే మొహమాట పడడం ఎందుకు? నేనున్నా పరాయిదాన్నా ఏమన్నానా? మా ఆయన పొలాలమీద వచ్చిన సొమ్ము కొంత నా చేతికే ఇస్తుంటారు. ఎన్ని ఖర్చులు చేసినా నాదగ్గర ఏదో బాపతు మిగులుతూనే ఉంటుందిలే.'

కృష్ణమూర్తి అది వినీవిననట్టు మాట్లాడకూరుకున్నాడు. అదే క్షణంలో సావిత్రి అతనివైపు చూసి లిపిగా నవ్వింది.

'అక్కయ్యా! సొమ్ముమాత్రం ఆయన చేతికివ్వకు? డబ్బు కంటపడితే ఇట్టే ఖర్చుచేసేస్తారు! తెలిసిందా? అంతగా అవసరమయితే నేనువచ్చి అడిగి తీసుకుంటానులే.'

విజయలక్ష్మి, ఆమె అది అంతా కల్పించినదని గ్రహించింది. ఆ కొంటెతనం ఏసికట్టింది.

'ఆ! నీచేతి కెందుకిస్తాను! అడిగినా అడక్కపోయినా మా బావకే ఇస్తానులే!'

ఆ ఛలోక్తితో భార్యాభర్తలిద్దరు కులాసాగా నవ్వుకున్నారు. ఆ తరవాత విజయలక్ష్మి లేచి నిలబడి 'పిల్లలిద్దరూ నాకోసం మారాంచేస్తున్నారేమో! మరి నేను వెడతాను!' అని వారిద్దరితోనూ చెప్పి ఇంటికి వెళ్ళిపోయింది.

అప్పటి కించుమించుగా సాయంకాలం కావచ్చింది. పిల్లలిద్దరు అంతకు మునుపే ఆమెకోసం రాగాలు మొదలు పెట్టినా వర్ధనమ్మ ఓదార్పుతో ఏడుపులుమాని తిరిగి ఆడుకుంటున్నారు. తల్లిని చూడగానే ఇద్దరు ఒక్కసారిగా ఎదురువచ్చి కాళ్లకడ్డు పడ్డారు. విజయలక్ష్మి ఆ పసిపిల్లలిద్దరిని దగ్గరికి తీసుకుని పక్కనే కూర్చోబెట్టుకుని మాటిమాటికి వీధి వైపు చూడడం మొదలు పెట్టింది. వర్ధనమ్మ అది కనిపెట్టింది. తటపటాయిస్తూ అడిగింది.

'ఈ వేళకింక అతను వస్తాడో రాడో ఏమి వండమన్నావే?'

'వస్తే సాయంత్రానికి వస్తామన్నారు. ఏదో నీకు తోచినది వండు!'

వర్ధనమ్మ లేచి నెమ్మదిగా వంట ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఆనాడు పార్థసారథి తెల్లవారగట్ల నాలుగు గంటలకే బయలుదేరి నాటకం ఏర్పాట్లు ఎలాగ జరుగుతున్నాయో చూడడం కోసమని ఏలూరు వెళ్లాడు. చీకటి పడకుండానే తప్పకుండా తిరిగి ఇంటికి వచ్చివేస్తానని చెప్పాడు. కాని రాలేదు. విజయలక్ష్మి మాటిమాటికి వీధి గుమ్మంలోకి వెళ్లి నిలబడి భర్త రాకకోసం ఎదురు తెన్నులు చూసింది. కాని అతడెంతసేపటికి రాలేదు!

అప్పుడే తొమ్మిది గంటలు కావచ్చింది అయినా పార్థసారథి తిరిగిరాలేదు! అమ్మమ్మ అంతకు మునుపే పిల్లలిద్దరికి అన్నాలు పెట్టి పడుకోబెట్టింది. గడియారం పది గంటలు కొట్టిన తరవాత విజయలక్ష్మి, భర్త మరి రారని నిరాశ చేసుకుని వర్ధనమ్మ బలవంతంమీద నాలుగు మెతుకులు నోట పెట్టుకుంది. ఆ తరవాత కూడ ఆమె మనస్సులో పార్థసారథి రావచ్చునన్న ఆశ మొలకెత్తక పోలేదు; అయితే అర్ధరాత్రి దాటిన తరవాత మరి రారని నిరాశ చేసుకుని ఉసూరుమని నిట్టూర్చి పందిరి పట్టెమంచంమీద మేనువాల్చింది.

పైపైకి కొంత ఇష్టం ఉన్నట్టు నటిస్తున్నా భర్త అంతర్యంలో తన ఎడల ఏర్పడిన విసుగు, చిరాకు, ఉపేక్ష తలచుకున్న కొద్ది క్రమక్రమంగా ఆమె గుండెలో విపరీతమైన వ్యథ చెలరేగింది. పార్థసారథి ఎక్కడికి వెళ్ళినా ఎప్పటికి తిరిగివచ్చినా, ఏమిచేసినా ఇటీవల విజయలక్ష్మి నోరు కదిపి ఇదేమని ప్రశ్నించలేదు. అసలామె ఆ గొడవే పట్టించుకోలేదు! అంతకు మునుపు కొంతకాలం బాగా గొడవ పెట్టింది. కాని క్రమక్రమంగా దానివల్ల వట్టి కంఠశోష తప్ప మరి రవంత అయినా ప్రయోజనంలేదని గ్రహించుకుని మాట్లాడకూరుకుంది. అంతేకాదు సర్వదా భర్తతో సన్నని చిరునవ్వుతోనే ప్రసంగించింది. ఇంటికి సంబంధించిన చిన్నచిన్న వ్యవహారాలను తానే స్వయంగా సంభాళించుకుంది. చిట్ట చివరకి అవసరమైనప్పుడు డాక్టరు దగ్గరికి వెళ్ళి మందులు మాకులు తానే తీసుకువచ్చింది.

ఆ ప్రసన్న పద్ధతివల్ల పార్థసారథి ప్రవర్తనలో కొంత మార్పు రాకపోలేదు. అతడామెతో ఇనుమడించిన అభిమానంతో మాట్లాడడం మొదలు పెట్టాడు. ఎక్కడికయినా వెడుతున్నప్పుడు త్వరలోనే వస్తానని చెప్పి ఇంచుమించుగా అన్న సమయానికే తిరిగి రావడం ప్రారంభించాడు. ఒకవేళ ఆలస్యమయితే నొచ్చుకున్నాడు. అప్పుడప్పుడు నాటక ప్రదర్శనాల కష్టనిష్ఠూరాలు కూడా ఆమెతో ముచ్చటించాడు. విజయలక్ష్మి అడగకపోయినా సినిమాకి రమ్మని రెండుమూడు సారులు తానే బలవంతపెట్టి పిల్లలతోబాటు వెంటబెట్టుకుని వెళ్ళాడు. ఇంట్లో ఉన్నంతసేపు నవ్వుతూ పేలుతూ కులాసాగానే మాట్లాడాడు. శ్రావణమాసంలో వరలక్ష్మీపూజ తలపెట్టినప్పుడు తనంతట తానే బాగా ఖరీదయిన బనారస్ సిల్కుచీర బహూకరించాడు.

మొట్టమొదట ఆ ఆప్యాయత విజయలక్ష్మి కెంతయినా సంతోషం కలిగించింది. ఆనాటి కానాటికి భర్త బాగా దారికి వస్తున్నారని కూడా సంతోషించింది.

(సశేషం)

# క్రీడారంగం

కర్నల్ సి. కె. నాయుడు కీర్తిశేషులయ్యారు. 'పద్మభూషణ్' సి. కె. నాయుడు ఇక మనమధ్య లేరు. ఒక విఖ్యాత భారతీయ క్రికెట్ క్రీడా యోధుణ్ణి మృత్యువు కబళించింది. ఆయన పూర్వపు హోల్కార్ జట్టును— ఇంచు మించుగా మొదటినుంచీ— పటిష్ఠం చేయడమే గాకుండా వేలాది, లక్షలాది ప్రజలను క్రికెట్ మైదానాలు ఆకర్షించునట్లుగా చేశారు. భారతదేశ క్రికెట్ రంగం లోని అత్యంత ప్రతిభావంతులైన వారిలో ఆయన ముఖ్యుడు. ఆయన బ్యాటింగ్‌లోనే కాకుండా బౌలింగులో కూడా అద్భుత సామర్థ్యం కనబరిచారు. బ్యాటింగ్, బౌలింగ్‌లలో ఆయన ప్రదర్శించిన సామర్థ్యాలను గురించిన విశేషాలు వ్రాయడానికి ఈ పత్రికలోని పుటలు చాలవు.

నాయుడు రాజ కుటుంబంలో జన్మించలేదు. కాని రాజ వంశీయుల మధ్య సంచరించారు. క్రికెట్ క్రీడాకారులకు, నృపాలుడుగా రూపొందారు. "మరెవ్వరూ ఇలా చేసివుండరు అనుకునేటంత ప్రతిభావంతంగా ఆట ఆడినవాడే క్రికెట్ రంగంలో గణనీయమైన వ్యక్తి" అని నెవిల్లీ కార్డస్ ఒక సందర్భంలో పేర్కొన్నారు. సి. కె. నాయుడు నిస్సందేహంగా ఈ తరహాకు చెందిన క్రీడాకారుడు.

నాయుడుకు బౌలర్ను గురించిన పట్టింపు ఎప్పుడూ వుండేది కాదు. మౌరిస్ టాటే, గిరే, మెర్సెర్, బయిస్, అస్టిల్ వంటి ప్రతిభావంతులైన బౌలర్లు పాల్గొన్న ఒక ఆటలో ఆయన 100 నిమిషాలలోనే 153 పరుగులు అద్భుతంగా సాధించి ప్రేక్షకులను ఉర్రూతలూగించారు. ఆ ఇన్నింగ్స్‌లో ఆయన మొత్తం 11 సిక్సర్లు, 13 ఫోర్సు కొట్టారు.

లార్డ్స్‌లో ఎం. సి. సి. తో జరిగిన మ్యాచ్‌లో నాయుడు మరో సెంచరీ సాధించారు. అంతేగాక నాలుగు వికెట్లుకూడా తీసుకున్నారు. నాయుడు తమ 68 వ యేట ఒక ప్రథమశ్రేణి మ్యాచిలో 74 పరుగులుచేశారు. ఇది సామాన్యులకు సాధ్యమయ్యేదికాదు. ఆయన, జట్టులో చేర్చుకొనబడిన తరువాత మ్యాచ్‌కు గైర్‌హాజరు కావడమంటూ ఎప్పుడూ జరిగేదికాదు. అంతటి యోగ్యుడాయన.

నాయుడు క్రికెటు ఆటగాడు మాత్రమేకాదు. టెన్నిస్, అథ్లెటిక్స్, బిలియర్డ్స్, టేబిల్ టెన్నిస్, హాకీ, గుర్రపుస్వారీ— వీటన్నింటిలోనూ ఆయన ఉద్దండుడు. ప్రతిభావంతులైన వారిని కనుగొనడంలో ఆయనకు మంచి నేర్పు వుండేది. విజయ్ హజారే, ముస్తాక్ అలీ, చందూసర్వటే, సి. ఎస్. నాయుడు మొదలైన ప్రముఖ క్రికెట్ ఆటగాళ్లు ఆయన ప్రోత్సాహంవల్లనే రాణింపులోనికి వచ్చారు. ఆయన భారత క్రికెట్ జట్టుకు సారథ్యం వహించారు. ప్రేక్షకుల అభిమానాన్ని విశేషంగా చూరగొన్న కెప్టెన్లలో ఆయన ఒకరు.

సి. కె. నాయుడు మరణవార్త దేశాన్నంతటినీ విషాదంలో ముంచెత్తింది. ఆయన తమ 72 వ యేట నవంబరు 14 వ తేదీన పరమపదించారు. తన సుపుత్రుడు ఒకడు దేశానికి క్రీడారంగంలో కీర్తి ప్రతిష్ఠలను సంపాదించి పెట్టినందుకు ఆంధ్రప్రదేశ్ గర్వపడుతున్నది. కీ. శే: సి. కె. నాయుడు ఆత్మకు శాంతి చేకూరుగాక.

X X X

ఆస్ట్రేలియాలో భారత క్రికెట్ జట్టు పర్యటన వారం రోజుల క్రితం ప్రారంభమైంది. ఈ పర్యటన సందర్భంలో మన జట్టు ప్రదర్శించే ప్రతిభా పూర్వకమైన ఆట కొరకు అభిమానులు ఆసక్తితో ఎదురుచూస్తున్నారు. మన జట్టుకు పటౌడీ నవాబు కెప్టెన్‌గా వ్యవహరిస్తున్నారు. ప్రతిభావంతుడైన ఈ యువ ఆటగాణ్ణి నాయకుడుగా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. సయ్యద్ ఆబిద్ అలీకికూడా జట్టులో స్థానం లభించడం రాష్ట్ర క్రికెటర్లకు సంతోష కారణం. ఇటీవల ప్రతిభావంతంగా ఆడుతున్నవారిలో ఈ హైదరాబాదు ఆటగాడు ఒకడు. బ్యాటింగ్, బౌలింగ్, ఫీల్డింగ్— ఈ మూడింటిలోనూ ఆయన ప్రజ్ఞకలవాడు. ఈ సీజన్ ఆరంభంలో ఆయన మద్రాసు, కేరళ జట్లతో జరిగిన పోటీలలో రెండు సెంచెరీలు సాధించాడు. దులీప్ ట్రాఫీ టోర్నమెంటులో మంచిగా స్కోరు చేశాడు. బొంబాయిలో జరిగిన దులీప్ ట్రాఫీ ఫైనల్స్‌లో రెండవ ఇన్నింగ్స్‌లో ఆబిద్ అలీ కేవలం 31 పరుగులకే నాలుగు పశ్చిమ మండలం వికెట్లను పడగొట్టాడు. ఆయనకు భారత జట్టులో స్థానం లభించడానికి ఇవి చాలు. ఆయనకు శుభం కలుగుగాక.

X X X

విజయవాడలో రంజీ ట్రాఫీ మ్యాచ్‌లో ఆంధ్ర జట్టు సమర్థవంతంగా ఆడి మైసూరుతో 'డ్రా' చేసుకున్నది. ఈ మ్యాచ్ స్మరణీయమైనది. ఎందు చేతనంటే దీనిలో మైసూరు ఆటగాడు జి. ఆర్. విశ్వనాథ్ 230 పరుగులు సాధించాడు. ఈ ఛాంపియన్‌షిప్స్‌లో పాల్గొనడం అతనికి అదే ప్రథమం. తొలి పర్యాయమే అతను రెండు సెంచరీల పరుగులు చేయగలిగాడు. ఇట్టి ఘనత పొందిన రెండవ బ్యాట్స్‌మన్ విశ్వనాథ్. 1934లో టోర్నమెంటు ప్రారంభమైన యేడాది—ఉత్తర భారత జట్టు తరపున ఆడిన జి. ఇ. బి. అబెల్, సైనిక్ జట్టుపై రెండు సెంచరీలు చేసి రికార్డు సృష్టించాడు.

* * *

మొయినుద్దౌలా గోల్డ్‌కప్ ఇన్విటేషను క్రికెట్ టోర్నమెంటు ఈ సంవత్సరం నిరాడంబరంగా ప్రారంభమైంది. భారత దేశపు సమర్థులైన ఆటగాళ్లు చాలామంది ఇప్పుడు ఆస్ట్రేలియాలో పర్యటిస్తున్నారు. టోర్నమెంటుకు ఆకర్షణ చేకూర్చడానికి నిర్వాహకులు సింహళం ట్రాన్స్‌పోర్ట్ ఎలెవన్ జట్టును ఆహ్వానించడానికి ప్రయత్నించారు. ఈ వ్యాసం వ్రాసే నాటికి టోర్నమెంటు తొలి మ్యాచ్ సమాప్తమైంది. దానిలో వజీర్‌సుల్తాన్ కోల్ట్స్ జట్టు హైద్రాబాదు ఎలెవన్ జట్టును అయిదు వికెట్లతో ఓడించింది. కోల్ట్స్ జట్టులో ముగ్గురు ఆటగాళ్లుతప్ప మిగిలిన వారంతా అంతగా పేరుపొంది



రాష్ట్ర అథ్లెటిక్ పోటీలలో ఇ. ఎం. ఇ. కేంద్ర టీం ఛాంపియన్ షిప్ గెలుచుకున్నది

స్థానిక ఆటగాళ్లే కావడంచేత హైదరాబాదుకు సునాయాసంగా గెలుపు సిద్ధిస్తుందని అంతా అనుకున్నారు. కాని కాల్ట్స్ సమర్థంగా ఆడి అద్భుత విజయం పొందారు.

* * *

వర్ధిష్ణువులైన ఆటగాళ్లను ఆకర్షించే ఉద్దేశంతో హైదరాబాదు క్రికెటు సంఘం ఈ సంవత్సరం అంతర పాఠశాలల క్రికెట్ టోర్నమెంటును నిర్వహించింది. మద్రసే ఆలియాకు జూనియర్ ఛాంపియన్‌షిప్ లభించగా ఆల్‌సెయింట్స్ హైస్కూల్‌కు సీనియర్ ఛాంపియన్‌షిప్ వచ్చింది.

* * *

దక్షిణ మండలం వరుసగా మూడవ సంవత్సరం దులీప్ ట్రోఫీని కైవసం చేసుకున్నది. పశ్చిమ మండలంపై మొదటి ఇన్నింగ్స్ ఆధిక్యం ప్రాతిపదికపై ఈ గెలుపు లభించింది దక్షిణ మండలం తరఫున ఆడిన పటౌడీ 200 పరుగులు చేయడం ఈ మ్యాచ్ ముఖ్యాంశం. పశ్చిమ మండలం జట్టులో పాల్గొన్న మాజీ కెప్టెన్ నారి కంట్రాక్టర్ 130 పరుగులుచేసి, వెస్టిండీస్ పర్యటన సందర్భంలో తనకు తగిలిన దెబ్బలు తనఆట సామర్థ్యంపై ఏ విధంగానూ దెబ్బతీయలేదని మరో పర్యాయం నిరూపించుకున్నాడు. ఈ మ్యాచ్‌లో మూడు అంకెలలో పరుగులు చేసిన మరో ఆటగాడు అజిత్ వాడేకర్.

* * *

కటక్‌లో జరిగిన జాతీయ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్ క్వార్టర్ ఫైనల్స్‌లో ఆంధ్రప్రదేశ్, ఒరిస్సాతో 2-3 స్కోరుతో ఓడిపోయింది. మైసూరు, బెంగాల్‌ను ఒకే ఒక గోల్‌తో ఓడించి సంతోష్ ట్రాఫీని గెలుచుకున్నది. 14 సంవత్సరాల అనంతరం మైసూరు మళ్లీ ఈ ట్రాఫీని పొందింది. విరామ సమయానికి నాలుగు నిమిషాలు ముందుగా అహ్మద్‌ఖాన్ నేరుగా గోల్‌చేసి తన జట్టుకు గెలుపు చేకూర్చాడు.

* * *

హైదరాబాదులో జరిగిన అంతర్విశ్వవిద్యాలయ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్స్‌లో జబల్పూర్, పంజాబ్‌ను 1-0 స్కోరుతో ఓడించి అశుతోష్ ముఖర్జీ షీల్డును పొందింది. విరామ సమయానికి 9 నిమిషాలు ముందు సెంటర్ ఫార్వర్డ్ భూలేరామ్ మ్యాచ్ ఏకైక గోల్‌ను చేశాడు. సెమీ ఫైనల్స్‌లో జబల్పూర్ కలకత్తాను ఓడించగా పంజాబు, బెంగుళూరుపై గెలుపొందింది.

అమెరికాకుచెందిన వృత్తి క్రీడాకారుల బృందం-డల్లస్ టర్నాడస్‌జట్టు రాష్ట్ర రాజధాని నగరానికి రావడం స్థానిక ఫుట్‌బాల్ క్రీడాభిమానులకు సంతోషం కలిగించింది. మన దేశంలో లోగడ జరిగిన మూడు మ్యాచ్‌లలో వీరు ఓడిపోయారు. కాని నగరంలో ఆంధ్రప్రదేశ్ జట్టుతో జరిగిన మ్యాచ్‌ను డ్రా చేశారు ఉభయపక్షాలు ఒక్కగోల్‌కూడా చేయలేక పోయాయి. అమెరికాలో ఈ ఆట ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్నది.

* * *

ఢిల్లీలో జరిగిన డి సి ఎమ్ ఫుట్‌బాల్ టోర్నమెంటులో ఆంధ్రప్రదేశ్ జట్టు, దక్షిణ-మధ్య రైల్వే స్పోర్ట్స్ అసోసియేషన్ జట్టుకూడా క్వార్టర్ ఫైనల్స్‌కు చేరుకొని రంగంనుంచి నిష్క్రమించాయి. పోలీసుజట్టును టోర్నమెంటు విజేతలైన మఫత్‌లాల్ గ్రూప్ (బొంబాయి) జట్టు 1-0 స్కోరుతో ఓడించగా, జలందర్ లీడర్స్ క్లబ్ (టోర్నమెంటు రన్నర్స్ అప్) జట్టు దక్షిణ-మధ్య రైల్వే జట్టును 4-0 స్కోరుతో ఓడించింది.



రాష్ట్ర అథ్లెటిక్ పోటీల స్త్రీల ఛాంపియన్‌షిప్ విజ్ఞానకళాశాల స్త్రీల బృందం గెలుచుకున్నది

గత నెలలో లండన్‌లో జరిగిన ప్రీ ఒలంపిక్ హాకీ టోర్నమెంటులో ఇండియా సరిగా ఆడలేకపోయింది. బ్రిటన్‌తో జరిగిన పోటీస్కోరు 3-2. ఫ్రాన్స్‌తో జరిగిన మ్యాచ్ డ్రా అయింది. ఉభయపక్షాలు ఒక్కొక్క గోల్‌చొప్పున చేశాయి.

పాకిస్తాన్ ఇండియాను ఒకే ఒక గోల్ తేడాతో ఓడించింది. 60 వ నిమిషంలో షార్ట్‌కార్నర్ద్వారా లెఫ్‌బ్యాక్ తారిఖ్ ఈ గోల్ చేశారు. మెక్సికోలో జరిగే ఒలంపిక్ క్రీడోత్సవాలకు ఇంకా సంవత్సరం వ్యవధి కూడా లేదు. భారత దేశం తన హాకీ జట్టును శక్తివంతమైనదిగా రూపొందించుకోవడానికి ఇప్పటినుంచే ప్రయత్నాలు సాగించాలి.

* * *

టెన్నిస్‌లో ఇండియాకు దక్షిణాఫ్రికాతో దీర్ఘమైన ఓటమి లభించింది. దక్షిణాఫ్రికాతో మనకు దౌత్య సంబంధాలు లేకపోవడం చేత భారత, దక్షిణాఫ్రికా జట్లకు మధ్య జరిగిన డేవిస్ కప్ పోటీలను బర్సెలోనాలో నిర్వహించారు. దక్షిణాఫ్రికా ఆటగాళ్లు బాబ్ హెవిట్, క్లిఫ్ డ్రైస్డేల్ మన ఆటగాళ్లు కృష్ణన్, ముఖర్జీలపై తమ ఆధిక్యాన్ని నిరూపించుకున్నారు. భారతీయ ఆటగాళ్లు అయిదు మ్యాచ్‌లలోనూ ఓడిపోవడం అభిమానులను నిరుత్సాహ పరిచింది.

ఏమైనప్పటికీ టెన్నిస్‌లో భారతదేశానికి మంచి భవిష్యత్తు వున్నట్లు కనిపిస్తున్నది. కౌలాలంపూర్‌లో జరిగిన ఆసియా జూనియర్ టెన్నిస్ ఛాంపియన్ షిప్స్‌లో ఇండియా విజయంపొందింది. ఫిలిప్పైన్స్ ఆటగాళ్ళపై మన ఆటగాళ్లు సునాయాసంగా గెలుపు సాధించారు. భారత ఆటగాడు గౌరవ్ మిశ్రా ఆసియా బిరుదాన్ని గెలుచుకున్నాడు.

* * *

అఖిలభారత బహిరంగ అథ్లెటిక్ ఛాంపియన్‌షిప్ పోటీలు డిశంబరు 15, 16వ తేదీలలో లాల్‌బహదూర్ స్టేడియంలో జరుగనున్నాయి. కాబట్టి ఇటీవల జరిగిన రాష్ట్ర అథ్లెటిక్ ఛాంపియన్ షిప్ పోటీఫలితాలను ఆసక్తితో గమనించడం జరిగింది. ఈ పోటీలలో నాలుగు జాతీయ స్థాయి ప్రమాణాలనూ, 23 రాష్ట్రస్థాయి ప్రమాణాలనూ అధిగమించారు. ఈ విధంగా కొత్త ప్రమాణాలను సృష్టించిన వారిలో చాలామంది జూనియర్లు వుండడం, జాతీయ ప్రమాణాలను జవదాటిన నలుగురూ వర్ధిష్ణువులైన అథ్లెట్లు కావడం గమనార్హమైన విషయం.

* * *

మెనొనైట్ బ్రదర్న్ పాఠశాల విద్యార్థిని సి. డి. వరలక్ష్మి, 14 సంవత్సరాలలోపు వయస్సుగల బాలికలకు ఉద్దేశించిన షాట్‌పుట్ పోటీలో విజయం పొందింది. ఆమె జాతీయప్రమాణం (6.88 మీటర్లు) కంటే 0.07 మీటర్ల మెరుగుదలను సాధించింది. సెయింట్ పీటర్స్ విద్యార్థి ఎం. ఎస్. ఆల్బర్ట్ 100 మీటర్ల హర్డిల్స్‌ను 15.1 సెకన్లలో గెలుపొందాడు. జాతీయ ప్రమాణం కంటే ఇది 1.1 సెకన్లు తక్కువ. జగదీష్‌కుమార్ (ఏ.ఓ.సి.) 3000 మీటర్ల స్టేపిల్‌చేజ్ పోటీని 9 నిమిషాల 39.2 సెకన్లలోనే ముగించారు.

* * *

ఆంధ్రప్రదేశ్ క్రీడా వ్యవహారాల మండలి అధ్యక్షులు శ్రీ ఎస్. రామచంద్రారెడ్డి ఈ పోటీలను ప్రారంభోత్సవంచేశారు. జిల్లా ప్రాంతాలనుంచి కూడా కొంతమంది అథ్లెట్లు వచ్చి పోటీలలో పాల్గొనడంపట్ల ఆయన సంతోషం ప్రకటించారు. "రాష్ట్ర ఛాంపియన్‌షిప్" అని వ్యవహరించడానికి పూర్వం ఆ టోర్నమెంటులో రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలకు చెందిన క్రీడాకారులు కూడా పాల్గొనడం అవసరమని ఆయన అన్నారు. క్రీడామండలి అధ్యక్షుడు వెలిబుచ్చిన అభిప్రాయాలతో క్రీడాభిమానులందరూ ఏకీభవించగలరు. జంటనగరాలలోని జట్లతోమాత్రమే "రాష్ట్ర ఛాంపియన్‌షిప్స్" ను నిర్వహిస్తుండడం తరుచుగా జరుగుతుంటుంది.

క్రీడారంగం ప్రయోజనం దృష్ట్యా రాష్ట్ర సంఘాలు తమ కార్యకలాపాలను జిల్లాలకుకూడా విస్తృతీకరించవలసివుంది. క్రీడామండలి ఈ సమస్యను చేపట్టాలి. జిల్లా ప్రాంతాలలో క్రీడా కార్యకలాపాలను ప్రోత్సహించడానికి రాష్ట్రక్రీడా మండలి యథాశక్తి కృషిచేస్తున్న దనడంలో సందేహంలేదు. రాష్ట్రమంత్రిటా, జిల్లా స్పోర్ట్స్, గేమ్స్‌పోటీలు జరుగుతున్నాయి. జిల్లాస్థాయి పోటీలు ముగిసిన తరువాత మండలస్థాయి పోటీలను ఏర్పాటుచేయడానికి ఆంధ్రప్రదేశ్ క్రీడామండలి సన్నాహాలు చేస్తున్నది. ఇటువంటి రాష్ట్రస్థాయి పోటీలు 1968 జనవరిలో జరుగుతాయి.

* * *

కుస్తీ పోటీలలో భారతదేశం మొదటి రజత పతకాన్ని గెలుచుకున్నది. కొత్తఢిల్లీలో జరిగిన ప్రపంచ ఫ్రీస్టైల్ రెజ్లింగ్ ఛాంపియన్‌షిప్స్ బాంథమ్ వెయిట్ పోటీలో భారతీయ ఉస్తాదు బిషంబర్‌సింగ్ ద్వితీయుడుగా వచ్చాడు. సోవియట్ రెజ్లర్ అలీ ఆలీవ్ ప్రథమ స్థానం పొందాడు. టీమ్ ఛాంపియన్ షిప్‌ను సోవియట్ యూనియన్ గెలుచుకున్నది. వారికి నాలుగు స్వర్ణ పతకాలు, మూడు రజత పతకాలు లభించాయి.

* * *

సికింద్రాబాదులోని రైల్వే గ్రౌండ్స్‌లో జరిగిన అంతర రైల్వే వాలీబాల్ టోర్నమెంటులో దక్షిణ–మధ్య రైల్వే గెలుపొందింది. దక్షిణ–మధ్యమండలం ఏర్పడినతరువాత జరిగిన మొదటి వాలీబాల్ టోర్నమెంటు ఇదే. తొలి ప్రయత్నంలోనే అంతర రైల్వే టోర్నమెంటులో గెలుపొందడం దక్షిణ–మధ్య రైల్వే వాలీబాల్ జట్టుకు గర్వకారణం. ఫైనల్స్‌లో వారు ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ (పెరంబూర్) జట్టును ఓడించారు. దక్షిణ–మధ్య రైల్వే జట్టులోని అబ్దుల్లాహుసేనీ, అబ్దుల్‌హఫీజ్, రమణారావు, సహదేవ్, సుఖ్‌పాల్‌సింగ్ ఫైనల్స్‌లో మంచి ఆట ప్రదర్శించారు

వాలీబాల్ నగరంలో బాగా ప్రజాదరణ పొందిన ఆటలలో ఒకటి కావడంచేత అంతర–రైల్వే టోర్నమెంటును ప్రేక్షకులు అధిక సంఖ్యలో తిలకించారు. ప్రేక్షకుల కొరకు చక్కని ఏర్పాట్లు చేసినందుకు టోర్నమెంటు నిర్వాహకులు అభినందనీయులు.

*

# సంస్కృతి

చరిత్రకందని కాలంనుంచీ అపూర్వ సంస్కృతీస్రవంతి ఆంధ్ర దేశాన్ని పరివేష్ఠించి ప్రవహించి యీ దేశపు భూములను కళామయమూ, సౌందర్య పరిపూరితమూ చేస్తూ వస్తున్నది కృష్ణా గోదావరీ నదీతీరస్థభూముల్లో ఎన్నో కళామండపాలను నెలకొల్పింది. కాలం కరచిన సంస్కృతీ శిథిలశకలాలు నేటికీ మనకు యిక్కడ దర్శనమిస్తాయి అమరావతి, నాగార్జున కొండ భట్టిప్రోలు మొదలైనచోట్ల అపూర్వ శిల్పసంపద ఆంధ్రుల శిల్పవిజ్ఞానానికి మచ్చుతునకలు. అజంతారాళ్ళను మలచి, శిలాఫలకాలమీద చిత్రాలు చిత్రించిన కీర్తి ఆంధ్రులదే. లేపాక్షి కుడ్య చిత్రసంపద ఆంధ్ర కళాలక్ష్మికి కలికితురాయి ఆంధ్రదేశంలోని ప్రతి యిసుక రేణువూ కళావైభవాన్ని చాటి చెప్పుతుంది. ప్రతి యిల్లూ ఒక సుందర కళామండపాన్ని తలపుకు తెస్తుంది.

ఆంధ్రదేశంలో దేవాలయంలేని వూరులేదు. ఎక్కడకు వెళ్ళినా అపూర్వమైన శిల్పాలతో ఈ దేవాలయాలు దర్శనమిస్తాయి. ఇవి భక్తికి నిలయాలు మాత్రమేగాదు కళకు ప్రాంగణాలు కూడా.

# యాత్రలు

నాగార్జునసాగర్ నిర్మాణం పూర్తయితే నాగార్జున కొండలోయ అంతా మునిగిపోతుంది. చారిత్రక ప్రాధాన్యం గల అపూర్వ వస్తు సంచయమంతా ఆ నీట అడుగున కప్పడిపోతుంది. ఒకనాటి మన పురావైభవ చిహ్నాలు, అవశేషాలుగా కూడా మనకు దక్కకపోవచ్చు. అందుకని అక్కడి శిల్ప వస్తుసంపదనంతా మరొక సురక్షిత స్థానానికి తరలించవలసివుంది. నాగార్జునకొండ మీద ఒక పురావస్తు ప్రదర్శనశాలను నిర్మించాలని, అందులోనికి నాగార్జునలోయలోని చారిత్రక శిల్ప శిథిలావశేషాలను తరలించి ప్రదర్శించాలనీ భావించారు. స్వర్గీయ ప్రధాని జవహర్లాల్ నెహ్రూ దీనికి ప్రధాన కారకులు ఈ ఆలోచనకు 1959లో వాస్తవ రూపకల్పన జరిగింది. 1959లో మ్యూజియం నిర్మాణం ఆరంభమై షుమారు ఆరేళ్ళలో పూర్తయ్యింది 1966 ఏప్రెల్ 24వ తేదీన కేంద్ర విద్యాశాఖ మంత్రి శ్రీ ఎం సి. చాగ్లా ఈ మ్యూజియంకు ప్రారంభోత్సవం చేశారు.





చుట్టూ కనుచూపు మేర పరివ్యాప్తమైవున్న నీలిమ కాంతులీనే కృష్ణా తరంగిణి ఓరిలల మధ్య కలువ పూవులె వున్న కొండ పైభాగాన నిర్మింపబడిన ఈ మ్యూజియం మన దేశంలోని మ్యూజియంలలోనే అపూర్వమైనది

నాగార్జున కొండలోయ ప్రాంతం ఒకనాడు బౌద్ధమతానికి కేంద్రమై విలసిల్లింది. మాధ్యమిక వాద ప్రవక్త ఆచార్య నాగార్జునుడు నాగార్జునకొండపైనే నివసించి దేశ దేశాలకు బౌద్ధమతాన్ని పరివ్యాప్తం చేశాడు. ఆ నాటి ఆంధ్ర శిల్పులు చెక్కిన అపురూప శిల్ప సంపద కాలగతిలో నాశనం కాగా మిగిలిన శకలాలను ఈ లోయలో త్రవ్వి తీస్తున్నారు. మన పురాతత్వశాఖ వారి ఆధ్వర్యంలో యీ పనులు అతి చురుకగా కొనసాగుతున్నాయి. వీటిని కొండమీద నిర్మించిన మ్యూజియంలో భద్రపరుస్తున్నారు. గత కాలపు శిల్పకళా ప్రాభవం కన్నుల పండువుగా అక్కడ దర్శనీయమౌతుంది.

## ప్రత్యేక రైలులో కాశ్మీరు యాత్ర

రాష్ట్ర జన సంబంధశాఖ 1967 అక్టోబరులో కాశ్మీరుకు ఒక ప్రత్యేక రైలులో యాత్రను ఏర్పాటు చేసింది. ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాలనుండి పర్యాటకులు యీ యాత్రలో ఉత్సాహంగా పాల్గొన్నారు. భూతల స్వర్గమని పిలవబడే కాశ్మీరుతోపాటు భారత రాజధాని నగరం ఢిల్లీని, ప్రపంచ ప్రసిద్ధమైన తాజ్‌మహాల్, చండీగఢ్, లూధియానా, మనాలి, వాంగల్ ఆనకట్టను సందర్శించారు. ఈ యాత్రా సందర్భముగా తీసిన కొన్ని ఫొటోలను ప్రక్కపుటలో ప్రచురిస్తున్నాము.

# చిత్రసీమ

గవర్నర్ ప్రసంగిస్తున్న దృశ్యం

ప్రసాద్ స్టూడియోకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు

ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర పరిశ్రమ చరిత్రలో పెద్దరోజైన ఆగస్టు 14వ తేదీన "బ్రహ్మానంద చిత్రపురి"కి ప్రారంభోత్సవం జరిగింది. ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి రెండు స్టూడియోలకు శంకుస్థాపన చేశారు. నిర్మాతలగు ఎల్. వి. ప్రసాద్‌కు చెందిన ఒక స్టూడియో, నటుడు శ్రీ ఎన్. టి. రామారావుకు చెందిన స్టూడియో—"బ్రహ్మానంద చిత్రపురి"లో 206 ఎకరాల విస్తీర్ణంలో నిర్మించబడుతున్నాయి. హైదరాబాదు—విజయవాడ రోడ్డుపై రాజధానికి 8 మైళ్ళ దూరంలో బ్రహ్మానంద చిత్రపురి నిర్మించబడుతున్నది.

సుప్రసిద్ధ సినిమా కళాకారులు సర్వశ్రీ ఎ. నాగేశ్వరరావు, సావిత్రి, జమునీగణేశ్, అంజలీదేవి, కృష్ణకుమారి, ఎస్. వి. రంగారావు, పద్మనాభం, సూర్యకాంతం, చంద్రశేఖర్, జగ్గయ్య, రాజసులోచన యీ ఉత్సవానికి హాజరయినారు. చిత్రనిర్మాతలు, డైరెక్టర్లు సర్వశ్రీ డి. మధుసూధనరావు, సి. ఎస్. రావు, టి. ప్రకాశరావు, డిస్ట్రిబ్యూటర్లు శ్రీ కె. శ్రీనివాసరావు, కవులు డా॥ సి. నారాయణరెడ్డి, శ్రీ హజరత్ జయపురి మొదలగు కళాకారులెందరో యీ ఉత్సవానికి వచ్చారు.

ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించిన ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ భూమిని సమకూర్చడంతోపాటు, విద్యుచ్ఛక్తి, నీరు యితర సౌకర్యాలుకూడా కల్పించబడతాయని హామీయిచ్చారు.

ఆధునిక కెమెరాలు, లెబొరేటరీ పరికరాలు, యితర స్టూడియో పరికరాల దిగుమతికి అవసరమైన విదేశమారకద్రవ్యం సంపాదించడంలో కూడ ప్రభుత్వం తోడ్పడుతుందని ఆయన అన్నారు.

ఆధునిక పద్ధతులలో అన్నిహంగులతోకూడిన రెండు అధునాతన స్టూడియోలను ఏర్పాటు చేయడానికి ముందుకువచ్చిన శ్రీ ఎన్. టి. రామారావు, శ్రీ ప్రసాదులను ముఖ్యమంత్రి అభినందించారు. వారికి యివ్వగల్గిన సౌకర్యాలన్నియు యిదివరకుకూడా అందజేయగలమని హామీ యిచ్చారు. రాష్ట్రంలో చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధికి గత రెండేళ్లుగా ప్రభుత్వం తీవ్రంగా కృషి చేస్తున్నదనీ, పెద్దపెద్ద నిర్మాతలు, కళాకారుల సహకారంతో ఎంతో అభివృద్ధిని సాధించగలిగిందనీ అన్నారు. చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికై వినోదపు పన్నునుండి కొంతభాగాన్ని ఏర్పాటు చేయాలనీ ప్రభుత్వం భావించినట్లు ముఖ్యమంత్రి పేర్కొన్నారు. ఏటా దీని ద్వారా 5 లక్షల రూపాయలు ప్రత్యేకంగా లభిస్తుంది.

చిత్రపురికి ప్రారంభోత్సవం చేస్తూ రాష్ట్రగవర్నరు, యీ చిత్రపురిలో స్టూడియోల నిర్మాణానికి స్థలాన్ని అందజేయడమే గాక యిక్కడ చలనచిత్ర పరిశ్రమలోని వారినిమిత్తం ఒక ఇళ్ళ కాలనీకూడా ఏర్పాటు చేయబడుతుందని అన్నారు. హైదరాబాదు బహుభాషలకు, సంస్కృతులకూ సంగమస్థానం కావడంవల్ల యిక్కడ ఏడాది పొడవునా అన్ని భాషాచిత్రాలు తయారయ్యే విధంగా ప్రథమశ్రేణి చిత్రకేంద్రంగా రూపొందగలదని పేర్కొన్నారు. శ్రీ రామారావు, శ్రీ ప్రసాదుల కృషికి జయాన్ని కాంక్షిస్తూ ఆంధ్ర ప్రదేశ్ బహుముఖాభివృద్ధి చెందేట్లు చేయడమే ప్రభుత్వ లక్ష్యమని, అందువల్ల చలనచిత్ర పరిశ్రమ స్వాభావికంగానే ప్రముఖస్థానం వహిస్తుందనీ ఆయన పేర్కొన్నారు.

చలనచిత్ర పరిశ్రమకు ప్రభుత్వం చేసిన విజ్ఞప్తిని పురస్కరించుకుని హైదరాబాదును చలనచిత్రపరిశ్రమ కేంద్రంగా అభివృద్ధి పరచడానికి శ్రీ ప్రసాద్, శ్రీ ఎన్. టి. రామారావు వంటివారలు ముందుకు రావడం మెచ్చుకోదగినదనీ, శ్రీ రామారావు యిక్కడ ఒక స్టూడియోను నిర్మింపదలచడమేగాక ఒకపెద్ద సినిమాహాలుగల సువిశాలమైన ఎస్టేటునుకూడా నెలకొల్పుతున్నారనీ జనసంబంధ

శాఖ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ తెలియజేశారు. రాష్ట్ర చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధికి అనువైన వాతావరణాన్ని యిక్కడ కల్పించడానికి యింతకు పూర్వమే కృషిచేసిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావును మంత్రి అభినందించారు. ఈ రెండు స్టూడియోలు ఏర్పాటు కావడంతో హైదరాబాదులో మొత్తం నాలుగు స్టూడియోలు వుంటాయి.

హైదరాబాదులో అన్ని హంగులతో కూడిన ఒక పెద్ద స్టూడియో ఏర్పాటు చేయడంలో తనశక్తి వంచనలేకుండా ప్రయత్నిస్తానని శ్రీ ఎల్. వి. ప్రసాద్ పేర్కొన్నారు.

హైదరాబాదుకు తరలివచ్చి, యిక్కడ చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధికి తమకు వీలయిన సహాయమంతా చేయాలని శ్రీ నాగేశ్వరరావు, తెలుగు చలనచిత్ర పరిశ్రమలోని తదితర ప్రముఖులూ భావిస్తున్నారంటే అందుకు ప్రధాన కారణం ముఖ్యమంత్రి, జనసంబంధశాఖ మంత్రి తమ పట్ల చూపిస్తున్న ఉదారత, స్నేహపూరితమైన దృక్పథమేనని శ్రీ ఎన్. టి. రామారావు తెలియజేశారు. కళాకారులు, నిర్మాతలు, సాంకేతిక నిపుణులు, ఎగ్జిబిటర్లు, డిస్ట్రిబ్యూటర్లు అందరి సహకారం లభించినప్పుడే యీ పరిశ్రమ అభివృద్ధి చెందుతుందనీ, యిందుకు తన సహకారం ఎల్లప్పుడూ వుంటుందనీ ఆయన వ్యక్తంచేశారు.

హైదరాబాదులో చలనచిత్ర పరిశ్రమాభివృద్ధిని గూర్చి ఒక విలేఖరి ఆంధ్రప్రభ సెప్టెంబరు 1వ తేదీ సంచికలో సవివరంగా సమీక్షిస్తూ బ్రహ్మానంద 'చిత్రపురి'కి ప్రారంభోత్సవం జరగడంతో హైదరాబాదులో చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధిలో ఒక కొత్త శకం ఆరంభమైందనీ, హయత్‌నగర్ ప్రాంతంలో ఒక చిన్న సైజు హాలీవుడ్‌గా రూపొందగలదనీ ఆయన తన ఆశాభావాన్ని వ్యక్తంచేశారు. హైదరాబాదులో చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి అవిరళంగా కృషిచేస్తున్నందుకు ముఖ్యమంత్రిని, జనసంబంధశాఖ మంత్రిని ఆయన అభినందించారు.

బ్రహ్మానంద చిత్రపురికి ప్రారంభోత్సవం జరగడంతోను, హయత్ నగర్‌లో రెండు కొత్త స్టూడియోలకు శంకుస్థాపన జరగడంతోను హైదరాబాదులో చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి బలమైన పునాది పడినట్టయిందని ఆంధ్రభూమి సెప్టెంబరు 5వ తేదీ సంచికలో మరొక విలేఖరి పేర్కొన్నారు.

## వినోదపు పన్ను

రాష్ట్రంలో చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి వినోదపు పన్నులో కొంత భాగాన్ని వినియోగించాలన్న ప్రభుత్వ నిర్ణయాన్ని ఆంధ్రజ్యోతి అక్టోబరు 22వ తేదీ సంచిక సంపాదకీయంలో శ్లాఘించింది. ఇతర కళలను కూడా—ముఖ్యంగా నాటక కళను అభివృద్ధి పరచవలసిన అవసరాన్ని గూర్చి ఆ పత్రిక నొక్కి చెప్పింది. ప్రభుత్వం, చలనచిత్ర పరిశ్రమకు అందజేస్తున్న సహాయాన్ని వీటికి కూడా విస్తరింప జేయాలని ఆ పత్రిక పేర్కొన్నది ★

# దేశరక్షణ

## రైలులో దేశరక్షణ ప్రదర్శన శాల

"రక్షా ప్రదర్శన" అనే పేరుతో రైలులో ఏర్పాటు చేసిన దేశరక్షణ ప్రదర్శనకు, ఢిల్లీ రైలుస్టేషన్‌లో అక్టోబరు 4వ తేదీన రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు. అక్టోబరు 5, 6 తేదీల వరకు ఢిల్లీ ప్రజలు ఈ ప్రదర్శనను తిలకించారు. అక్టోబరు 8వ తేదీన రైలు హరియానాకు వెళ్ళింది. అక్కడి నుండి దేశంలోని వివిధ ప్రాంతాలను సందర్శిస్తూ 18 నెలల కాలంలో సుమారు 80 స్టేషనులలో యీ ప్రదర్శన జరుగుతుంది.

మీటరు గేజిలోకూడ యిటువంటి ఏర్పాటు చేస్తున్నారు. దీని పని రెండునెలలలో పూర్తి అవుతుంది. ఈ ప్రదర్శనను కూడ 80 స్టేషనులలో ఏర్పాటు చేస్తారు. ఈ రెండు ప్రదర్శనలకు సుమారు రూ. 40 లక్షలు ఖర్చు అవుతుంది. దేశరక్షణ శాఖ, కేంద్ర సమాచార శాఖ సంయుక్తంగా యీ ఖర్చును భరిస్తాయి.

# జిల్లాలనుండి

## వినియోగదారుల సహకార సంఘం :

ప్రొద్దుటూరు వినియోగదారుల సహకార కేంద్ర దుకాణం రాయచోటి బ్రాంచి ఒకటి యిటీవలే జమ్మలమడుగులో ప్రారంభించబడింది.

## వంతెనకు ప్రారంభోత్సవం:

రాజమండ్రికి 35 మైళ్ళ దూరంలో ఏలేరు నదిపై ఆగస్టు 13వ తేదీన 150 అడుగుల వంతెనకు రహదార్ల శాఖామంత్రి శ్రీ జె. వి. నరసింగరావు ప్రారంభోత్సవం చేశారు. రూ 1,67న లక్షల వ్యయంతో ఈ వంతెనను నిర్మించారు.

## ఉన్నత పాఠశాల భవనం :

ఏపిలేశ్వరపురం సమితి ప్రాంతంలోని కోటిపల్లిలో రూ 50,000లతో నిర్మించిన జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల భవనానికి అక్టోబరు 25వ తేదీన తూర్పు గోదావరి జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు ప్రారంభోత్సవం చేశారు.

## సామూహిక హాలుకు ప్రారంభోత్సవం :

సికింద్రాబాదులోని న్యూ మెట్టుగూడలో సామూహిక వి నాలయ హాలును పరిశ్రమల శాఖామంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి సెప్టెంబరు 1న ప్రారంభోత్సవం చేశారు. బాగా విశాలంగా, ముందు ముందు విస్తరించటానికి వీలుగా నిర్మించిన ఈ హాలుకు రూ 10,000లు ఖర్చయ్యాయి.

## నెహ్రూ బాలవిహార్‌కు ప్రారంభోత్సవం :

హైదరాబాదులోని విజయనగర్ కాలనీలో క్రీడామైదానానికి వ్యవసాయ శాఖామంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి సెప్టెంబరు 11న ప్రారంభోత్సవం చేశారు. బాలలు ఆడుకోవటానికై కొత్త ఆగాపురాలో కూడా ఒక క్రీడా మైదానానికి పురపాలక సంఘం కమిషనరు శ్రీ గిరిధర్‌రాజ్ సక్సేనా ప్రారంభోత్సవం చేశారు.

## జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం:

కరీంనగర్ జిల్లాలోని తోటపల్లిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి రెవెన్యూ శాఖ మంత్రి శ్రీ వి. బి. రాజు ప్రారంభోత్సవం చేశారు. వడ్లూరు, బీగంపేట గ్రామాల్ని కూడా సందర్శించి అక్కడ జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు. భూమిలేని రైతులకు శ్రీ వి. బి. రాజు బంజరు భూముల పట్టాలను కూడా పంపిణీ చేశారు.

## రైతులకు పట్టా సర్టిఫికెట్లు:

ఖమ్మంజిల్లా కలెక్టరు శ్రీ అమ్జాద్ అలీఖాన్ సెప్టెంబరు 5వ తేదీన కొత్తగూడెం తాలూకాలోని దావన్న పాలెం, రాఘాపురం గ్రామాలలో 500 మంది రైతులకు పట్టా సర్టిఫికెట్లను పంపిణీ చేశారు. ఈ సర్టిఫికెట్లను తెలంగాణా కౌలుదారీ చట్టంలోని 37వ సెక్షన్ క్రింద పంపిణీ చేయటం జరిగింది.

## సంగారెడ్డిలో నర్సుల హాస్టల్ :

సంగారెడ్డిలో అక్టోబరు 19న కేంద్ర ఆరోగ్య, కుటుంబ నియంత్రణ శాఖ స్టేట్ మంత్రి డా. ఎస్. చంద్రశేఖర్ నర్సుల హాస్టల్ భవనానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ భవనాన్ని ఆంధ్ర మహిళా సభ వారు నిర్మించారు. గ్రామీణ ప్రాంతాలలోని మహిళల పురోభివృద్ధికై మహిళాసభ అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ చేస్తున్న కృషికి ఆమెను డా. చంద్రశేఖర్ అభినందించారు. ఈ భవనంలో విశాలమైన గదులు 15 వున్నాయి. రెండు లెక్చర్ హాలులు, ఒక భోజనాలగది, వంటగదులు, స్నానాల గదులు వున్నాయి. దీనికి రూ 1,20,000 లు ఖర్చు అయ్యింది. దీనిలో 60 మంది శిక్షణ పొందుతున్న నర్సులు వుండటానికి వీలువుంది.

## గ్రామీణ నీటి సరఫరాకు గ్రాంటు :

నల్గొండ జిల్లాలోని పంచాయతీ సమితులన్నింటికి గ్రామీణ నీటి సరఫరా పథకం క్రింద ఈ సంవత్సరంలో ఇప్పటి గ్రాంటుగా రూ 62,000లు మంజూరు చేయబడ్డాయి. ఈ పద్దు పనులకు రూ 5 లక్షలు కూడా కేటాయించడం జరిగింది.

## రైతులకు ఋణాల పంపిణీ :

నడిగూడెం రెవెన్యూ సర్కిలులోని రైతులకు సెప్టెంబరు 3వ తేదీన, 4వ తేదీన నల్గొండ జిల్లా, మిర్యాలగూడెం ఆర్.డి.ఒ. రూ 8,000ల మేరకు ఋణాలను పంపిణీ చేశారు. ఈ సర్కిలు కరువుకు గురైన ప్రాంతం. అందువల్ల ఈ సర్కిలులోని రైతులకు సహాయక చర్యల క్రింద సేద్యపు నీటి బావుల త్రవ్వకానికి, ఆయిల్ ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటార్లు కొనుగోలుకుగాను తకావి బ్యాంకు ఋణాలను మంజూరు చేస్తున్నది.

## ఇండ్ల స్థలాలకు పట్టాలు :

కొత్తపేట పంచాయతీ సమితిలోని వేపచెల్లి గ్రామంలో జరిగిన ఒక బహిరంగసభలో హరిజనులు, యితర వెనుకబడిన వర్గాలకు చెందిన 203 కుటుంబాలకు ఇండ్లు కట్టుకునే నిమిత్తం స్థలాలను యిస్తూ పట్టాలను పంపిణీ చేశారు. శ్రీ పి. అబ్బాస్, ఆర్. డి. ఒ. 111 ఎకరాల మేరకు పట్టాలను పంపిణీ చేశారు.

## గ్రామీణ మంచినీటి సరఫరా పథకం :

గ్రామవాసులకు రక్షిత మంచినీటి సరఫరాను అందించవలసిన అవసరం దృష్ట్యా తృతీయ ప్రణాళికా కాలంలో సాధ్య

మైనన్ని ఎక్కువ గ్రామాలకు తగినంతగా మంచినీటి సరఫరా సౌకర్యాలను కల్పించాలని ఉద్దేశించారు. ఈ పథకం క్రింద నల్గొండ జిల్లాలో 1,614 బావుల త్రవ్వకం పనుల్ని చేపట్టారు. వీటిలో 892 బావుల నిర్మాణం 1966_67 నాటికి పూర్తయ్యింది.

రక్షిత మంచి నీటి సరఫరా పథకాలను 39 గ్రామ పంచాయతీలకు అనుమతించారు. దీనికి రూ 34,75,000లు ఖర్చు అవుతుందని అంచనా. 30 గ్రామ పంచాయితీలలో నిర్మాణపు పనులు జరుగుతున్నాయి.

## పాఠశాల భవనానికి శంకుస్థాపన :

నిజామాబాదులోని ... సంక్షేమ కేంద్ర ఆవరణలో ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాల భవనానికి ఆరోగ్యశాఖామంత్రి శ్రీ పి. వి. నరసింహారావు, సెప్టెంబరు 27న శంకుస్థాపన చేశారు. లక్ష రూపాయల ఖర్చుతో ఈ భవన నిర్మాణాన్ని చేపట్టిన మహిళా విజ్ఞాన సంఘాన్ని మంత్రి అభినందించారు

## విత్తనాల నిమిత్తం గ్రాంట్లు :

నిజామాబాదు 1, 2 స్థాయి సంఘాలు వచ్చి ఎరువు సం... ... 1,000లు, కాయగూరల విత్తనాలకు, ఆధునిక వ్యవసాయ పరికరాలకు రూ 1,000లు, ప్రదర్శన క్షేత్రాల నిమిత్తం రూ 3,900 మంజూరు చేసింది.

## పరిషత్తు ఉన్నత పాఠశాలకు ప్రారంభోత్సవం :

రావేపల్లి గూడెంలో ఏర్పాటైన ... ఆర్. స్మారక జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల భవనానికి సెప్టెంబరు 8న విద్యాశాఖామంత్రి శ్రీ ... ప్రారంభోత్సవం చేశారు. ... సమావేశానికి పంచాయతీ రాజ్ మంత్రి శ్రీ ... అధ్యక్షత వహించారు. దేవాదాయ శాఖ మంత్రి శ్రీ ... రామలింగరాజు గ్రంథాలయ భవనానికి శంకుస్థాపన చేశారు.

## తణుకులో నేత్ర శిబిరం:

పశ్చిమ గోదావరి జిల్లా సంక్షేమసంఘం అధ్వర్యంలో తణుకులో అక్టోబరు 8న ... నేత్ర శిబిరం ఏర్పాటుచేయబడింది. ఏలూరు ప్రభుత్వ ప్రధాన కార్యాలయ ఆసుపత్రిలో కంటి నిపుణుడు డా॥ ఎం. ఆర్. రావు ఈ శిబిరంలో 22 శస్త్రచికిత్సలు జరిపారు.

## సామాజిక కేంద్రాల ఆవశ్యకత:

ప్రజాస్వామిక వ్యవస్థలో గ్రామాలలోని సామాజిక కేంద్రాలే చేయూతనిస్తాయని, సంపూర్ణ ప్రధాన కేంద్రాలని ఆగస్టు 20వ తేదీన ఏలూరులో జనసంబంధశాఖ ఏర్పాటుచేసిన బి. డి. ఓ. ల సమావేశంలో రాష్ట్ర జనసంబంధ, గ్రామీణశాఖా మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ అన్నారు.

## పైనా గ్రామీణుల కృషికి మంత్రి ప్రశంస :

తమ గ్రామాన్ని అన్ని విధాలా స్వయంసమృద్ధి చేసుకోవడానికి పైనా గ్రామీణులు జరిపిన కృషిని దేవాదాయ మంత్రి శ్రీ ఆర్. రామలింగరాజు విశేషంగా కొనియాడారు. సామర్లకోటకు దగ్గరలో వున్న పైనా గ్రామంలో అక్టోబరు 27న రక్షిత మంచినీటి సరఫరా పథకానికి మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## సూపర్ బజారుకు ప్రారంభోత్సవం :

విశాఖపట్టణంలో అక్టోబరు 21న సూపర్ బజారుకు సహకార శాఖామంత్రి శ్రీ వి. ... ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్ర విధాన సభ స్పీకర్ శ్రీ బి. వి. సుబ్బారెడ్డి అధ్యక్షత వహించారు. రాష్ట్రంలో ఏర్పాటు చేయబడిన సూపర్ బజార్లలో యిది రెండవది. మొదటిది హైదరాబాదులో ఏర్పాటు చేయబడింది.

# పాఠకుల లేఖలు

## ఆంధ్ర ప్రదేశ్ ఎడిటర్ గారికి

ఆర్యా,

నమస్కారం. ఇటీవల కొన్ని నెలలుగా ఆగిపోయిన "ఆంధ్రప్రదేశ్" తిరిగి నవంబరు నించి రావడం చాలా సంతోషించదగ్గ విషయం. వెనకటికీ, యిప్పటికీ పత్రికలో మార్పు కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. ఇంతకు ముందు మీ పత్రికలో సాహిత్యం ఎక్కువగావుండేది. ఇప్పుడు అదికొంత తగ్గి, ప్రభుత్వం ప్రచురించే పత్రిక గనుక ప్రభుత్వం చేస్తున్న పనులను గురించి వివరిస్తూ, దానితోపాటు సాహిత్యాన్ని కూడా అందజేయడంవల్ల పత్రికను ఎక్కువగా పాఠకులు ఆసక్తితో చదవడానికి వీలుంటుంది. అవని మీరు చేస్తున్నారు. సుఖం.

పత్రికలో సాహిత్యంపేరుతో సీరియల్ లు వేస్తున్నారు. మాసపత్రికలో సీరియల్ లను చదవటం అనేది చాలాకష్టం. నెలపొడుగునా కథను జ్ఞాపకం పెట్టుకుని ఎక్కడ కూర్చోగలం? కనుక ఇకపై సీరియల్ లను తగ్గించి, దానిబదులు కథలు, సాహిత్యవ్యాసాలు వేయడం మంచిదని నా అభిప్రాయం.

ఇట్లు
**రావి కామేశ్వరరావు**
రాజమండ్రి.

## ఆంధ్ర ప్రదేశ్ సంపాదకులకు

మీరు ఈ మధ్య పత్రికలో తెచ్చిన మార్పులు చాలా సముచితముగాను, ప్రయోజనాత్మకముగాను యున్నవి. ముఖచిత్రము ఇదివరకు త్రివర్ణ చిత్రముగా వేయుచుంటిరి. అది ఎందుకు మానినారో తెలియదు. పత్రికపైన ఆకర్షణీయముగా లేకపోయినను లోపలివిషయములు చాలా ఆసక్తికరముగా నున్నవి దీనికి మిమ్ములను అభినందించు చున్నాడను.

భవదీయుడు
**ఎస్. అప్పలస్వామి**
విజయనగరం.

# గడచిన నెలలో...

ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంత వరకు నవంబరు నెల ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది. పదకొండు సంవత్సరాల క్రితం దీపావళి పర్వదినమైన నవంబరు 1వ తేదీన కీ. శే. పండిత జవహర్‌లాల్ నెహ్రూ యీ రాష్ట్ర అవతరణ ప్రారంభోత్సవం చేశారు. తిరిగి యీ సంవత్సరం దీపావళి పండుగ, అవతరణ దినోత్సవం ఒకేరోజున సంభవించాయి. అవతరణ దినోత్సవాన్ని ఘనంగా జరపాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది ప్రతి సంవత్సరం యిదే రీతిగా జరపాలని ఉద్దేశించారు.

ఉత్సవాలను జరపడంలో గల లక్ష్యం శ్లాఘనీయమైనది. విన్యాసాల సందర్భంలో ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ప్రసంగిస్తూ అన్నారు. ప్రాంతీయ దురభిమానాలను పెంపొందించడానికి గాక ఆయాప్రాంతాల సర్వతోభివృద్ధికి భాషా రాష్ట్రాలను ఏర్పాటు చేయడం జరిగిందని అన్నారు. సర్వతో అభివృద్ధి, సమైక్యత సాధన లక్ష్యంతో ఒకేభాష మాట్లాడే ప్రజలను ఒక చోటికి చేర్చడం జరిగింది. భాషా రాష్ట్రాలను యేర్పాటు చేయాలనే ఉద్యమంలో ముందంజ వేసిన ఆంధ్రప్రదేశ్‌కు జాతీయ సమైక్యతా సాధనలోను, విచ్ఛిన్నకరధోరణులను రూపుమాపడంలోను ప్రత్యేకమైన బాధ్యతలు ఉన్నాయని ఆయన అన్నారు.

జంట నగరాలలో అవతరణ దినోత్సవాలను వైభవంగా జరిపారు. ప్రతి కేంద్రంలోను ఒక మంత్రి, ఒక మాజీ మంత్రి, ఒక ప్రతిపక్షనాయకుడు ముఖ్య అతిథులుగా ఆహ్వానించబడినారు నవంబరు 1న రాష్ట్ర అవతరణ దినోత్సవాన్ని పెద్దఎత్తున జరపాలని ఉద్దేశించిన ఘనత రాష్ట్ర జనసంబంధ శాఖ మంత్రికి దక్కుతుంది. ప్రతి పౌరునిలో తానుభారతీయుడననే భావన ప్రబలే విధంగాను, జాతీయ సమైక్యత పెంపొందే విధంగాను రాష్ట్రమంతటా రిపబ్లిక్ దినోత్సవం, స్వాతంత్ర్య దినోత్సవం జరపడానికి యిదేవిధంగా కృషిచేయాలి. ప్రారంభంలో యీ ఉత్సవాలను జరుపుకున్నంత ఉత్సాహంగా యీనాడు అది జరగడంలేదు.

అనేక ప్రోత్సాహక కార్యక్రమాలను అమలు జరపడం ద్వారా రాష్ట్రంలో చలన చిత్రపరిశ్రమ అభివృద్ధికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం తీవ్రంగా కృషిచేయడం అభినందనీయమైన విషయం. అయితే హైదరాబాదు-విజయవాడ రోడ్డుపై రాజధానికి 8 మైళ్ళదూరంలో హయత్‌నగర్ సమీపంలో ముఖ్యమంత్రి పేర "బ్రహ్మానందచిత్రపురి" కి ప్రారంభోత్సవం జరగడం ప్రభుత్వ కృషికి ప్రత్యక్ష నిదర్శనంగా భావించవచ్చు. హైదరాబాదులో మరి కొన్నిస్టూడియోలు నిర్మించడంవల్ల అధికసంఖ్యలో చలన చిత్రాలను నిర్మించడానికి అవకాశం ఏర్పడుతుంది ప్రభుత్వం కల్పించిన సౌకర్యాల ఫలితంగా కొద్దిరోజులలోనే హైదరాబాదు చలనచిత్ర పరిశ్రమ ప్రధాన కేంద్రంగా భాసిల్లవచ్చు

## వారోత్సవాలు:

రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలో నవంబరు 14వ తేదీనుంచి (నెహ్రూజన్మదినోత్సవం) నవంబరు 19వ తేదీవరకు (శ్రీమతి గాంధీ జన్మదినోత్సవం) శిశు, స్త్రీ సంక్షేమ సప్తాహాన్ని పెద్దఎత్తున జరపడం ముదావహం. నెహ్రూ బాలహితుడు మాత్రమేగాక జాతి నిర్మాత అయిన శ్రీమతి ఇందిరాగాంధీ, మనదేశానికి ప్రప్రథమ మహిళా ప్రధాని. ఈ సంవత్సరంతో ఆమెకు 50 ఏళ్ళు వస్తాయి ఈ ఉత్సవాల నిర్వహణ ఫలితంగా ఆ మహనీయుల మహత్తర కృషిని మననం చేసుకోవడానికి వీలుకలుగడమే గాక వారిని మార్గదర్శకులుగా స్వీకరించి ఉత్సాహంతో కృషిచేయడానికి వీలుకలుగుతుంది.

ఎ. ఐ. సి. సి. పరిశీలకుడు శ్రీ లలితసేన్ ఆధ్వర్యంలో వ్యవస్థాగత ఎన్నికల విషయంలో ప్రదేశ్ కాంగ్రెసులోని అధికార వర్గం, అసంతృప్త వర్గాల మధ్య ఒప్పందం కుదరడం రాజకీయ రంగంలో ముఖ్యమైన ఘట్టంగా పేర్కొనవచ్చు. ప్రజాస్వామ్యంలో ప్రభుత్వసుస్థిరత, పార్టీవ్యవస్థలోని సమైక్యత, ప్రశాంతతలపై ఆధారపడి ఉంటుంది.

## రాజు సంఘం నివేదిక:

జిల్లాలో అభివృద్ధి సాధనకు ఒకే వ్యవస్థ బాధ్యత వహించే విధంగా జిల్లాపరిపాలనను పునర్వ్యవస్థీకరించే విషయంలో ఎం. టి. రాజు సంఘం సమర్పించిన నివేదికను ప్రభుత్వం ఆమోదించడం పరిపాలనలో మరో ముందడుగుగా భావించవచ్చు. విధానాలను రూపొందించడంలో ప్రజాప్రతినిధులు భాగస్వాములైనా ఆ విధానాలను అమలుజరిపే బాధ్యతను అధికారులకు అప్పజెప్పాలనే ప్రాతిపదికపై యీ పథకాన్ని రూపొందించారు. ప్రస్తుతపు ప్రధాన కార్యదర్శి అయిన శ్రీ ఎం. టి. రాజు, జిల్లాపరిపాలనకు సంబంధించిన సమస్యా పరిష్కారానికి ఆచరణ యోగ్యమైన మార్గాన్ని సూచించారు. అభివృద్ధి కృషిలో లభించిన ఫలితాలు ప్రజలకు అందడం లేదేమోననే భయాన్ని ముఖ్యమంత్రి యిటీవల వ్యక్తం చేశారు. దాని ఫలితంగానే యీ సంఘం ఏర్పడింది. ఇటీవల హైదరాబాదులో ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్, రెండు రోజుల పాటు ఏర్పాటు చేసిన సదస్సులో యీ కొత్త పథకాన్నిగూర్చి

చర్చించారు. ప్రణాళికను మరింత పటిష్ఠవంతంగా అమలు జరప డానికి వీలుగా యిటువంటి తీవ్రమైన చర్యను తీసుకున్నందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని యీ సభ్యులు అభినందించింది. ఈ రాష్ట్రంలో ప్రయోగాత్మకంగా అమలు జరుపుతున్న యీ పథకాన్ని యితర రాష్ట్రాలలో అమలు జరిపడానికి ప్రాతిపదికగా స్వీకరించ వచ్చు.

### ఆర్. టి. సి.

దాదాపు జిల్లా హెడ్‌క్వార్టర్స్ అన్నిటిని, హైదరాబాదులో కలుపుతూ మొదటి ప్రాంతాల బస్సుసర్వీసులను ప్రవేశపెట్టి మొదటి రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థను అభినందించవచ్చు. కార్పొరేషన్ నూతన అధ్యక్షుడు శ్రీ ఎస్. ఎ. అయ్యంగార్ సెప్టెంబరు 22న హైదరాబాదు – బెంగుళూరు డీలక్స్ ఎక్స్‌ప్రెస్ బస్సు సర్వీసుకు ప్రారంభోత్సవం చేయడంద్వారా బస్సుసర్వీసుల విస్తరణరంగంలో దీనిని ప్రత్యేక చర్యగా భావించవచ్చు.

హైదరాబాదు నుండి మరో రాష్ట్ర రాజధానికి సరిగా రోడ్డు రవాణా సంస్థ బస్సులను నడపడం యిదే ప్రథమం. రవాణా శాఖల కార్యదర్శిగా శ్రీ అయ్యంగార్, రవాణా సమస్యలలో గడించిన అనుభవంద్వారా ప్రయాణీకులకు యితోధిక సౌకర్యాలు కల్పించడానికి వీలు ఏర్పడుతుంది.

– పరిశోధకుడు

---

# ప్రపంచ పరిస్థితులు

– నాగేశ్వరరావు

కరెన్సీ విలువ తగ్గింపు విషయంలో అందరూ ఒకే పద్ధతిని అనుసరిస్తారు. ఒక దేశపు కరెన్సీ విలువ తగ్గింపుకు ముందు అక్కడి సెంట్రల్ బ్యాంకులు, ట్రెజరీలు, ఆర్థిక మంత్రులు, తదితరులు అటువంటిదేమీ జరగబోదన్నట్లే మాట్లాడుతారు.

బ్రిటన్ విషయంలో మాత్రం. విలువ తగ్గింపును గూర్చి అధికారికంగా ప్రకటించడానికి ముందుగానే కొంతకాలంగా ఊహాగానాలు బయలుదేరినాయి. విల్సన్ మంత్రివర్గం ఏర్పడినప్పటి నుండి పౌండు విలువను గూర్చిన సమస్య అంతకంతకు తీవ్రంగా పరిణమించి యేదో ఒక చర్య తీసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. చెల్లింపు లావాదేవీల విషయంలో మిగులును సాధించాలనే కృషి విఫలమైన తర్వాతనే పౌండు విలువ తగ్గింపుకు ఛాన్సలర్ కల్లాగన్ అంగీకరించినట్లు తెలుస్తున్నది. పౌండువిలువను గూర్చి సాకల్యంగా పరిశీలించిన తర్వాత ప్రధాన మంత్రి విల్సన్ యీ తీవ్రచర్యకు ఒప్పుకున్నారు. పౌండు విలువ తగ్గింపుకు ముందు ఆఖరు చర్యగా బహుదేశాల నుండి ఋణాలు సేకరించే కార్యక్రమాన్ని అమలు జరిపారు. అయితే అది కూడా తాత్కాలిక నివారణోపాయంగానే రుజువు అయింది. ఇప్పుడు యీ ఋణాలను అంతర్జాతీయ ద్రవ్యనిధి ద్వారా అందజేస్తారు. దీనికి విరాళాలు యివ్వడానికి ఉమ్మడి మార్కెటు దేశాలు కూడా అంగీకరించాయి. ప్రపంచ మార్కెటులో తగ్గించబడిన తన కొత్త రేట్లను స్థిరీకరించుకోవడంలో బ్రిటన్‌కు ఈ ఋణం వీలుకల్పిస్తుంది.

### బ్రిటన్ ఋణ అవసరాలు:

పౌండు విలువతగ్గింపు ఫలితంగా బ్రిటిష్ ప్రజల ఆహారపు ఖర్చులు 2శాతం ఎక్కువ అవుతాయి. అయితే బ్రిటన్ జరిపే ఎగుమతులు అధికంకావడంతో బ్రిటిష్ ఆర్థికరంగంలో కొత్త జీవనం ప్రారంభమవుతుంది. అదృష్టవశాత్తు బ్రిటన్ తన పౌండు విలువ తగ్గించిన వెంటనే ఐర్లాండు, డెన్మార్కు దేశాలు కూడ తమ కరెన్సీల మార్పక విలువలను తగ్గించాయి. ఇతర విషయాలతో పాటు ఆహార పదార్థాల సరఫరాకు బ్రిటన్ యీ దేశాలపైననే ప్రధానంగా ఆధారపడి ఉన్నందున యిది కొంతవరకు ఆ దేశానికి లాభదాయకమనే భావించాలి. గోధుమలు, గోధుమ పిండి ఎక్కువగా సరఫరాచేసే ఆస్ట్రేలియా, కెనడా దేశాలు తమ కరెన్సీల విలువలను తగ్గించకపోయినా న్యూజిలాండ్ కూడా బ్రిటన్‌ను అనుసరించ బోతున్నది.

జపాను, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్స్‌వంటి ముఖ్యమైన దేశాలు తమ కరెన్సీల విలువలను తగ్గించకపోవడం గమనార్హమైన విషయం. దీనిఫలితంగా అమెరికన్ డాలర్‌పై ఎక్కువ భారం పడదు.

పౌండు విలువ తగ్గింపు విషయంలో శ్రీ విల్సన్ సరి అయిన సమయాన్నే ఎన్నుకున్నారు. ఈ తీవ్రసంఘటనపై కామన్స్ సభ చర్చించాలని ప్రతిపక్షపార్టీ అయిన కన్సర్వేటివ్ పార్టీ కోరుతూ యీ సమస్యపై విల్సన్ ప్రభుత్వాన్ని అభిశంసించడానికి ప్రయత్నాలుచేస్తున్నా, ప్రభుత్వం విదేశీ ఒత్తిడులకు లొంగిపోయి స్టెర్లింగ్ విలువతోపాటు దేశప్రతిష్ఠను గంగపాలు చేసిందని విమర్శించాలనేదే వారి ప్రధానలక్ష్యం. బ్రిటన్‌లో మరి రెండేళ్లలో ఎన్నికలు జరిగే సమయానికి ఆర్థిక పునర్వికాసంద్వారా లభించే ఫలితాలు ప్రజలకు అందే అవకాశం ఉన్న దృష్ట్యా ఎన్నికల నాటికి ప్రజల అభిమానం తమ పార్టీకి తప్పకుండా లభిస్తుందని శ్రీ విల్సన్ ఆశాభావం.

పౌండు విలువ తగ్గింపు ఫలితంగా ఉమ్మడి మార్కెటులో బ్రిటన్ చేరే అవకాశాలు అధికమైనాయని చెప్పడానికి వీలులేదు. ఉమ్మడి మార్కెటులో బ్రిటన్ చేరే సమస్యయింకా అలాగే ఉందని ఫ్రాన్స్ ఆర్థిక మంత్రి మైఖేల్ డెబ్రి ప్రకటించారు.

బ్రిటన్ కరెన్సీ మారకం రేటులో 14.3 శాతం తగ్గుదలవల్ల భారతదేశానికి నష్టమేమీలేదు. ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీదేశాయ్ ప్రకటించిన ప్రకారం బ్రిటన్‌కు జరిగే మన ఎగుమతులలోకూడ పెద్ద మార్పేమీ కలుగదు. అంతేగాక బ్రిటన్ నుండి మనము దిగుమతి చేసుకునే వస్తువులధర రూపాయి మారకంలో 14.3 శాతం తగ్గుతుంది. ఇతర దేశాలు దిగుమతి వస్తువుల ధరలకన్నా యివి

యింకా తక్కువగా వుంటాయి. పైన ఎగుమతుల విషయంలో కొన్ని యిబ్బందులు ఏర్పడినా ఎగుమతిచేసే వస్తువులలో మార్పులేమీ ఉండవు

## ఆయుధాల రాజకీయాలు:

ఫ్రాన్స్, పశ్చిమజర్మనీ వంటి కొన్ని యూరప్ దేశాలు, లాటిన్ అమెరికా దేశాలకు సైనిక విమానాలు, ఆయుధాలను ఎగుమతి చేయడంలో పోటీ పడడం అమెరికాకు ఆందోళన కలిగిస్తున్నది. ఫలితంగా ఈ దేశాలకు ఆయుధాలను సరఫరా చేయాలనే స్వంత ప్రతిపాదనను అమెరికా కాంగ్రెసు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నది. లాటిన్ అమెరికాకు యుద్ధవిమానాల సరఫరా ప్రతిపాదనను విరమించని పక్షంలో విదేశ సహాయబిల్లును ఆమోదించవని అమెరికన్ కాంగ్రెసు పట్టుపట్టింది.

ఈ తీవ్ర ప్రతిఘటనకు ప్రధాన నాయకులు లిబరల్ పార్టీకి చెందిన హెన్రీ ఎస్ రూస్ గత 17 సంవత్సరాలలో విక్రయం రూపంలోను, బహుమతి రూపంలోను 37 బిలియన్ డాలర్ల విలువగల 20,000 టాంకులు, 10,000 విమానాలు, ఆయుధాలు, ఆయుధ సామాగ్రిని అనేక దేశాలకు అందజేసినప్పటికీ ఒక స్నేహితుణ్ణిగానీ, దేశానికి ప్రతిష్ఠనుగానీ సంపాదించలేక పోయిందనే విమర్శ వచ్చింది.

ఆయుధాల సరఫరాలో పోటీ పెరగడంవల్ల ఆసియాలో ముఖ్యంగా భారత ఉపఖండంలో ఆర్థికరంగంలో ఎటువంటి అనిశ్చిత పరిస్థితులు ఏర్పడినదీ యిటీవలి సంఘటనలు రుజువు చేశాయి. ఒక వైపు శాంతి వచనాలు పలుకుతూ, మరోవైపు ఆయుధాలు సరఫరాచేయడం వినాశహేతువు అవుతుందని ఆ సంఘటనలు స్పష్టంచేశాయి మన భారతదేశానికి సంబంధించినంతవరకు డల్లెస్ ప్రారంభించిన యీ వినాశకర విధానాలకు మన సైనికుల అమూల్యమైన రక్తాన్ని బలిగా యివ్వాల్సివచ్చింది.

నవంబరులో, ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలో గల 2 కోట్లమంది ఇస్మాయిలీ ముస్లిముల హాజర్ ఇమామ్ ప్రిన్స్ కరీం ఆగాఖాన్ హైదరాబాదు సందర్శించారు. 1957లో ఇమామ్ పదవి స్వీకరించిన 31 సంవత్సరాల వయసుగల ఆగాఖాన్ హైదరాబాదు రావడం యిది రెండవసారి. తమవర్గం ప్రజలు తాము నివసించే ప్రాంతాల ప్రజలతో కలిసిమెలసి ఉంటూ, ఆ ప్రాంతం అభివృద్ధికి తోడ్పడాలని ఆయన తన సందేశంలో ఉద్బోధించారు. హైదరాబాదు కౌన్సిల్ ఆధ్వర్యంలో 5,000 మంది ఇస్మాయిలీలు ఉన్నారు. ఆగాఖాన్ తన సమక్షంలో జరిగిన అనేక వివాహాలకు ఆశీస్సులు అందజేశారు.

మతాధికారులు తరచుగా యీ విధమైన పర్యటనలు జరపడం లాభదాయకంగా ఉంటుంది. ఇటీవలనే వెజాపర్ మతానికి చెందిన స్వామీజీ యిక్కడికి వచ్చారు. ఆయన భక్తులు ఆయనను పెద్ద ఊరేగింపుతో తీసుకెళ్ళారు. ఆయన ప్రబోధాత్మకమైన ప్రసంగాన్ని చేశారు.

శృంగేరి పీఠాధిపతి జగద్గురు శంకరాచార్యులవారు కూడ హైదరాబాదు వచ్చారు.

కంచి కామకోటి పీఠాధిపతి జగద్గురు శంకరాచార్యులు కూడ డిసెంబరులో రానున్నారు

## పరిశ్రమలు:

హైదరాబాదు సమీపంలోని మౌలాలిలో యూనియన్ కార్బైడ్ వారు కోటిరూపాయల ఖర్చుతో కొత్తగా నిర్మించిన బ్యాటరీ పరిశ్రమను గవర్నరు పట్టంథానుపిళ్ళె ప్రారంభోత్సవం చేశారు. రిపబ్లిక్ ఫోర్జ్ వారి యూనిటుకూడ యిక్కడ నెలకొల్ప బడనున్నది. చాలా కొద్దిమొత్తంలో విదేశమారకద్రవ్యం వినియోగించబడిన యీ పరిశ్రమను 13 నెలల స్వల్పకాలంలోనే నెలకొల్పారు. దీనిని నాల్గింతలు విస్తరింప జేయవచ్చు. ఈ పరిశ్రమలో అధునాతనమైన యంత్రపరికరాలు అమర్చినారు. ఈ పరిశ్రమలో ప్రస్తుతం వార్షికంగా 60 మిలియను సెల్సులు ఉత్పత్తి చేయవచ్చు. పరిశ్రమలో వినియోగించిన ఎక్కువ భాగం యంత్రాలను భారతదేశంలోనే తయారు చేశారు. ఈ విషయాన్ని గవర్నరు ప్రత్యేకంగా పేర్కొన్నారు. హిందుస్థాన్ యంత్ర పరికరాల ఫ్యాక్టరీలో తయారైన బాబిన్ స్టాంపింగ్ యంత్రం మినహా మిగతా యంత్రాలన్నిటినీ యీ బ్యాటరీ పరిశ్రమకు చెందిన ఇంజనీర్లు, సాంకేతిక సిబ్బంది సభ్యులు తయారు చేశారు. అవసరమైన సౌకర్యాలన్నిటినీ అందజేస్తూ లఘుపరిశ్రమలు, భారీపరిశ్రమలు రెండింటినీ పెంపొందించడానికి ప్రభుత్వం కృషిచేస్తు దని గవర్నరు హామీ యిచ్చారు.

"మాటలతో సరిపుచ్చే హామీకాదిది. ఆంధ్రప్రదేశ్‌లో యితోధిక విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, రవాణా, కమ్యూనికేషన్స్ సౌకర్యాల విస్తరణ, వాటికితోడు అపారంగా లభించే భూమి, శ్రామికశక్తి ఫలితంగా దేశంలో ఆంధ్రప్రదేశ్ ప్రముఖ పారిశ్రామిక రాష్ట్రంగా రూపొందే అవకాశాలు అపారంగా ఉండడమే దీనికి కారణం." అని ఆయన అన్నారు. పరిశ్రమల మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి, అఖిలభారత ఉత్పత్తిదారుల వార్షిక సమావేశంలో ప్రసంగిస్తూ యివే భావాలను వ్యక్తం చేశారు. కేంద్రప్రభుత్వ రవాణా, నౌకాయాన శాఖ మంత్రి డా॥ వి. కె. ఆర్. వి. రావు యీ సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.

# 'మనోరమ'లో ఒకరోజు

## హైదరాబాదు యాత్రికులకు 'మనోరమ' లో
## ఒకరోజు మరపురాని అనుభూతి

అది వారిని

గోల్కొండ కోట
చార్‌మినార్
పబ్లిక్ గార్డెన్స్
ఉస్మాన్‌సాగర్
సాలార్జంగ్ మ్యూజియం
ఉస్మానియా విశ్వవిద్యాలయం

మొదలయిన స్థలాలకు తీసుకొని వెళ్తుంది

*శుక్రవారం మినహా ప్రతిరోజూ పర్యటించవచ్చు*

## సాలార్జంగ్ మ్యూజియం

*ప్రవేశ రుసుముతో సహా*

**రూ. 8-00 మాత్రమే**

**రిజర్వేషన్లు చేయించుకోవలసిన స్థలము-మనోరమ బయలుదేరు స్థలము**

**రాష్ట్ర జన సంబంధ శాఖ**

*గాంధీభవనం ఎదుట, హైదరాబాదు.*

**ఫోన్ నం. 48281 మరియు 48282**

[illegible] BY THE DIRECTOR, JANA SAMBANDHA SAKHA, A.P. HYDERABAD. PRINTED BY THE DIRECTOR OF PRINTING AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD.

